

ప్రతిమా బుక్స్



# హెలెన్ కెల్లర్







ిత చిత్రణ ....

వాన్ బ్రూక్సు రచనకు
ఎన్.ఆర్. చందూర్ అనువాదం.

# హెలెన్ కెల్లర్

## (జీవిత చిత్రణ)


రచన:

వాన్ బ్రూక్స్

అనువాదం:

ఎన్. ఆర్. చందూర్





ప్రతిమా బుక్స్

49 మూకతాల్ వీధి

మద్రాసు-7

# విషయాలు

## ఎన్. ఆర్. చందూర్ మిగతా పుస్తకాలు

| | |
|---|---|
| నేల - నీరు | ఆఖరుకోరిక |
| మహానగరంలో | ఎక్కడికి కమలా? |
| నవచైనా | భానుమూర్తి భార్య |
| చెట్లు | రాధ నవ్వింది |
| ఆరు కథలు | కొత్త లోకాలు |
| మరొక ఆరు కథలు | కొన్ని గ్రంథాలు |
| ఈ నాగరికత | సీతతో సినీమాకి |
| నాలుగురోడ్లు | నట్టింట దీపం |
| ప్రతి గురువారం | మాంగుళూర్ మెయిల్ |
| అణుశక్తి | మహాబలిపురం |
| బాలరాజ్యం | మనకీ ఒక కారు |
| గ్రామ వైద్యుడు | సీతాఫలాలు |
| శిక్ష | భాష |
| అంతేనా | పూసలమెడ |
| కాఫీ మానెయ్యడం | శివరావు |
| పరిచయం చేసిన పుస్తకాలు | కలడో లేడో |
| అన్యాయం | |

# 1. ఏడేళ్ళ బాలిక

1932 చలికాలంలో సెయింట్ అగస్టిన్‌లోని ఒక చర్చి మందిరంలో హెలెన్ కెల్లర్ ప్రథమ దర్శనమయింది నాకు. అప్పటికప్పుడే ఆమె ప్రపంచ ప్రఖ్యాతినొందిన వ్యక్తి. ప్రఖ్యాత వ్యక్తులని చూడాలనే సహజాభిలాషే నన్ను ఆ రోజున ఆ చర్చికి పట్టుకుపోయింది.

హెలెన్ కెల్లర్ ఆమె పదవ ఏటనుంచీ లోకానికి తెలుసు. విటియర్ మహాకవి ఒళ్ళో కూచున్న బాలిక; ఫిలిప్ బ్రూక్సుని విక్టోరియా మహారాణి యీమెగురించి అడిగింది – ఈ ప్రకారం పెద్దల దృష్టిలోపడ్డ హెలెన్, పదేళ్ళు పూర్తిగా నిండకపూర్వమే యావత్ ప్రపంచానికీ ఒక 'ప్రత్యేక బాలిక' అయిపోయింది. 1890 లో ఆమె పేరున ఒక నౌక నిర్మించారు. ప్రసిద్ధ రచయిత ఆలివర్ వెండల్ హోమ్సు తన గ్రంథమొకదాంట్లో ఆమె లేఖ ప్రచురించాడు. వైట్‌హౌస్ ఆమెని ప్రెసిడెంట్ గ్రోవర్ క్లీవ్‌లాండ్ (President Grover Cleveland) కాలంలోనే ఆహ్వానించింది. ఆ తరువాత ఎందరెందరో ప్రెసిడెంట్లు ఆమెని తమ భవనానికి ఆహ్వానించారు. కాల్విన్ కూలిడ్జిని యీమె నవ్వించడం, జాన్ ఆఫ్ ఆర్క్ తరువాత యింతటి మహనీయురాలు జన్మించలేదని మార్క్ ట్వేన్ వల్ల మెప్పు పొందటం – యివన్నీ 1932 కి పూర్వం జరిగినవే! సెయింట్ అగస్టిన్‌లో ఆమె మాబోంట్లకు దర్శనమిచ్చేనాటికి యీ విషయా

లన్నీ లోకానికి సమగ్రంగా తెలుసు. 1932 నుంచి యిరవయ్యేళ్ళపాటు ఆమెని శ్రద్ధగా గమనించాను. ఈ యిరవయ్యేళ్ళూ ఆమె ప్రజ్ఞాపాటవాలు వీసమంతకూడా తగ్గక ఒకే మాదిరిగా వున్నాయి.

ఆరోజు కెథడ్రిల్‌లో హెలెన్ ఒకే ఒక్క వాక్యం ఉచ్ఛరించింది. మాకు ఆమె కంఠం వినడం అదే మొదటిసారి. ఉచ్చారణ స్పష్టంగా లేకపోయినా, పలుకులేమిటో పక్కనున్న 'టీచర్' మాకు విప్పి చెప్పింది. న్యూయార్కులోని సందుగొందులు, క్రూర మృగం దంతాలవలె తెరుచుకున్నాయి అని అందట. క్రూర మృగం దంతాలూ దవడలూ అనగానే నాకు బైబిలు కథలూ అందులోని సంగతులూ జ్ఞప్తికి వచ్చాయి. ఈమెకు బైబిల్ సాహిత్యం తెలుసా? - అనుకున్నాను క్షణకాలం. తరువాత తరువాత తెలిసింది ఆమెకి బైబిల్ అంటే ఎంత యిష్టమో! క్రూర మృగాలు నోళ్లు తెరవడం ఆమెకి ప్రత్యక్షంగా తెలుసు. ఒకసారి ఆమె సింహాపు జూలు స్పృశిస్తూ, సింహాన్ని ముట్టుకు చూసిందిట - ఆ సింహానికి ముందుగానే ఆహారం పెట్టి తగిన కట్టుదిట్టాలు చేశారనుకోండి. కాని యీామె సింహాపు బోనులోకి, అతి ధైర్యంగా తన టీచరు వెంట వెళ్ళడం, ఆమె సాహసానికి వుదాహరణగా చెప్పవచ్చు. టీచర్ యానీ సల్లివాన్, ఈమె మనసు విస్తరింపజేసేందుకు ప్రతి కొత్త అనుభవం దగ్గిరకు తీసుకెళ్తూండేది. బాల్యంనుంచి వ్యవసాయ క్షేత్రంలో జీవించినదై వుండటంవల్ల హెలెన్‌కి ఆవులూ, గుర్రాలు మొదలయినవి బాగా తెలుసు; ఆమె

చేతితో పెట్టిన ఆహారం అవి ఎంతో ఆప్యాయంగా తినేవి. ఏ జంతువూ ఆమెకే నాడూ హాని చెయ్యలేదు. తన విద్యార్థిని సాధు జంతువులతోపాటు క్రూర జంతువులు కూడా తెలుసుకోవాలని ఒకసారి సర్కస్ కాంపుకు తీసుకెళ్ళింది యానీ. హెలెన్ ఆ నాడు ఒక ఎలుగుబంటికి షేక్ హాండ్ యిచ్చింది; చిరుతపులి వీపు తట్టింది, జిరాఫీ చెవులు ఎలా వుంటాయో తెలుసుకునేందుకు - యీ అమ్మాయిని అంతపైకి ఎత్తారు. ఒక్క పెద్దపులినిమాత్రం ఆమె ముట్టుకోలేదు. అది దుష్టజంతువుగా ఆమె మనసులో నిల్చిపోయింది. ఏనుగ తన తొండాన్ని యీామె మెడ చుట్టూ ప్రేమగా వేసింది. పెద్ద పెద్ద పాములు వాటంతటవి ఎలా చుట్టుకు పోయేదీ ముట్టుకు చూసింది హెలెన్. ఇటువంటి ప్రత్యక్ష జ్ఞాన సంపర్కంవల్ల ఆమె భౌతికంగానూ, నైతికంగానూ భయమంటే ఏమిటో తెలియని వాతావరణంలో పెరిగింది. ఆమె జీవితం ఒక విధంగా అంధకారమయమైనప్పటికీ, అంతటి నిర్భయ స్తురాలు మరొకరు లేదేమో!

హెలెన్ కెల్లర్ తల్లితండ్రులు 'అలబామా' నివాసులు. ఈమె జన్మించే నాటికి తండ్రి ఒక స్థానిక వార్తా పత్రికకు సంపాదకుడు. అతను అమెరికన్ సివిల్ వార్ నాటి కెప్టెన్లలో ఒకడు. వారి తాతముత్తాతలది స్విడ్జర్లాండు. కెల్లర్స్ నివశిస్తున్న టస్కంబియా (Tuscumbia) గ్రామ జనాభా రెండువేలు. ఊళ్ళోకివచ్చే మట్టిరోడ్డుకి యిరుప్రక్కలా ఫలజాతులూ పంటపొలాలూ విరివిగా వుండేవి.

అలబామా రాష్ట్రం చాలాకాలంబట్టి ప్రకృతిశాస్త్ర కోవిదులని ఆకర్షిస్తోంది. అక్కడ కనిపించినన్ని సీతాకోక చిలకలూ, కీటకజాతులూ ఎక్కడా వుండేవికావట. కుంకుమ వన్నె ద్రాక్షతీగెలతో, వివిధ పూలజాతులతో, రంగు రంగుల కీటకాలతో, నవ్వే పువ్వులూ పాడే పక్షులూమధ్య మైమరపించే సుగంధ పరిమళాలతో, ఆ ప్రదేశమంతా ఎంటొమాలజిస్టుకి (Entomologist- ప్రకృతిలోని కీటక జీవపరిశోధకుడు) ఒక భూతల స్వర్గమే! అక్కడి చెట్లూ యిళ్లూ దొడ్లూ అన్నీకూడా పూలతీగలతో కప్పబడ్డవే! ఆసువిశాల ప్రదేశంలో పాతకాలపు జీవన విధానం ఏమంతగా మారలేదు యింకా. కోడిపెట్టలూ, పందులూ, గొర్రెలూ, పశుసంపదా, అశ్వ సంపదా, పెద్దలోగిలి, వెనకవైపుగా వంటయిల్లూ, అల్లంతదూరాన పశువుల సావిడీ – ఈ హంగులన్నిటితో కెల్లర్ కుటుంబపు జీవనపద్ధతి ఎప్పటిమాదిరిగానే వుంది. సివిల్ వార్ వచ్చింది, వెళ్ళింది, అందువల్ల వీరిలో కలిగిన మార్పు ఏమీలేదు. వేసవి కాలంలో కొండలమీద కాంప్ వేసుకునేవారు. హెలెన్ తండ్రీ, ఆయనస్నేహితులూ ఆ చుట్టుపట్ల ప్రదేశమంతా వేటమృగాలకోసం గాలించేవారు. పందిమాంసమూ లేడిమాంసమూ మొహంమొత్తేటంత దొరికేది.

ఏడేళ్లు నిండేవరకూ హెలెన్‌కి తన చుట్టూగల ప్రపంచమేమిటో తెలిసేదికాదు. 1880 జూన్ నెలలో ఆమె జన్మించింది. జ్ఞానం తెలిసినప్పటినుంచి ఆమె ఒక శూన్యజీవి (living nullity). ఏవో కదలికలూ వాసనలూ, స్పర్శలూ

తప్పు, ప్రపంచ మొక మహాశూన్యమువలె ('No-World') కన పడేదిట. ఆశలేదు, ఆశ్చర్యంలేదు, ఆత్రుతలేదు, ఆనందం లేదు, అసలు ఏమీలేదు, ఒకే అంధకారం. ఆ రోజులకి అర్థంపర్థంలేదు. పొగటివేళ నెరగని రోజులవి. అంతర్గత కోపతాపాలు భరించలేకనో ఏమో, అతి మొండిగా అల్లరి చేసేది. ఆమెని అదుపులో పెట్టడం సాధ్యమయేది కాదు. భోజనాలబల్ల దగ్గిర కుదురుగా కూచుని తింటూ తింటూ ఏ కారణము లేకుండా ఆ కప్పులూ ప్లేట్లూ విసిరికొట్టేది. నేల మీదపడి దొర్లేది. పుట్టినపుడు అందరికి మల్లేనే వుంది హెలెన్. ఏడాదిన్నరప్పుడు ఏదో జబ్బుచేసి నెమ్మదించిన వెనక, గణగణ గంటమోగితే ఆ శబ్దానికి చలించలేదు. తల్లి స్నానంచేయిస్తున్నప్పుడూ బట్టలు వేస్తున్నపుడూ కళ్లుమూయడం మానేసింది. ఈ రెండిటితో ఆ బాలికకి మూకత్వమూ బధిరత్వమూ ప్రాప్తించాయని అనుకున్నారు పెద్ద వాళ్ళు. కాని యీ అమ్మాయి ఒక మాదిరి 'బుద్ధిజ్ఞానాన్ని' (Intelligence) మాత్రం సౌంజ్ఞలతో కనబరిచేది. తిండి తినాలనీ, వెచ్చటి స్థలం వెతుక్కోవాలనీ తప్ప మరో ధ్యాస వుండేదికాదు. అదంతా వొక అయోమయస్థితి అనీ (A State of Anarcly), భావరహితమైనకంపనములతో (Meaningless Sensations) ప్రాణం కుతకుత లాడేదనీ, నిస్సహాయంగా ఒక్కరూ లోతైన చీకటి గొయ్యిలో బంధింపబడ్డట్టుగా వుండేదనీ, ఆమె తరువాత తనగ్రంథంలో రాసుకుంది. లోకంతో ఏవిధంగానూ సంభాషణ జరపడానికి వీలుగాని యీ సంవత్సరాలు, దట్టమైన పొగమంచులో ఓడ తనదారి

వెతుక్కుంటూ చేసే ప్రయాణంవంటిదనీ, స్పందించే హృదయమూ, ఏదో జరగకపోతుందా అనే వాంఛితమూ తప్ప, ఎటువంటి ఆశలూ లేని సముద్రయానమనీ, తీరరేఖ, రేవులూ తెలుసుకునేపాటి అవకాశంలేదనీ, ఈ వోడకి చివరకి దిక్సూచీ, తెరచాపలూకూడా లేవనీ ఎంతో జాలికరంగా పేర్కొంటుంది ఆత్మకథలో.

హెలెన్‌కి ఆరేళ్ళ వయసప్పుడు ఆమె తల్లి, డికెన్సు రాసిన అమెరికన్ నోట్సు (American Notes) అను గ్రంథం చదవడం తటస్థించింది. బోస్టన్ నగరంలో పెర్కిన్స్ సంస్థలో శామ్యూల్ హోవ్ (Samuel Howe) అను విద్యావేత్త దగ్గర శిక్షణపొందిన లారాబ్రిడ్జిమాన్ (Laura Bridgeman) అను అంధబాలిక గురించి ప్రస్తావిస్తాడుడికెన్సు. బధిరత్వమూ అంధత్వమూతో ఆ రెంటినీ కొంతలోకొంత జయించి, తనవంటివారితో సంభాషించగల లారాగురించీ, ఆమె టీచరుగురించీ డికెన్సు 1842 లో చాలా హృదయవిదారకంగా, ఎంతో ఆశాజనకంగా తన గ్రంథంలో పేర్కొన్నాడు. ఇది హెలెన్ తల్లి చదివింది. అంధులైనప్పటికీ తమ ప్రతిభతో మానవజాతికి మకుటాయమానంగా నిల్చినవారు, మహాకవి హోమర్‌నుంచి, గణితశాస్త్రవేత్త సాండర్సన్‌దాకా, ఎందరోవున్నారు. 1784 లో వాలెంటిన్ అను మహనీయుడు పారిస్ నగరంలో అంధులకని మొట్టమొదటి స్కూలు తెరిచాడు. ఫ్రెంచి మహావిప్లవం యింకా ప్రారంభం కాలేదు. బధిరులకి మొట్టమొదటి పాఠశాల కూడా ఆ కాలంలోనే ప్రారంభమయింది. డాక్టర్

హోవ్‌కి తారా ఒక ప్రత్యేక బాలిక అయింది. అర్ధరాత్రి వేళ సమాధి నిశ్శబ్దతనిపోలిన అంధకారంనుంచి ఆమెని రక్షిం చాలని ఆయన అనుకున్నాడు. తారాకూడా హెలెన్‌కి మల్లెనే మూక, బధిరాంధురాలు. డికెన్సు ఆమెగురించి వుదహరిస్తూ, ఆమె ముఖమండలం, విద్యావినయసంపదతో ప్రకాశిస్తోంది - అంటాడు. పెర్కిన్స్ సంస్థలో ఆమె తన డైరీ రాసుకుంటూండగా చూశాడు డికెన్సు. ఆమెని చూడ గానే కలిగిన భావాలు తన గ్రంథంలో పేర్కొన్నాడు. డాక్టర్ హోవ్‌గురించి అతని కృషిగురించి డికెన్సుకి అంతగా తెలియదు. 'అమెరికన్ నోట్సు' లో ఆ పది వాక్యాలూ హెలెన్ తల్లికి ఆశాజ్యోతుల్లా అగుపించాయి.

డాక్టర్ హోవ్ బోస్టన్ నగర నివాసి. గ్రీకుల తరఫున టర్కులతో పోరాడి, ఆ తరువాత పోలిష్ జాతివారి స్వాతంత్ర్యం కొరకై, వారి పక్షాన కొన్నాళ్ళు పోరాడి, ప్రష్యాలో కొంత కాలం ఖైదీగా బంధింపబడి, చివరికి యిది పని గాదనుకొని, అంధులకి సేవచేసే నిమిత్తమై వారికోసం ప్రత్యేకమయిన జాగ్రఫీ రచించి, ఎత్తుగావుండే మాపుల అట్లాసు తయారు చేయించాడు. ఎత్తుగావుండే అట్లాసంటే, వేలికొనలతో స్పృశించి ఆయా దేశాలూ చిత్రపటాలూ తెలుసుకోడమన్న మాట. అందులకని ప్రత్యేకింపబడ్డ పుస్త కాలు అప్పటికి మూడంటే మూడే ఉన్నాయి. డాక్టర్ హోవ్ సాహసించి, అంధులకోసమని ఒక ముద్రణాలయం స్థాపించాడు. పుస్తకాలు ప్రచురించడమే కాకుండా, వారి కష్టాలు స్వానుభవంతో తెలుసుకు నేందుకుగాను కళ్ళకి

గంతలు కట్టుకుని నిత్య వ్యవహారాలు చూసుకుంటూండే వాడుట. ఈ డాక్టర్ హోవ్ చనిపోయాడు: లారా మాత్రం అక్కడి సంస్థలో వుంది. లారా అనగా డాక్టర్ హోవ్ కృషికి సజీవనిదర్శనమన్న మాట. ఈ సంగతులు తెలిసీ తెలియగానే కెల్లర్ దంపతులు ఆ సంస్థతో ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభించారు. అప్పుడు డాక్టర్ హోవ్ అల్లుడు మైకేల్ ఆ సంస్థకి అధికారి. కెప్టెన్ కెల్లర్, అనగా హెలెన్ తండ్రి, తన కుమార్తెను మొట్టమొదట బాల్టిమోర్‌లోని ఒక నేత్రవైద్యునివద్దకు తీసుకెళ్ళాడు. ఆ నేత్ర వైద్యుడు ఈ అమ్మాయిని పరీక్షించి టెలిఫోన్ కనిపెట్టిన గ్రాహమ్‌బెల్ వద్దకు తీసుకెళ్ళ మన్నాడు. ఆ గ్రాహమ్‌బెల్ జీవనాదర్శ మేమిటంటే చెవిటివారికి విద్యగరపడం. గ్రాహమ్‌బెల్ దగ్గిర ఒక చెవిటి పిల్లవాడు పనిచేస్తూవుండేవాడు. మూడేళ్ళపాటు కష్టబడి, అతనికి మాట్లాడటం నేర్పాడు. అక్కడితో ఆయనకి తన జీవన లక్ష్యమేమిటో బోధపడినట్లయిందిట. వారికి విద్యాబోధ చేస్తున్నప్పుడు పొందే ఆనందంవంటిది యింకెప్పుడూ లభించేది కాదుట. తన బధిర విద్యార్థులు శబ్దాలు 'చూడ'గల నిమిత్తం యీ టెలిఫోన్ కనిపెట్టాడు బెల్. విజిబుల్ స్పీచ్ (Visible Speech) అనగా కనపడే మాటలు పద్ధతిని గ్రాహం బెల్ తండ్రికని పెట్టాడు. బెర్నార్డుషా 'పిగ్మాలియన్' నాటకం చదివినవారికి ఒక చవకబారు స్త్రీ, జమీందారిణిలాగా ఒక గార్డెన్ పార్టీలో వ్యవహరించడం జ్ఞాపకం వుండి వుంటుంది. బెర్నార్డుషా ఆ నాటకం గ్రాహంబెల్

తండ్రికోసము రాశాడుట. మననోటినించి వెలువడే శబ్దాలు వాటివాటి కంపనములతో మసిపూసిన గాజు మీదకి పొట్టిపొడుగు గీతల (Inflections) వలె యెక్కడం బధిరుల చూపాడు గ్రాహం బెల్. ఇదే చివరికి టెలిగ్రాములు పంపే సాధనకి మూలాధారమయింది.

హెలెన్ విషయంలో గ్రాహమ్‌బెల్ ఎంతగానో సాయపడ్డాడు. అతని సలహామీదనే పెర్కిన్స్ సంస్థకి కెప్టెన్ కెల్లర్ మొట్టమొదటి వుత్తరం రాశాడు. మైకేల్ కూడా హెలెన్‌ని ఆమెకిగల అవస్తనుంచి తప్పించేందుకూ ఆమె జీవితానికి ఒక ప్రత్యేకతా, పరిమళమూ కల్పించేందుకు ఎంతగానో కృషిచేశాడు. ఈ మైకేల్ ఏథెన్సు విశ్వవిద్యాలయంలో చదువుకున్నవాడు. హెలెన్‌కి గ్రీకు సాహిత్యంమీద ప్రత్యేకాభిరుచి ఏర్పడిందంటే అందుకు యితనే కారకుడు. డాక్టర్ హోవ్ తదనంతరం యీ మైకేల్ గుడ్డిపిల్లలకోసమై బోస్టన్ నగరంలో మొట్టమొదటి కిండర్ గార్టెన్ పాఠశాల స్థాపించాడు. హెలెన్ సంగతి, వినీవినగానే డాక్టర్ గ్రాహమ్ బెల్‌కివలెనే ఇతనికికూడా ఆమెపట్ల ప్రత్యేకాసక్తి ఏర్పడింది. ఆ అమ్మాయికి అన్ని విధాలా సరిపడే టీచర్ ఎవరాఅని వెతికి, 'యానీ సల్లివాన్' ని అందుకని నియోగించాడు. ఈమె హెలెన్‌కంటె పధ్నాలుగేళ్ళు పెద్ద. 1887 వసంతకాలంలో టస్కంబియా వచ్చింది. వస్తున్నపుడు పెర్కిన్స్ సంస్థ పిల్లలబహుమతిగా తొరాబొమ్మ (Doll) నొకదానిని పట్టుకొచ్చింది. వీధిగుమ్మం దగ్గిర నిలబడ్డ హెలెన్‌కి యింట్లో జరుగుతున్న ఏర్పాట్లూ,

తనకి వుపాధ్యాయినిగా ఎవరోరావడం, యివేమీ తెలియవు. కొత్తవ్యక్తి ఎవరోవచ్చినట్లు పసిగట్టగానే ఆమెమీదకి ఓ చిన్నజంతువువలె వురికి, నానా హంగామా చేసింది.

హెలెన్ జీవితంలోకి 'టీచరు' ఆ విధంగా ప్రవేశించింది. ఆనాటినుంచీ యానీసల్లివాన్ హెలెన్ జ్ఞాననేత్రం అయింది. హిందువుల పదమైన 'గురు' శబ్దం ఆమెకి అన్ని విధాలాసరిపోయింది. యానీ సంరక్షణలో హెలెన్ ఒకప్రత్యేక వ్యక్తిగా పెరగ నారంభించింది. శూన్యతనుంచి హెలెన్‌ని 'విశ్వాసం' వైపుగా ప్రయాణం చేయించింది యానీ. మొండి ఘటంలా చేతులూ కాళ్లూ గిలగిల కొట్టుకొంటున్న హెలెన్‌ని ఏనాడైతే తన రెండుచేతుల్లో పట్టుకుని, ఆమె ఏడుపు లక్ష్యపెట్టక మొదటిపాఠం నేర్పేందుకు మేడమీదకు తీసుకెళ్ళిందో, ఆ నాటినుంచీ యానీ, హెలెన్‌లో మార్పు తీసుకురా నారంభించింది. లారా విషయంలో డాక్టరు హొవ్ చేసిన ప్రయత్నాలన్నీ యానీ చదివి తెలుసుకుందిగాని హెలెన్ దగ్గిర కొచ్చేసరికి తనకితానుగా మార్గం తెలుసుకోవలసి వచ్చిందామెకి. ప్రపంచ ప్రఖ్యాత గ్రంథమైన 'ది స్టోరీ ఆఫ్ మై లైఫ్' (The Story Of My Life) లో హెలెన్ కెల్లర్ యీ విషయాలన్నీ సవిస్తరంగా ముచ్చటిస్తుంది. యానీ, హెలెన్‌కి తన జీవితంగురించిగానీ, తను పెర్కిన్స్ సంస్థకి ఎటువంటి స్థితిలో వచ్చినదిగానీ చెప్పనేలేదు. పధ్నాలుగేళ్ళ యానీ కడు దీనపరిస్థితిలో ఆ సంస్థ వాకిట్లో పాదం పెట్టింది. అక్కడికి వచ్చేసరికి ఆమెకితనవలెనే ఏకాంత జీవితం గడుపుతున్న లారాకనపడింది. వీరిద్దరూ నెమ్మదిగా

మాన్యుల్ ఆల్ఫబెట్ (Manual Alphabet- వేలి కొనలతో తెలిపేభాష) తో సంభాషించుకొనేవారు. ఒకే గదిలో వుంటూ ఒకరికొకరు ఈ విషయాలు చెప్పుకుంటుండేవారు. యానీ పధ్నాలుగేళ్ళవయసుది;అయినప్పటికీమహా మొండిగా వుండేది. కాని తరవాత తరవాత క్రమశిక్షణవల్ల మనిషి పూర్తిగా మారిపోయింది. మేడమ్ మాంటెస్సరీ, యానీ సల్లివాన్ గురించి ప్రస్తావిస్తూ ఆమె హెలెన్ కి 'ఆత్మప్రసాదిని' (Creator of a Soul) అంది. యానీలోని యీ బ్రహ్మాండమయిన పరివర్తనకి మూలకారణం షేక్స్పియర్ రచనల పట్ల ఆమెకి ఏర్పడ్డ గౌరవం. సాహిత్యాభిరుచితో విజ్ఞానకాంక్ష పెరిగి, ఆమెలో అంతర్గతంగావున్న మహత్తరశక్తిని మేల్కొలిపింది.

యానీ తన బాల్యంలో మానవ జీవితంలోని అతిదుర్భరపరిస్థితినీ,పతనావస్థనీ కళ్ళారాచూసింది.చిన్నప్పుడే తలితండ్రులు పోయారు. ఈమెనీ ఈమె సోదరుణ్ణి బీదల కొంపలో (Almshouse) పడేశారు. ఈమె అందులో చేరిన మొదటి సంవత్సరం, అక్కడికొచ్చిన యిరవై యేడుగురు అనాథ శిశువుల్లో అందరూ చనిపోయారు. అంతకిక్రితమేడు యనభై మంది పసివారికీ డెబ్బయిమంది చనిపోయారుట. పదో ఏట నుంచి యీమె చుట్టూ పక్కమీదపడివున్న, అంగవికలులు, దీర్ఘరోగ పీడితులు, క్షయరోగులు, కాన్సర్ రోగులూ ఒకవంక; వివాహంకాకుండా పిల్లలనికని ఆరోగ్యిష్టి పాపలతో యాతన పడుతున్న స్త్రీలు మరొకవంక. ఈ అవివాహితస్త్రీలు, బలాత్కారము, ఆకలి, మొగవాడిని పడ

గొట్టడం, లేదా మొగవాడు తమని పడగొట్టడం - యివి తప్ప మరొకవిషయం మాట్లాడేవారుకాదు. యానీ, ఆమె సోదరుడూ ఆడుకునేందుకు ఒకే వొక్క చిన్నగది వుండేది. ఆ గది ఏమిటంటే, శవాలని భద్రపరిచేగది. చనిపోయినవాళ్లని తెల్లారేదాకా ఆగదిలో అట్టేపెట్టి, బండీవచ్చాక, దానిలో వుంచి పంపేవారు. ఆ గుర్రపుబండి చక్రాలశబ్దం విన్నప్పుడల్లా యానీ గుండెలు దడదడలాడేవి.

హెలెన్‌కి తన టీచరు ఎటువంటి గర్భదారిద్ర్యం నుంచి వచ్చినదీ చాలా రోజులదాకా తెలియదు. బాగా పెద్దదై ప్రపంచవ్యవహారాలు జీర్ణించుకున్నమీదటగాని ఆమెకి, ఈ సంగతులు తెలియనే తెలిలేదు. యానీ వచ్చిన నెల్లాళ్ళలోనే హెలెన్‌లో మార్పు కనపడింది. అడివిజంతువు వలె అల్లరిచేసేపిల్ల ఒక దారినపడింది. శుభ్రంగా దిట్టంగా వున్న యీ ఏడేళ్ళ అమ్మాయి మూక బధిరాంధురాలైనప్పటికీ, వస్తువులు ఫలానా అని చెప్పేందుకు మాటలంటూవున్నాయనే విషయం గ్రహించింది. ఆటబొమ్మ (Doll) అనేపదం ఆమె అరచేతిలో రాసేసరికి, తను ఆడుకునే బొమ్మకీ యీ పదానికి సంబంధం వుందని గ్రహించింది. ఈమాట తెలుసుకున్నమీదట హెలెన్, తమ పెంపుడుకుక్కకి తిరిగీ యిది చెప్పబూనడంతో యానీకి తనప్రయత్నం వృథాకాదనే ఆశ అంకురించింది. పైపునించి పడేనీరునీ, నీటి వాగుదగ్గిర నీరునీ రెంటినీ విద్యార్థినిచేత స్పృశింపచేసి, అదీయిదీకూడా 'నీరు' అని ఆమెకి తెలిసేటట్లు అరిచేతిలో రాసి చూపించింది యానీ. హెలెన్ తన ఆత్మకథలో ఆనాటి విషయాలగురించి

యిలా అంటుంది: "నాలో ఏదో కదలిక కలిగింది. పొగ మంచు వెనకనున్న కాంతివంటిదది, ఏదో మర్చిపోయింది చటుక్కున స్ఫురణకివచ్చినట్లనిపించింది. కొన్నాళ్ళపాటు మరణించి, తిరిగీ ప్రాణం పోసుకున్నట్లు తోచింది. కొన్ని సంకేతాలద్వారా యితరులతో సంభాషించగలమను మహత్తర విషయం నాకు అవగతమైంది. నన్ను ఉక్కిరిబిక్కిరి చేసే భావకంపనములు దేహమంతా అల్లుకుపోయాయి. ఏవేవో భావాలు మెదడునించి, నలుమూలలకీ పాకుతున్నట్లు తోచింది. అనిర్వచనీయానుభూతీ నూతన బలమూ కలిగాయి. నా పరిమితులు నాకు తెలిసినట్లుతోచింది. మలయానిలంతో కూడిన సుగంధపరిమళాలు దేహవ్యాప్తమై హృదయాన్ని ఆనంద వీచికల నోలలాడించాయి."

ఈ అనుభూతి పొందేవరకూ ఏవో క్రూర హస్తాలు తనని బంధించి కాంతిరేఖకి దూరంగా తనని నిలబెడుతున్నాయని భావించింది హెలెన్. పంపు నీరు, వాగులో నీరు ముట్టుకుచూసి, చేతిమీదనుంచి చల్లగా జారే ప్రవాహానికి ఒక పేరు కలదని తెలుసుకోడంతో ఆ ఏడేళ్ల బాలిక ఆనందపరవశురాలయింది. 'నీరు' తరువాత ఆమె నేర్చుకున్న మాట 'టీచరు'. ఒక్క గంటలో ఆమె ముప్పై మాటలు గబగబ నేర్చేసుకుంది. ఈ ముప్పై మాటలూ నేర్చుకోడంతో సంతోషం పట్టలేక ఆమె ఎగరడం, గెంతడం మొదలెట్టింది. ఆ పనులామెకి అతి సహజంగా చేయబుద్ధయింది. ఈ ప్రతి కదలికనీ ఏమంటారో ఆమెతో ఆటలు ఆడుతూ నేర్పింది యానీ. మధ్యాహ్నం వేళ

ద్రాక్ష తీగెల కుటీరంలోకి టీచరుకీ విద్యార్థినికీ భోజనం వచ్చేది. యానీ చేసిన మొట్టమొదటి పని ఏమిటంటే యీ పిల్లని తల్లిదండ్రులనుంచీ, కుటుంబ వ్యక్తులనుంచీ వేరుచేసి, తన దగ్గిర అట్టే పెట్టుకోడం. ఆ వేసవి కాలంలోనూ వసంత కాలంలోనూ అధ్యాపకురాలూ విద్యార్థినీ ఆ చుట్టుపట్లగల ప్రదేశమంతా తిరిగేసి వచ్చారు. చెట్టునీడన కూచుని నీడనగా ఏమిటో, ఎండ అనగా ఏమిటో, గాలి ఎలా వుండేదీ వర్షం ఎలా కురిసేదీ, చెట్టు తొర్రలో జంతువులుండటం, చెట్లపైన గూళ్లలో పక్షులుండటం, ఏ ఏ చెట్టు ఏ ఏ రకంగా వుండేదీ, ఏ ఏ పూవు ఏ మాదిరిగా ఉండేదీ, పత్తి మొక్కలకీ పూల మొక్కలకీ తేడా యీ మాదిరి విషయాలు స్పర్శాజ్ఞానంద్వారా వాసనలద్వారా తెలుసుకుంది హెలెన్. ఇద్దరూ దడదడ చెట్టు ఎక్కేవారు. చెట్టుకొమ్మమీద కూచుని గాలి వీస్తున్నపుడు ఆకులు ఎలా కదిలేదీ, ప్రత్యక్షంగా తెలుసుకునేది హెలెన్. ఆకులు మధ్యనుంచి గాలి రివ్వున వెళ్ళడం అనుభవ పూర్వకంగా గ్రహించింది. పుచ్చకాయలు నేలమీద ఉండటం, ఫల జాతులు చెట్టున కాయడం, చేపలు నీటిలో దొరకడం, పూలమకరందం కోసం తుమ్మెదల ఝుంకారమూ మొదలైనవన్నీ యానీ పర్యవేక్షణలో స్వానుభవంతో తెలుసుకుంది హెలెన్. ప్రపంచంలో యిన్ని వస్తువులు ఉండటం, వీటికి యిన్ని పేర్లు ఉండటం, యింతటివైవిధ్యం, యీ సుగంధపరిమళాలూ, ఆమెకి నూతన ప్రపంచపు మార్గాలు తెరిచాయి.

టీచరుగారూ విద్యార్థినీ ప్రతి రోజూ టెన్నిసీ నది వైపుగా వెళ్ళి ఆ నది గట్టున కూచునేవారు. అక్కడి యిసుక తిన్నెలో యీ టీచరు గులకరాళ్ళతోనూ, పుల్ల ముక్కలతోనూ రివర్ బెడ్సూ, చిన్న చిన్న ద్వీపాలూ, పర్వతాలూ, సరస్సులూ నిర్మించేది. ఇసుకతోనూ మట్టితోనూ ఎత్తు ఎత్తుగా నిర్మించి, వాటికి ఏవో ఏవో పేర్లు చెప్పి పరిచయం చేస్తున్నపుడు హెలెన్, అదంతా ఒక ఆట అనుకుందిగాని తను భూగోళ శాస్త్రం యావత్తు నేర్చుకుంటున్నానని అనుకోలేక పోయింది. పర్వతాలూ, లోయలూ, వంకరలు తిరిగి ప్రవహించే నదులూ, మంచుతో కప్పబడి వుండే నదులు, భూగర్భంలోకి కూరుకుపోయిన నగరాలు, మానవ జనానికి పూర్వం యీ పృథ్వీ స్థలిమీద విహరించిన వికృతాకారపు జంతువులు, ఆయా ప్రళయాల్లో అవి అంతరించడం, అతి లోతైన లోయ ప్రదేశాలు మొదలైన వాటిగురించి హెలెన్ ప్రత్యక్ష జ్ఞానంతో తెలుసుకుంది. క్రిస్టిన్ యాండర్సన్ కథలు, విటియర్ వంటి కవుల రచనలు పరిచయమయ్యాయి హెలెన్‌కి. యానీ తయారుచేసి యిచ్చిన ఎత్తు అక్షరాలద్వారా తనకి తను చదువుకోడం నెమ్మదిగా నేర్చుకుంది. ప్రతి మాటా ఒక గుణానికో, వస్తువుకో, క్రియకో చెందివుంటుందని తెలుసుకుంది. చేతికి తగిలే వస్తువులేకాక, తగలనివీ వూహాజనితములైనవీ వున్నాయని గ్రహించేందుకు ఆమెకి ఎంతో కాలం పట్టలేదు.

తన చిన్నప్పటి పాఠాలు తాను చాలామటుకు వాసనల ద్వారానూ, స్పర్శద్వారానూ గ్రహించానని, హెలెన్

చెపుతుంది. ఫలానా వాసన రాగానే తాము వేపచెట్టువద్దకి వచ్చామనీ, ఫలానా వాసన రాగానే తాము తోట చివర నున్న ద్రాక్షతీగెవద్దకి వచ్చామనీ, భూమి పరిమళాన్నిబట్టి వర్షం రానున్నదనీ, యిలా ప్రతి ఒక్కటీ స్పర్శతోనో పరిమళంతోనో జోడించి గ్రహించేది. ఆఖరికి ఆ ఏడో ఏట కూడా తనకేదైనా ఒకవిషయం స్పష్టంగా అర్థం కాకపోతే, అది అర్థమయేదాకా వదిలిపెట్టేదికాదు. ఆ పట్టుదలా, చిత్తశుద్ధీ ఆమెకి చిన్నప్పటినుంచీ వున్నాయి. హెలెన్ యింతదవడానికి యానీ కూడా చాలావరకు బాధ్యురాలు. విద్యార్థిని తన పాఠం బాగా నేర్చుకుంటేగాని వూరుకునేది కాదు. 'ఇప్పుడు నీకు కష్టంగా వుండవచ్చు; కాని పెద్దయాక, నా నిర్దాక్షిణ్యతని నువ్వు మెచ్చుకుంటావు' అనేది యానీ. అయ్యో పాపం, అని హెలెన్‌పట్ల ఎవరూ సానుభూతి వాక్యాలు కనపరచకుండా నిరంతరమూ కాపాడేది యానీ. ఈ సానుభూతి ఎందరు అంధుల జీవితాలని దగ్ధం చేసినదీ ఆమెకి తెలుసు. అందుకనే చిన్నప్పటినుంచీ హెలెన్ విషయంలో ఈ జాలిపలుకులు ఎవరూ పల్కకుండా కాపాట్టం నేర్చుకుంది. హెలెన్ రాస్తుంది తనపుస్తకంలో: 'దృష్టి లోపం వున్నమనిషిని సామాన్యమానవునిగా పరిగణించి నపుడే, అతనికి తనజీవితాన్ని దిద్దుకోగల అవకాశం ఏర్పడు తుంది. సానుభూతి కనబరచక సామాన్యవ్యక్తిగా చూసి నపుడే లోన దాగివున్న శక్తులు పైకి వుబికి అతనికి మనోధైర్యం ప్రసాదిస్తాయి.' ఒక అంధ బాలికకి వెలుగుకిరణా

మహాయజ్ఞానికి తనజీవితం అర్పించాలనుకున్న యానీ సల్లివాన్ జీవితలక్ష్యం, హెలెన్ కెల్లర్ ద్వారా నెరవేరింది.

'నా జ్ఞానేంద్రియము లైదూ పనిచేస్తున్నట్లుగానే నేను భావించేదాన్ని. నాకేదో లోపముందన్న తలంపు నాకేనాడూ కలగలేదు' అంటుంది హెలెన్ కెల్లర్. చిన్నప్పటినుంచీ ఆమెకి చూడటం, వినడం, చెప్పడం అనేమాటలు యానీ ధర్మమా అని అలవాటయి పోయాయి. అనేకానేక వస్తువులని హెలెన్ తనకి తానుగా తెలుసుకోడంతో ఆమె మెదడులోని భావపరిధి చాలా తమాషాగా ఏర్పడింది. పిల్లలు వాళ్లంతట వాళ్ళు పెరగాలి, వాళ్ళమార్గానికి మనం అడ్డుపడకూడదు; సరియయిన పరిస్థితుల్లో వుంచిన పిల్లలు తమంత తాము విద్య నేర్చుకోగలుగుతారు - అంటుంది యానీ సల్లివాన్.

ఒకసారి సాన్ ఫ్రాన్సిస్కోలో హెలెన్ కెల్లర్, యానీసల్లివాన్ వుపన్యాస వేదికమీాద వుండగా మేరియా మాంటెస్సరీ యానీని వుద్దేశిస్తూ యిలా అంది: 'మీారందరూ నేనేదో నూతన విద్యావేత్త నంటారు. నాకు యిరవయ్యేళ్ళు ముందే నూతనమార్గం తొక్కింది యీ యానీ,' అని అభినందించింది. పిల్లలు వుపాధ్యాయులమీాద ఆధారపడటంకంటె, తమకి తాము తెలుసుకోవాలనే సహజ తృష్ణ వారిలో పెరగనీయడం వుత్తమం. మాంటెస్సరీ, యానీ యిద్దరూ మొండితనంతో అల్లరిచేసే పిల్లలని కొల్లలుగా చూశారు. ఆ మొండితనాన్ని కొంచెం జాగ్రత్తగా మారిస్తే, వారి స్వభావాలు ఎంతో చక్కగా రాణిస్తాయి. మాంటె

స్సరీ స్కూల్లోని పిల్లలు, ఆట పాటల్తో ఆనందిస్తారుగాని అకారణంగా అల్లరి చేయరు. అల్లరి ద్వారా సంతోష పడేందుకు ప్రయత్నించరు, యానీసల్లివాన్ హెలెన్‌ని అక్షరాలా మాంటెస్సరీ విద్యార్థినివలె తయారు చేసింది. మాంటెస్సరీ పిల్లలు తమపనులు తాము చేసుకుంటూ కష్టాలని ఎదుర్కోడంలో ధైర్యగుణం అలవరుచుకుంటారు. తమగది తాము వూడ్చుకోవడం బల్లలూ కుర్చీలూ తుడుచుకోడం, ఎవరి పళ్లాలు వారు ఎత్తుకు, ఎవరి బట్టలు వారు వుతుక్కోడం, వంటపని స్వంతంగా చేసుకోడం - యీ మాదిరి స్వచ్ఛంద కార్యక్రమంతో బాటు సహజ పరిశీలనా శక్తీ, నిశ్చలబుద్ధీ పెంపొందించుకోడం మాంటెస్సరీ పిల్లల లక్ష్యం. కళ్ళకి గంతలు కట్టుకు వస్తువులు తెలుసుకోడమనేది ఆ పిల్లలకి నేర్పుతారు. తద్వారా స్పర్శేంద్రియజ్ఞానం పెరుగుతుంది. మనసుని ఉన్నతస్థితిలో వుంచి, ప్రకృతితో సహజ సామరస్యం అలవరచుకుంటారు వారు. హెలెన్ కెల్లరూ యానీ సల్లివాన్ తనకి ఒకవిధంగా అధ్యాపకులు అంది ఆనాడు మేడమ్ మాంటెస్సరీ. పెద్దయాక హెలెన్ తన గ్రంథాలలో ఒకదాన్ని మేరియా మాంటెస్సరీకి అంకితమిచ్చింది. అలబామాలోని ఈవడేళ్ళ మొద్దుపిల్ల, పెద్దదై లోకదృష్టి నాకర్షించడమే కాకుండా, మూకబధిరాంధులకి మార్గజ్యోతి కాగలదని ఆ మొదటి రోజుల్లో ఎవరనుకున్నారు?

# 2. బోస్టన్ వింత

1888 వసంతకాలంలో హెలెనూ ఆమె టీచరూ బోస్టన్ నగరానికి వెళ్ళారు. అప్పటికి హెలెన్ వయసు ఎనిమిదేళ్లు. పెర్కిన్స్ సంస్థ అధిపతి మైకేల్‌కి హెలెన్‌ని పరిచయం చేసేందుకు, తన విద్యాపద్ధతిగురించి అతనికిచెప్పి, అతని అభిప్రాయం తీసుకునేందుకూ, హెలెన్‌ని వెంటతీసు కెళ్ళిందియానీ. తన విద్యార్థిని మనోనేత్రానికి గోచరమయే టట్లు ఛెన్నిసీనది ప్రాంతాలగల సుందరదృశ్యాలూ, ఫల పుష్పజాతులూ, గొర్రెల గుంపులూ, పత్తి పొలాలూ,- వీటన్నిటిగురించీ ఆమె అరచేతిలోరాసి, తెలుపుతూండేది. రైలుస్టేషనుల్లో కన్పించే నీగ్రోలూ, వ్యవసాయక్షేత్రాల్లో కన్పించే రైతులూ, వారి నవ్వులూ కేరింతాలూ మొత్తం మీద ఆ ప్రాంతాలగల జీవనరాగమంతటినీ వేలికొనల భాషతో హెలెన్‌కి తెలియబరిచింది యానీ.

పెర్కిన్స్ సంస్థకి వచ్చాక హెలెన్‌కూడా ఎంతో సంతోషించింది - తనతో సంభాషించగల సహాధ్యాయినులు చాలామంది దొరికారని. మాటలులేకుండా సంభాషించుకోడమనే యీ 'మాన్యుయల్ ఆల్ఫబెట్' ప్రథమాన స్పెయిన్ దేశంలో జన్మించింది. అక్కడి మతగురువులు మౌన వ్రతం అవలంబించి, ఆ వ్రత నియమానికి భంగంకలగకుండా సంభాషించేందుకు ఈ భాషకనిపెట్టారు. హెలెన్, పెర్కిన్స్ సంస్థ చూడటానికివచ్చే నాటికి, మూక బధిరాంధురాలైన లారాకి అరవయ్యేళ్లు. హెలెన్‌కి ఆమె ఒక ఆదర్శమూర్తి.

ఆ తారాగురించి తెలిసిన భోగట్టా వల్లనే హెలెన్ కుటుంబంలోవారికి, తమ అమ్మాయికీ ఈ ప్రపంచానికీ మధ్య ఏర్పడ్డ దూరానికి ఒక వంతెన కట్టగలమనే ధైర్యం కలిగింది. తారా యింటలెక్టు (మేధస్సు) కొంతవరకు మాత్రమే పెరిగి ఆ పైన ఆగిపోయింది. హెలెన్ ఆమెని దర్శించినపుడు యీ ఎనిమిదేళ్ల పిల్లనీ, ఎంతో ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నదేగాని, మనసువిప్పి సంభాషించినట్లుతోచదు. అందుకు కారణం ఒక్కటే కనబడుతుంది. తారా జీవితం క్రమశిక్షణకి కట్టుబడివుంది మొదటినుంచీ. హెలెనేమో యింకా చిన్నపిల్ల. ఉద్రేకాలు ఎటువైపు తిప్పితే అటు గంతేపిల్ల. ఉద్యానవన మధ్యభాగాన శిల్పి చెక్కివుంచిన విగ్రహంవంటిది తారా. నీడచాటున పెరిగిన పువ్వుల అందంతో పోల్చవచ్చు హెలెన్ని.

పెర్కిన్స్ సంస్థలో రెగ్యులర్ విద్యార్థినివలెవుండేది కాదు హెలెన్. ఆమె, ఆమె టీచరూ తరుచు వస్తూపోతుండేవారు. సుమారు మూడు సంవత్సరాలు ఆ సంస్థకి సన్నిహితంగా గడిపింది హెలెన్. బోస్టన్ నగర పరిసర ప్రదేశాలుచూస్తూ చరిత్రపాఠాలు నేర్చుకుందామె. ప్లిమత్ వెళ్ళి 'పిల్ గ్రిమ్స్' మొట్టమొదట ఎక్కడైతే దిగారో ఆ రాయి చేతుల్తో ముట్టుకుచూసింది. అరేబియన్ నైట్సూ, పిల్‌గ్రిమ్సు ప్రొగ్రెసూ, లాంబ్ రాసిన షేక్స్పియర్ నాటక కథలూ మొదలైనవి అప్పటికప్పుడే చదివేసింది. ఎమెర్సన్, హాథారన్, ఆల్ కాట్ - వీరి గృహాలకి ఆమె తీసుకుపోబడింది. చిన్నప్పటినుంచీ యీత అంటే తెగయిష్టం

హెలెన్‌కి. ఈత కొడుతున్నపుడు తనని తాను మర్చిపోయేది. పెర్కిన్స్ అధిపతి మైకేల్ మొదటినుంచీ యీామెని ప్రపంచపు ఎనిమిదో వింతగా భావిస్తూ, ఈమెని ఆ ప్రకారమే లోకానికి పరిచేయం చేస్తూండేవాడు. డాక్టరు హోవ్ పేరు ఆ నాటి కళాప్రపంచంలోనూ, సాహితీ ప్రపంచంలోనూ చాలామందికి తెలుసు. ఛార్లెస్ డికెన్సు తరువాత ఆస్కార్ వైల్డ్ అమెరికావచ్చి, హోవ్ కుటుంబాన్ని పరిచయం చేసుకు వెళ్లాడు. విట్టియర్, హోమ్స్, ఫిలిప్స్‌బ్రూక్స్, మొదలైన పెద్దపెద్ద లందరూ పెర్కిన్స్ సంస్థకి చిరపరిచితులవడంవల్ల, హెలెన్ గురించి వారందరకీ అతి తొందరగా తెలిసింది. అందుకుతోడు మైకేల్ కూడా యీామె ప్రతిభాసంపద ప్రపంచపు నలుమూలలకీ తెలియపర్చాడు. అలబామాలోని వారి గృహానికి తరచూ వెళ్తూ ఆ ప్రాంతం అచ్చు గ్రీసు దేశంవలెవుందని అనేవాడు. ఒకసారి ఏదో పనిమీాద గ్రీసు వచ్చినప్పుడు గ్రీకురాణికి, తనకి అప్పుడే హెలెన్ వద్దనుంచివచ్చిన వుత్తర మొకటి చూపించాడు. గ్రీసు దేశపురాణికూడా విక్టోరియా మహారాణివలె హెలెన్ గురించి చూచాయగా వింది. మైకేల్ ఆమెని బ్రహ్మాండంగా పొగిడి, ఆమెరాసిన లేఖ చూపించేసరికి ఆశ్చర్యపోయిందా రాణి. ఐరోపాఖండమంతా యీా హెలెన్ ఒక యిన్టలెక్టుయల్ ప్రాడిజీ (Intellectual Prodigy - అసమాన ప్రతిభాశాలిని) అనీ, బాస్టన్ మార్వెల్ (Boston Marvel బోస్టన్ నగరపువింత) అనీ అంటూండేవారు. హెలెన్‌కి పన్నెండేళ్లు నిండకపూర్వమే ఆమెకి విద్యాబోధన ఏ

విధంగా జరిపిస్తున్నదీ, అమెరికా యూరప్ ఖండాలు అమితా సక్తితో పరిశీలించ సాగాయి.

యానీ సల్లివాన్‌కి ఈ మాదిరి ప్రచారం బాధాకరమనిపించింది. ఈ పబ్లిసిటీవల్ల కీడు యెక్కువ జరగగలదని ఆమె భయం. ఇక మైకేల్ చెప్పేమాటలు ఎలా ఉండేవంటే చాలామంది అతను కోతలు కోస్తున్నాడనుకునేవారు. కొందరు హెలెన్ అనే పిల్ల ఎక్కడా లేదనీ, ఇదంతా ఒట్టి మోసమనీ, కల్పిత గాథ అనీ, ఏదో స్వలాభం కోసం యిట్లా ప్రచారం చేస్తున్నారనీ అనుకో సాగారు. మూగ పిల్ల చక్కగా సంభాషించగలదనీ, పియానోమీద ఎంతో శ్రావ్యంగా వాయించగదనీ, జామెట్రి లెక్కలు దడదడ చేసెయ్యగలదనీ మైకేల్ ఉత్సాహంతో చెప్పే పలుకులు, నమ్మేందుకు కొంచెం యిబ్బందిగా వుండేవి. కాని అవి అక్షరాలా నిజం. మైకేల్ ఒక్క మాటకూడా ఆమె గురించి అధికంగా చెప్పలేదు. ఈ చిన్న పిల్లకి గల ప్రతిభావంతమైన మేధస్సు, శ్రవణేంద్రియ, నేత్రేంద్రియ లోపాలని జయించి, ఆ లోపాలు లోపాలు కానట్టుగా వ్యవహరించగల సమర్థతని అలవరచుకుంది. జర్మన్, లాటిన్, గ్రీకు భాషలు సునాయాసంగా నేర్చుకోగలిగింది హెలెన్. పదేళ్లు నిండకపూర్వం అతి చక్కటి ఫ్రెంచి భాషలో గ్రీసులో ఉన్న మైకేల్‌కి లేఖ రాసింది. స్పర్శాజ్ఞానంతో పదవ ఏట మాట్లాడటం నేర్చుకుంది. ఇక్కడ స్పర్శా జ్ఞానమనగా కంఠనాళాలమీదా, పెదవులమీదా వేళ్ళు ఉంచి మాట్లాడుతున్న మాటలేవో తెలుసుకోగలగడం. పన్నెండో ఏట ఏదో రైలు

ప్రయాణం చేస్తున్నపుడు 'రైల్లో చదువుకునేందుకు నీకేం పుస్తకం కావాలీ' అని అడగ్గా మిల్టన్స్ 'పేరడైజ్‌లాస్ట్' యిమ్మని అడిగింది. పదమూడో ఏట లాటిన్ భాషనుంచి తర్జుమాలు చెయ్యడం ప్రారంభించింది. అదే సమయంలో ఫ్రెంచి ఉచ్చారణా, ఫ్రెంచి భాష జాగ్రత్తగా నేర్చుకు, మాలియర్ రచనలూ, యితర ప్రఖ్యాత ఫ్రెంచి సాహిత్యమూ, మెత్తక్షరాల (Raised Print Lines) భాషలో చదివి ఆనందించసాగింది. వెండెల్ హోమ్స్ యీ చిన్న పిల్లకి యింగ్లీషు భాష పట్లగల ప్రావీణ్యానికి ఆశ్చర్యపోయాడు.

ఇతరులు చెప్పింది శ్రద్ధగా ఆలకించడమే కాకుండా, ఆ చెప్పినది జీర్ణించుకు అది తన వ్యక్తిత్వంలో భాగంగా చేసుకు మసలడం ఆమెకి చిన్నప్పటినుంచీ అలవడిన విద్య. పదవ ఏట వాళ్ళింట్లో భోజనాల బల్ల దగ్గిర, ఎగుమతి దిగుమతి సుంకాల గురించి చర్చిస్తున్నపుడు తనుకూడా అక్కడ ఉంటానని పట్టుపట్టింది. ఆ అమ్మాయి అందికదా: 'ఈ విషయం నేను అర్థం చేసుకో లేనని మీరెందుకనుకుంటారు? నాకు విశాలమైన మనస్సు ఉంది; గ్రీసు దేశంలోని పెద్దలు తాము మాట్లాడుకొంటున్న విజ్ఞాన విషయాలు, పిల్లల్ని ప్రత్యేకంగా విననిచ్చేవారుట, అలా వినడంవల్ల గ్రీకు బాల బాలికలు తమకి తాముగా కొంత నేర్చుకుని వుంటారు.' యానీ తన విద్యార్థినికి గ్రీకు పురాణ గాథలతోనూ, గ్రీకు సాహిత్యంతోనూ పరిచయం చేసింది. ఆ సాహిత్యంలోని నాటికలు టీచరూ విద్యార్థినీ ఏదో ఆటలాడుకుంటున్నట్టుగా

వేసేవారు. పెర్సెస్, ప్రాస్పరిన్, ఫ్లూటో - ఈ పాత్రలూ ఆయా కథా భాగాలూ హెలెన్‌కు చిన్నప్పటినుంచీ తెలుసు. గ్రీకు చరిత్రకి సంబంధించిన సంశయాలేమైనా కలిగితే మైకేల్‌ని అడుగుతూండేది. ఛార్లెస్ కింగ్స్‌లీ రాసిన గ్రీకువీరులు, అను పుస్తకంద్వారా ఆ సాహిత్యంలోని దేవతలూ దేవతల భార్యలూ గురించి క్షుణ్ణంగా తెలుసుకుంది. ఒక రోజున మైకేల్ ఏదో మాటలసందర్భాన మ్యూనిచ్ నగరంలో అయిదు వంతెనలు వున్నాయనగా - కాదు, కాదు, నాలుగే; వియన్నానించి మీరురాసిన వుత్తరంలో నాలుగే అని రాశారు - అని సరిదిద్దింది.

ఆ తరువాత ఒకసారి సెయింట్ పీటర్సుడోమ్, నాలుగు వందల అరవై అడుగులఎత్తున వుందనగా, - కాదు, కాదు. పొరబాటు; నాలుగువందల ముప్ఫై అయిదడుగులు - అంటూ రోమ్‌నుంచి అతనురాసిన వుత్తరాన్ని సాక్ష్యంగా పేర్కొంది. తనకి ఇంతటిప్రజ్ఞా, జ్ఞాపకశక్తీ వున్నాయని ఆడంబర అహంకారాలు లేవు. తన సమర్థత తనకి తెలియదు. ప్రపంచంలోని అన్ని దేశాలలోకి ఫ్రాన్సు అంటే హెలెన్ కి ఎంతో ఇష్టం. కారణమడిగితే ఫ్రెంచివారు సరదా మనుషులు కాబట్టి - అనేది. ఎంత మంచివాళ్లనైనా చెడగొట్ట గలిగినంత బుజ్జగింపూ, ముద్దుచేయడం యీ అమ్మాయిపట్ల జరిగింది. అయినా ఆమె స్వభావం చెడలేదు. కొండమీద కోతిని కోరినా తీసుకొచ్చి సమర్పించగల వ్యక్తులు చుట్టూతా వుండేవారు. కాని ఆమెకి కోరికలు లేవుగా! షిట్జర్ తన బాల్యంలో, తన గ్రామంలోని బాలురందరికీ

లేనివస్తువు తన కొక్కడికీ మాత్రం వుండటం, ఏదో న్యూనతగా భావించేవాడు. అంచేత ఏదేనాసరే, తన వయసు బాలురందరితోటీ పంచుకోగలగాలి – అనుకునేవాడు. అదేప్రకారం హెలెన్ కూడా స్వంతకోరికలంటూ లేకుండా పెరిగింది. పన్నెండోఏట అంధబాలికలకోసం ఓ టీపార్టీ చేసి, ఆ పార్టీ సందర్భాన వారికోసమని రెండువేలపౌనుల విరాళం పోగుచేసింది. పదమూడోఏట, తన దగ్గిరవున్న పెన్నీలన్నీ ఒక డబ్బాలోవేస్తూ, అలబామాలో ఒక గ్రంథాలయ స్థాపనకి పునాదివేసింది. పెన్సిల్వేనియాలో టామీస్ట్రింగర్ అను మూక బధిర బాలకుడు చాలా అవస్తపడుతున్నాడని విని, అతనికి ఒక టీచరుని పెట్టేందుకుగాను కావలసిన నిధికి, విరాళాలు ప్రారంభించింది. పెర్కిన్స్ సంస్థలో టామీకి ఒకపార్టీయిచ్చి పత్రికలకీ, ప్రజలకీ అతనిపట్ల సానుభూతి కలిగేటట్లు చేసింది. ఆ నాటిపార్టీలో ఫిలిప్ బ్రూక్సు, హోమ్స్, ఎడ్వర్డ్ హేల్ మొదలైన మహామహులంతా మాట్లాడారు. ఆంగ్లేయ చిత్రకారుడు మిలెయిస్ (Millais) తను పంపిన స్వల్ప విరాళానికి కృతజ్ఞత తెలుపుతూ, హెలెన్ రాసిన అభినందనలేఖకి ముగ్ధుడయాడు. పన్నెండేళ్ళు వచ్చేసరికి కష్టాలూ అవాంతరాలూ దాటుకుంటూ ప్రయాణం చేయగల ఆత్మశిక్షణ అలవరచుకొంది హెలెన్. రాజీపడటం, నిస్పృహచెందడం ఆమె స్వభావంలో లేవు. ఆమె మనసు అతినిర్మలం; సంకల్పం వజ్రసంకల్పమే. ఎనిమిదేళ్ల వయసపుడు కాబోలు, యింటిదగ్గిర ఎవరో ఆమెని, 'ఎందుకలా కూచున్నావ్ ముదిపేరక్కలా' అని యీస

డిస్తూ మాట్లాడేసరికి హెలెన్ అందిట-నా వ్యక్తి స్వాతంత్ర్యం నిరూపించుకునేందుకు యిప్పటినుంచే తయారవుతున్నాను - అని. స్వాతంత్ర్యంనిలబెట్టుకునేందుకుగాను ఆమె ఎప్పటికప్పుడు అనేక అవాంతరాలని ఛేదించుకుంటూ ముందుకుపయనించ వలసి వస్తూండేది. ఆమెలోగల ఏకాగ్రత సామాన్యులకి అర్థంఅవదు. ఆ ఏకాగ్రతాశక్తి, జ్ఞానేంద్రియ లోపాలని జయించడమే కాకుండా ఆమె వ్యక్తిత్వానికొక నూతన వెలుగు నిచ్చింది. జ్ఞానేంద్రియలోపం మనోబలంగా రూపొం దింది. పదహారు పదిహేడేళ్లు వొచ్చేసరికి తత్వవిచారదృష్టి (Philosophic Mind) అలవడింది. పన్నెండోఏట మైకేల్‌కి ప్రుత్తరంలో 'నిన్న నేను ప్రపంచ పటంలో ఏథెన్సు గుర్తిం చాను. తక్షణం మీరు జ్ఞాపకమొచ్చారు' అని వ్రాసింది. ప్రదేశాలతో వ్యక్తులు జ్ఞప్తికిరావడమనేది ఆమెకి బాల్యం నుంచీ అలవాటు. నేత్రములు లేకపోయినా మనోనేత్రంతో చూడగలదు. కొన్ని వేలమైళ్ళ దూరానున్న గ్రీసు దేశాన్ని తను చూసివచ్చినట్టుగా మాటాడేది.

నేను ఆలోచిస్తాను కాబట్టి 'నేను' అనేదివుంది-అన్న డెస్కార్టీస్ (Descartes) మాట ఆమెపట్ల నూటికి నూరు పాళ్లు నిజమయింది. అనేక పరిమితులతోకూడిన చిన్న ద్వీపం తెలుసుకు - ఆ ద్వీపంనుంచి, బయటగల మహాప్రపంచానికి ఒక చక్కటి వంతెన నిర్మించుకుంది హెలెన్ కెల్లర్. ఈ వంతెన నిర్మాణానికి అమె అంధత్వ, మూకత్వ, బధిరత్వాలు ఏ విధంగానూ అడ్డు రాలేకపోయినాయి. మైకేల్ యీామె కథని పదిమందికీ చెపుతున్నపుడు, ఆ వినేవాళ్లు తామేదో

కట్టుకథ (Fairy Tale) వింటున్నట్లుగా మొహం పెట్టేవారు. ఈమెగురించిన ఖబుర్లూ కథలూ ప్రచురించని పత్రికంటూ లేదు ఆనాడు. హెలెన్ కెల్లర్ విషయంలో జరిగిన ప్రచారం అనన్యసామాన్యం.

యానీ సల్లివాన్ అప్పట్లో రాసింది: 'పదిమందినీ ఆకర్షించగలగుణం ఆమెలోవుంది. ప్రతి చిన్నవిషయంపట్లా ఆమెకిగల వుత్సాహమే అందుకు కారణంకావచ్చు. కారు మేఘంచేత కప్పబడికూడా తన జీవితాన్ని కాంతివంతంగా చేసుకోగలదీమె.' యూరప్‌లోవున్న ఫిలిప్‌బ్రూక్సు హెలెన్‌కి పెద్దవుత్తరాలురాస్తున్నాడు అప్పటికప్పుడే. విట్టియార్, హోమ్సు మొదలైనవారితోగల ప్రత్యక్ష పరిచయం ఆమె మేధాశక్తిని అభివృద్ధి పరచడానికి దోహదకారి అయింది. స్పెయిన్‌లోవున్న ఎడ్వర్డ్ హేల్ యీ చిన్న పిల్లకోసం అనేకవిషయాలు లేఖారూపంలో తెలిపేవాడు, విలియమ్ జేమ్సు ఆమెని చూడ్డానికిగాను పెర్కిన్స్ సంస్థకివచ్చి, నెమలికళ్లవంటి ఆస్ట్రిచ్ యీకలు బహూకరిస్తూండేవాడు. 'ఇవి చాలా బాగున్నాయికదూ, మెత్తగా తేలికగా మృదువుగావున్నాయి కదూ' అనేవాడు జేమ్సు. ఇక అలగ్జాండర్ గ్రాహమ్‌బెల్ సంగతిసరే సరి. హెలెన్ని, హెలెన్ టీచర్ యానీని ఒకసారి ఆయన వాషింగ్‌టన్ జంతు ప్రదర్శనశాలకు తీసుకెళ్ళాడు. ఆ తరువాత మరొకసారి 1893 లో చికాగో జరిగిన వరల్డ్ ఫెయిర్‌కి తీసుకెళ్ళాడు. హెలెన్ ఆ ప్రపంచ ప్రదర్శనలో ఎన్నో అపూర్వవిషయాలు వేలికొనలతో చూడగలిగింది, ఇండియాలోని పురాతన శిల్పాలు,

యీజిప్టులోని పిరమిడ్లూ, మసీదులు, కాలవలు, వెన్నిస్ నగరంలోని జలమార్గాలూ, జపాన్‌లోని నౌకాప్రయాణం, ఎడారిలోని వొంటెబాటలూ, శిల్పాలు, పుస్తకాలు, పూర్వ నాగరికతల చిహ్నాలు, పాతకాలపువస్తువులు, ఎన్నోఎన్నో ఆమె కరువుతీరా చూసింది. ఆనాడు బాలికగా నమూనాలనిమాత్రమే చూసింది. పెద్దఅయాక ఆయా దేశాలకివెళ్ళి నిజరూపాలు దర్శించ గలిగింది.

మానవ నాగరికత గురించి, మానవ పురోగతి గురించి గ్రాహమ్‌బెల్ ఆమెకి బోధపరిచాడు. ఫిలిప్స్‌బ్రూక్సు ఆమెకి డార్విన్ సిద్ధాంతంతోపాటు మత జీవనమూ మతాల ప్రాముఖ్యతా బోధించాడు. గ్రీకు కావ్యాల్లోని పురాణ పురుషుల గురించి చెపుతూ, అట్లాంటిక్ కేబుల్ ఎంత శ్రమ పడి నిర్మించిందీకూడా వివరించి చెప్పాడు. ఈ బ్రహ్మాండమయిన ప్రయత్నంలో ఎందరి ప్రాణాలు బలి అయినాయో విని హెలెన్ కన్నీరు కార్చింది. కాని యీ కొసనించి ఆ కొసకి చీకటి దారులగుండా ప్రయాణం చేస్తూ - మానవుడు అమరుడు సుమా - అని తలపింపచేస్తూ, ఆ తీగెలు మోసుకుపోయే సందేశాలకి ఆమె చకితురాలయింది. ఇటువంటి ప్రతి కథ ఆమెకి తన జీవితం పట్లా, పురోగమనం పట్లా నమ్మకం కలిగిస్తూండేది. గ్రాహమ్‌బెల్ ఆమెని యీ చోటు ఆ చోటు అని లేకుండా ఎక్కడికి పడితే అక్కడికి తిప్పుతూండేవాడు. ప్రతిదీ ఆమెకి నిత్య నూతనానుభవమే. ఒకసారి వారు టెలిఫోన్ స్థంభం పక్కగా ట్రామ్‌కారుకోసం నిలబడివున్నారు. గ్రాహమ్‌బెల్ ఆమెని టెలిఫోన్ స్థంభం

మీద చెయ్యి వుంచి, అదేమిటో చెప్పమన్నాడు. రాత్రిం బగళ్లను విచక్షణలేకుండా ఎల్లవేళలా కంపించే ఆ టెలి ఫోన్ తీగెలు మానవ హృదయ సంగీతాన్ని గానం చేస్తు న్నాయంది. అనుక్షణమూ అవి జనన మరణాలు, యుద్ధ శాంతులూ, భయాలు అపజయాలూ, లాభనష్టాలూ వీటికి సంబంధించిన వార్తలు ప్రపంచంచుట్టూతా మోసుకు పోతున్నాయి. మరొక రోజున వర్ష సమయాన సిందూర చెట్టు మొదట్లో నిలబెట్టి, మొదలు స్పృశిస్తూ ఆకుల గల గల ఎలా గ్రహించవచ్చో, స్పర్శద్వారా ఆమె తెలుసుకునే టట్లు చేశాడు గ్రాహమ్‌బెల్.

ఇంకోసారి నయాగరాజలపాతం వద్దకుతీసుకెళ్ళాడు. తాము వుంటున్న హోటల్ కిటికీమీద చెయ్యి వుంచి, నయాగరాజలపాతపు వుధృతం తెలుసుకోగలిగిందామె. హెలెన్ కెల్లర్ న్యూయార్కు నగరంలో రెండేళ్ళ పాటు చెవిటివారి స్కూల్లో వుండి చదువుకొంది. అప్పుడే స్టాట్యూ ఆఫ్ లిబెర్టీ (Statue of Liberty) ఎక్కింది. అమెరికన్ సారస్వతంలోనూ కళారంగంలోను ప్రఖ్యాతులైన యాం డ్రూకార్నీ, జాన్ రాక్‌ఫెలర్, వుడ్రోవిల్సన్, జోసఫ్ జఫర్సన్ మొదలైన వారితో పరిచయ మయింది. ఇక ప్రఖ్యాత తార ఎలెన్‌టెర్రీ, సర్ హెన్రీ ఇర్విన్ వీరిద్దరూ హెలెన్ కెల్లర్ కోసం ఆమె కోరిన పాత్రలు ప్రత్యేకంగా ప్రదర్శిస్తూండేవారు. వారి ముఖ మండలాల్లోని మార్పులతో హావభావాలని గ్రహించగలి గేది హెలెన్ కెల్లర్ తన వేలి కొనలతో. జోసఫ్ జఫ

ర్సన్ ఆమెకోసమని ఎన్ని పాత్రలు ఎన్ని విధాల ధరించి ఆమెని ఆనందింపచేశాడో! తద్వారా ఆమెని ఎంతటి భావ ప్రపంచానికి పరిచయం చేశాడో! ద్విపాత్రాభినయంలో అతను అగ్రగణ్యుడు. వీరుగాక జాన్ బరోస్, వాన్‌లా ఫార్గే, ఫ్రాంక్ స్టాక్టన్ - మొదలైన వారెందరో హెలెన్ వల్ల ఆకర్షింపబడ్డారు. ఛార్లెస్‌వార్నర్ ఆమె గురించి ఒక ప్రత్యేక వ్యాసం రాశాడు. నవలా రచయిత విలియం హోవెల్స్ వెనిస్ నగరంలో యీామె గురించి ఎంతో ఘనంగా పేర్కొన్నాడు. ఆనాటి కవులలో ప్రఖ్యాతులైన ఎడ్మండు స్టెడెమాన్, రిచర్డ్ గిల్డర్, యీామెమీద పద్యకావ్యాలు రచించారు. వీరిలో గిల్డర్ తను చంద్రకాంతిలో యీజిప్టు లోని పిరమిడ్ వైపుగా ఎలా నడిచిందీ ఆమెకి అర్థమయ్యే టట్లు ఎంతో చక్కగా విడమరిచి చెప్పాడట. హెలెన్‌పట్ల విపరీతమైన శ్రద్ధ తీసుకొన్నవారిలో గ్రాహంబెల్ తర్వాత మార్క్ట్వేన్‌ని పేర్కొనవచ్చు. లారెన్సు హట్సన్ యిచ్చిన ఒకానొక పార్టీలో మార్కుట్వేన్‌ని మొట్టమొదట సారిగా చూసింది హెలెన్. పార్టీ ప్రారంభమై, రెండు గంటలు గడిచాక 'అందరినీ నీకు కరస్పర్శతో పరిచయం చేశారుకదా, మళ్ళీ వాళ్ళని నువ్వు గుర్తించగలవా?' అని అడిగారు ఒకరు.

'ఓ, నిక్షేపంగా' అంది హెలెన్. అతిథులందరూ ఒకవరసలోనిలబడ్డారు. ఒక్కొక్కరేవచ్చిఆమెకిషేక్‌హాండ్ యివ్వగానే, ఆస్పర్శతో, షేక్‌హాండ్ యిచ్చిన మనిషి పేరేమిటో ఆమె యిట్టే చెప్పేస్తూండేది. ఆనాడు సమావేశ

మైన అతిథులందరూ హెలెన్ అద్భుతమేధాశక్తికి ఆశ్చర్య పోయారు. అంతమందిగల పార్టీలో మనంకళ్ళతోచూస్తూనే పేర్లు మర్చిపోతామే, కాని కళ్ళులేని హెలెన్‌కెల్లర్ ఏ వొక్కరి విషయంలోనూ పొరబాటులేకుండా జ్ఞప్తిలో వుంచుకో గలిగింది. అందరిపేర్లూ టకటకా చెప్పేసింది. పార్టీ అయి పోయి యింటికివెళ్ళి పోతుండగా మార్క్‌ట్వేన్ అను రాగంతో ఆమె శిరస్సు స్పృశించాడు. ఆ స్వల్ప స్పర్శ తోనే 'ఓ-మార్క్‌ట్వేన్'అనిగుర్తుపట్టింది హెలెన్‌కెల్లర్.

హెలెన్ వయసు అప్పటికి పధ్నాలుగు సంవత్స రాలు. మార్క్‌ట్వేన్‌కి ఆమెని చూడగానే విశ్వమానవుని లోని నూతనపరిమళం అగుపించిందట. హెలెన్‌కికూడా అతనిపట్ల ప్రేమాభిమానాలు ఏర్పడ్డాయి. 'మానవ లోకం లోని వింతలకి అంతులేదు - మిరకిల్ బ్రీడింగ్ ఫోర్సెస్ లో యీామె ఒకతె. ప్రజలకొక వెలుగు' అన్నాడు. హెలెన్‌కెల్లర్ ఏదో ప్రసంగవశాన 'నేను సుఖంగానే వున్నాను' - అని అనేసరికి, హాస్యచక్రవర్తి మార్క్‌ట్వేన్ 'సుఖమా? నరకంలోని తెల్లకాకులు మాత్రమే సుఖపడ గలవు,' అని ఛలోక్తి విసరకుండా వుండలేకపోయాడు. హెలెనూ ఆమె టీచరూ మార్క్‌ట్వేన్‌ని తరచూ కలుసు కుంటూండేవారు.

హెలెన్, పెర్కిన్స్ సంస్థ అధిపతి మైకేల్‌కి, అతని జన్మదిన సందర్భంలో, 'ది ఫ్రాస్ట్ కింగ్' (The Frost King-మంచురాజు) అను ఒక కథరాసి బహూకరించింది. ఆ కథ

ఆమె స్వంతంగారాసింది. కాని యిదేమాదిరికథ వెనక ఎవరో రాశారనీ, అది హెలెన్ కాపీకొట్టిందనీ అపవాదు బయలుదేరింది. 'ఒకవేళ అటువంటికథ నేను చిన్నప్పుడెప్పుడైనా విన్నానేమో! అది నామనసులో అడుగునపడిపోయి, యిప్పుడు యీ రూపాన బయటికివచ్చిందేమో! నేను బుద్ధిపూర్వకంగా యీ సాహిత్య చౌర్యం చెయ్యలేదు,' అని హెలెన్ సంజాయిషీ చెప్పుకుంది, అంతదయగా చూసిన మైకేల్‌కి యీ మెమాటలు రుచించలేదు. ఇది సాహిత్య చౌర్యమావునో కాదో తేల్చేందుకుగాను ఎనమండుగురు జడ్జీలను నియమించాడు మైకేల్. అందులో నలుగురుఅంధులు. మార్క్ ట్వేన్ వీరిగురించి పేర్కొంటూ ఆ ఎనమండుగురూ వొట్టి గాడిద లనీ, (Solemn Donkeys) జోన్ ఆఫ్ ఆర్క్ తరువాత అంతటిదైన హెలెన్ విషయంలో యిటువంటి అపవాదు పుట్టగా తను, తనకేమీ సంబంధం లేనట్టు వూరుకోలేననీ, యీ అంధ బాలిక వెనకటి జోన్‌కిమల్లెనే యీ సాహిత్య చౌర్యం ఫార్సులో ఎనమండుగురు న్యాయమూర్తులముందు నిస్సహాయంగా నిలబడిందనీ, యీ మాదిరి న్యాయ విచారణ, మూర్ఖ చిత్తులవల్ల జరపబడే యీ న్యాయవిచారణ, సిగ్గుచేటనీ (Owlishly idiotic and grotesque) యీ న్యాయమూర్తులు పూర్తిగా కుళ్లిపోయిన సరుకనీ, అమాయకురాలైన ఒక పిల్లి పిల్ల చిన్న మాంసపు ముక్కని నోట కరచుకుంటే, దానికి క్రమ శిక్షణ, నిజాయితీ, రుజు వర్తన మొదలైనవి నేర్పేందుకు కాచుకు కూచున్న దోపిడి దొంగల ముఠా అనీ చెడమడా అన్నాడు. 'కొద్దో గొప్పో సాహిత్య

చౌర్యం చెయ్యనిదెవరు? భావం సంప్రదాయం యావత్తూ పరంపరాను గతంగా వచ్చేదికాదా? మనకే బ్రహ్మాండంగా కలిగిందనుకున్న ఆలోచన వెనకనే కొందరివచ్చివుండవచ్చు. నేను అనేకులనుంచి అనేక భావాలు గ్రహించలేదా? అంత మాత్రాన అది తస్కరణ అవుతుందా?' అంటూ దుమారం లేవనెత్తాడు మార్క్ ట్వేన్. మైకేల్‌ని యీమాటలు తృప్తి పరచలేక పోయాయి సరిగదా హెలెన్ కెల్లర్ విషయంలో అతనికి వెనకటి భావం పోయింది. ఇద్దరి మధ్యా ఒక తెర లేచింది. పెర్కిన్స్ సంస్థనుంచి హెలెన్‌ని తీసుకెళ్ళిపోడం సర్వవిధాలా శ్రేయస్కరమనుకుంది యానీసల్లివాన్. హెలెన్‌కీ ఆ సంస్థకీ ఆనాటినుంచీ యించుమించు ఋణం తీరిపోయినట్టే. మైకేల్ తన హృదయ కవాటాన్ని మూసేశాడు; ఇంక ఆ తలుపు తెరుచుకోదు - అంటుంది హెలెన్ కెల్లర్.

'మంచురాజు' కథ విషయంలో జరిగిన సంఘటన ఎన్నో సంవత్సరాలపాటు ఆమెని భయాందోళనలలో ముంచెత్తింది. తనదే పొరబాటేమో! తనదే తప్పేమో! ఎవరో రాసిన కథ తనదైనట్టుగా వ్యాప్తం చెయ్యడం చెడ్డపనికాదూ? ఏమైతేనేం, ఆమె మనశ్శాంతి ఒక విధంగా ధ్వంసమయింది. ఈమె చదువుకిగాను 'నిధి' పోగుచేసేందుకు మార్క్ ట్వేన్ పూనుకున్నాడు. ఈలోగా హెలెన్ తండ్రి చనిపోడం, ఆర్థికంగా కుటుంబ పరిస్థితులు చెడిపోడం, వీటితో ప్రజలిచ్చిన విరాళమే ఆమెకు దిక్కు అయింది. కేంబ్రిడ్జి స్కూల్లోపాసయి, రాడ్‌క్లిఫ్ కాలేజి ప్రవేశపరీక్షకు కూచుంది. ఏమార్గమయితే కష్టభూయిష్టంగా వుంటుందో అదే పనిగట్టుకు వరించేది

హెలెన్. ఎన్నికష్టాలు దాటగలిగితే అంత మనోబలం వస్తుం దనేది. ఈమె జీవితం యీమెకేగాక యీమెచుట్టూ వున్న సన్నిహితులకికూడా ఒకనూతన ప్రయత్నమూ, ఒకప్రత్యేత సమస్యానూ. అప్పటికి బ్రయిలీ గ్రంథాలు బహుకొద్ది. ఈమె కోసమని ప్రత్యేకంగా జర్మనీనుంచీ, యింగ్లాండునుంచీ తెప్పిం చారు. ప్రత్యేక సిలండర్‌తోకూడిన టైపుమిషను మీద పరీక్ష పేపర్లురాసేది. నేర్చుకోడమంతాకూడా ఆ టైపు మిషనుతోనే నేర్చుకోవాలి. ఆర్థికశాస్త్రమూ, తత్వ శాస్త్రమూ, చరిత్రా, సాహిత్యమూ, మొదలైనవన్నీ, ఆ ప్రకారమే టీచరు యానీసల్లివాన్ సాయంతో వేలికొనల భాషలో నేర్చుకుంది. 1904 లో ఆమె కాలేజీ వదిలేనాటికి, గ్రీకు, లాటిన్, జర్మన్, ఫ్రెంచిభాషలు ఆమెకి క్షుణ్ణంగా తెలుసు. పాండిత్య ప్రకర్షలో పడకుండా జీవనరాగం ఆమెని కాపాడింది - అంటాడు ఒక ఫ్రెంచి రచయిత ఆమె గురించి రాస్తూ.

చాలా సంవత్సరాల తరువాత వుడ్రోవిల్సన్ ఆమె నొకసారి, 'సామాన్యమైన కాలేజీలు అనేకముండగా, అతి కష్టమైన రాడ్‌క్లిఫ్ మీ రెందుకు కోరుకున్నారు?' అని అడగ్గా - 'అదేమీ లేదు. రాడ్‌క్లిఫ్‌లో నన్ను జేర్చుకోడం వారి కిష్టంలేదు కాబట్టి అక్కడ చదువుకు పాసవ్వాలని నా పట్టు దల,' అంది. వ్యక్తిగతమైన ఆకాంక్షకోసం అంతటి పట్టు దల అవసరమా అని విల్సన్ ప్రశ్నించేసరికి - ఆమె సమా ధానం చెప్పక వూరుకుంది. రాడ్‌క్లిఫ్‌లో రికమెండేషనుల వంటివి పని చెయ్యవు. అప్పటికే తనని 'అనదర్ అమెరి కన్ బ్లఫ్' (Another American Bluff) అంటున్నారు. అం

చేత తన సమర్థతని నిరూపించుకునేందుకు రాడ్‌క్లిఫే శరణ్యం. మరొక కాలేజీనుంచి పాసయితే ప్రజలు నమ్మరు.

ఈమె సాధించినదానిలో పదోవంతు సాధించేందుకు ఎంతటి అవిరళ కృషి కావాలో తెలిస్తే ఆశ్చర్యపోతాము. ఎమ్మాగోల్డ్‌మెన్ అను రచయిత్రి 'లివింగ్ మై లైఫ్' (Living My Life) - అను గ్రంథంలో మానవ సంకల్పం లోని అనుపమశక్తిపట్ల తనకి విశ్వాసం కలిగించింది హెలెన్ అని చెబుతుంది. షిల్లర్ నాటకంలోని జోన్ ఆఫ్ ఆర్క్‌వలె, చీకటి ఖండాలు వెతకబోయిన కొలంబస్‌వలె లోక వృత్తం వైపు చేతులు చాచి సమస్తానుభవాలూ స్వీకరించేది. ఓటమి నంగీకరించడంకంటె తను నమ్మిన సిద్ధాంతానికి గాను విషపూరితమైన మధుపాత్రని సంతోషంగా పుచ్చుకున్న సోక్రటీస్ ఆమెకు గురుతుల్యుడు. యులిసిస్‌వలె ఏవిషయమైనాసరే చివరంటా చూస్తేనేగాని ఆమె విశ్రమించేదికాదు. బోస్టన్ మ్యూజియమ్‌లో మొట్టమొదటిసారి ఆమె, హోమర్, వర్జిల్ మొదలైనవారి శిలా ప్రతిమలని చూసింది. ఆ కళామందిరంలోకి ప్రవేశించి సోక్రటీస్ ప్లాటోలతో పరిచయం చేసుకు, వారి వూహాలోకాలలోకి ప్రవేశించగలిగింది. హెలెన్ కెల్లర్ తన జీవితంలో సగ భాగం, సౌందర్యం గురించీ, సాహసం గురించీ, ఔదార్యం గురించీ తలపోస్తూ గడిపింది. ఈప్రపంచం సువిశాలమైనదనీ, చేయగల కార్యాలు అనంతంగా వున్నాయనీ ఇదొక అతి రమణీయప్రదేశమనీ ఆమె దృఢనమ్మకం. కాంతికిరణాలు నమ్మి నడవడం నేర్చుకుంటేనే యీ జీవితానికి అర్థం కన పడుతుందనేది.

# 3. రెంథామ్

హెలెన్ కెల్లర్ రాడ్‌క్లిఫ్ కాలేజీనుంచి పట్టభద్రురాలయాక, యానీసల్లివాన్ ఆమె కలిసి, బోస్టన్ నగరానికి యిరవై ఆరుమైళ్ళ దూరంలోవున్న రెంథామ్ అనుగ్రామంలో ఒక పాతకాలపు యిల్లు కొన్నారు. ఆ యింటిచుట్టూ ఏడెకరాల నేల ఉంది. అక్కడ వుండగానే ఆమెకి వృక్షసంపదతోనూ, ఫల పుష్పజాతులతోనూ, రకరకాలైన జంతువులతోనూ బాగా పరిచయం కలిగింది, పచ్చగడ్డి వాసననిబట్టి తెలుసుకోడం, ఈతనేర్చుకోవడం, పెంపుడు జంతువులని పెంచడం, పళ్ళతోటా పూలతోటా వేసుకోడం మొదలైన వాటితో ఆమెకిచక్కగా కాలక్షేపం అవుతోంది.

అది పాతకాలపు యిల్లు. తమకి కావలసిన విధంగా కొద్దిమార్పులు చేసి, ఆ చుట్టూగల ప్రదేశంలో తన యిష్టం వచ్చినట్లు తిరుగుతూండేది హెలెన్. దూరంనుంచి వెళ్ళే రైలుబండి, ఆ యింటిని మొట్టమొదటిసారి కుదిపినపుడు భూమాత ఏదో జలదరించినట్లుగా నూతనానుభవం కలిగింది. వాళ్ళ హాలులోవున్న హోమర్ ప్రతిమ చూపరులను ఎంతో ఆకర్షించేది. ఆ ప్రతిమచూస్తూ, అనగా వేలికొనలతో స్పృశిస్తూ, ఆ అంధకవి జీవితాన్నీ, ఆ అంధత్వంనుంచి ఆయన సృష్టించి నిర్మించిన కావ్య సౌందర్యాల్నీ తలుచుకు తలుచుకు ముగ్ధురాలయేది హెలెన్. భాషలన్నిటిలోకీ సొగసైనది గ్రీకుభాషట. భావాలు అతి చక్కగా చెప్పగలిగేది వయొలెనట. మూక హృదయాన్ని శబ్ద ప్రపంచంలోకి మార్చి

చెప్పగలిగే నేర్పు ఒక్క వయిలెనిదేట! గ్రీకుభాషగురించీ వయిలెన్ గురించీ ఆమెకి నిశ్చితాభిప్రాయాలు చిన్నతనం లోనే ఏర్పడిపోయాయి. ప్లాటోరచనలు గ్రీకులోనూ, హూరేస్ రచనలు లాటిన్ లో చదవడం ఆమెకి సరదా. ఆమెకి యిష్టమయిన జర్మను పుస్తకాలు అనేకమున్నాయి. ఇంక ఫ్రెంచి రచయితల్లో పాస్కల్ ఆమెకి పూజనీయుడు. ఇంగ్లీషుకవులలో షేక్సిపియర్, పోప్, డ్రయిడిన్, కీట్సు, షెల్లీ, బ్రౌన్ ఆమెకి దేవతలు. అమెరికన్ రచయితల్లో ఎమర్సన్, థారో, విట్ మాన్, తరువాతనే మిగతావారు.

ప్రతిరోజూ వుదయం ఆరుగంటలకి లేచేది హెలెన్. జుట్టు దువ్వుకుని, గది శుభ్రపరిచి, పక్కబట్టలూ అవీ సర్ది ఆయా గదుల్లో ఏఏ పుష్పాలుపెట్టాలో తోటలోంచి కోసి తీసుకువచ్చి, అమర్చి, వంటగిన్నెలు కడగడంలో యానీకి సాయంచేసి, నీళ్ళటాంక్ నింపేందుకు విండ్ మిల్, తిప్పేది. ప్రతివారం చాకలికి వేసేబట్టలు తనే పద్దురాసేది. రాడ్ క్లిఫ్‌లో వుండగా మిగతా పిల్లలతో కలిసి, పది పన్నెండు మైళ్ళదూరం ఎక్స్ కర్షన్ కంటూ పోతూండేది. ఒకసారి నలభై మైళ్ళు సైకిల్ తొక్కింది. గుర్రపుబండి తోలడం అన్నా, గుర్రపుస్వారీ అన్నా ఆమెకి తెగ యిష్టం. ఏదైనా ఎప్పుడైనా యిటువంటి ప్రయత్నాలలో దెబ్బ తగిలించుకున్నా – అదేమంత పెద్దదిగాదని కొట్టి పారేస్తూండేది. ఇక కుక్కలంటే ఆమెకి ఎంతయిష్టమో చెప్పలేం. వేరువేరు జాతులకి చెందినకుక్కల్ని ఎంతో శ్రద్ధగాపెంచేది. యాపిల్

చెట్టు ఎక్కి కొమ్మదులిపి పళ్లు నేలరాల్చడమంటే ఆమెకి మహా సరదా.

కాలప్రవాహం దొర్లిపోతోంది. ఒకే ఒక ప్రశ్న హెలెన్ మనసుని ఎల్లవేళలా వేధిస్తూ వుండేది. ఈ ప్రపంచంలో తనకిగలస్థానం ఏమిటి? 'నాకేమైనా ప్రత్యేకత వుందా? నావిద్యకోసమని యింతధనం ఖర్చయిందే! ఇదంతా వృథా ఖర్చేనా? ఇతరులు యింతకష్టబడి విరాళాలు పోగుచేసి నాకు చదువు చెప్పిస్తే, నేను ప్రత్యమ్నాయంగా ప్రపంచానికి చెల్లించవలసిన ఋణం లేదా?' అని తన భవిష్యత్ గురించి ఆలోచించుకోసాగింది హెలెన్ కెల్లర్. 'ఈవిషయం నువ్వూ యానీ ఆలోచించడం కాదు, మీ యిద్దరికీ ఏది మంచో మాకు తెలుసు' అని వారితరఫున ఆలోచించేందుకు కొందరు అదేదో తమ బుజాలమీదవున్న భారంలా ముందుకు వచ్చారు. రుమేనియారాణి హెలెన్ని రుమేనియావచ్చి అంధ బాలబాలికల పాఠశాల నిర్వహించమనీ, ఆప్రకారం చెయ్యడంవల్ల హెలెన్ జీవితం నిజంగా సార్థక మవుతుందనీ హితోపదేశం చేస్తూ రాసింది. తను రాలేనని హెలెన్ రాసేసరికి – ఆ రాణీగార్కి కోపం వచ్చి వుత్తర ప్రత్యుత్తరాలకి స్వస్తి చెప్పింది. 'ఏమిటో అనుకున్నాను – హెలెన్ స్వార్థపరురాలు; నేనిటువంటి బ్రహ్మాండమయిన అవకాశం కల్పించబోతే ఆమె నిరాకరించింది. అంధ ప్రజల సంక్షేమంపట్ల ఆమెకేమాత్రం శ్రద్ధలేదు,' అని ప్రచారం చేసింది ఆరాణీగారు. వ్యక్తిగా పెరిగిన హెలెన్కి, అంధులపట్ల సానుభూతి చూపినంతమాత్రాన వారిసమస్య

పరిష్కారం కాజాలదని, లోపంగలవారివిషయంలో ఆ లోపంగురించి పదేపదే చెప్పడంకంటె, అది వారు విస్మరించే టట్లుచేసి, సామాన్యప్రజలవలె జీవించనిస్తే వారు సుఖపడతా రనీ హెలెన్ విశ్వాసం. రుమేనియారాణి తరువాత, విక్టోరియా మహారాణి, హాలెండ్ రాణి, స్పెయిన్ రాణి, గ్రీసు రాణి, ఎలిజబెత్ రాణి మొదలైనవారెందరో యీమె జీవిత గమనాన్ని శ్రద్ధతో పరిశీలించసాగారు.

హెలెన్ మనసుని తమ ప్లాను ప్రకారం తిప్పాలని ఒక్క రుమేనియా రాణేగాక చాలామంది ప్రముఖులు తంటాలు పడ్డారు. 'ఆమెమార్గం ఆమె తెలుసుకుంటుంది. ఎవరూ పనిగట్టుకువచ్చి చెప్పనవసరంలేదు. భగవంతుని ప్రియబంధువైన యీ కన్యకి, ఆ దేవుడు దారి చూపక పోడు. మీారెందుకు పిలవని పేరంటానికివచ్చి, నోరు పారేసు కుంటారు?' అని వుచిత సలహాలిచ్చేవారికి బుద్ధివచ్చేవిధంగా మార్క్ ట్వేన్ అన్నాడు. అంధులకోసమని తనజీవితం అర్పింపనున్నానని హెలెన్‌కి తెలుసు. కాని ఆ కార్యదీక్షకు ముందు తను మాటలు పల్కడం నేర్చుకోవాలి. తనకిగల అవరోధాలు జయించి, ఏదోవిధంగా మాట్లాడటమన్నది నేర్చుకోవాలి. ఒక్కటి అనుకుంది హెలెన్: మనసుకి సంశయాలూ ఏకాంతత వుండవచ్చు. కాని యీ జీవితం లోక సేవకి కైంకర్యమయితీరాలి. ఏ ద్వారంగుండా యీ విశాల ప్రపంచంలోనికి ప్రవేశించడమూ, ఆ ద్వారం యింకా ఎప్పుడు ఏవిధంగా తెరవబడుతుందా అని ఆమె ఎదురు చూస్తూండగా వాల్ట్‌విట్‌మాన్ కవితాస్రవంతి, ఆమెకి

నూతనధైర్యాన్నీ ఆత్మబలాన్నీ సమకూర్చింది. 'ఆ పద్య పాదాలు చదువుతుంటే, నా హృదయం ఆ కవివైపుగా పురక లెత్తింది. మా చీకటి యింట్లోని కిటికీలను తెరిచాడా మహనీయుడు' అని అంటుంది హెలెన్ కెల్లర్.

తనకి పదిమందీ కలిసి చెప్పించిన చదువు ఎందుకూ కొరగాక పోయినా, ఆఖరికి తాను తర్జుమా లేనా చేసి, అంధు లకి వుపయోగపడే అనువాద గ్రంథాలద్వారా కొంతలో కొంత, సేవచేసినదాని నవుతా ననుకుంది హెలెన్. అప్పటి కప్పుడే ఆమె ఆత్మకథ 'ది స్టోరీ ఆఫ్ మై లైఫ్' (The Story of My Life) ప్రచురితమయింది, ప్రజలు ఆ పుస్త కాన్ని వెర్రిగాకొని చదువుతున్నారు. అది ఆమె కాలేజీలో వుండగానే పబ్లిష్ అయింది. దీని వ్రాతప్రతి తయారుచెయ్య డంలో ఎందరో నడుం కట్టారు.

హెలెన్‌కి ఒక ప్రత్యేకమయిన శైలివుంది. బైబిల్ కథల్లోనిఘట్టాలనిస్ఫురింపచేసే బలమైనశైలిఅది. పన్నెండో ఏటే ఆమె జీవితచరిత్ర అచ్చువేస్తామని ఒక పత్రిక అడిగిం దిట. జాన్ మాసీ అనే ఆయన సాయంతో 1903 లో యీ మొదటి పుస్తకం వ్రాతప్రతి తయారయింది. హెలెన్ బ్రయిలీలో రాసినది, మామూలు భాషలోకి మార్చుకు, మళ్ళీ ఆమెకి ఏదేని చెప్పదలచుకుంటే, బ్రయిలీలోచెప్పాలి, అరిచేతిలో వ్రాసి ఆమెకి చెప్పడం జాన్ మాసీ నేర్చుకుని, ఈ పుస్తకంకూర్చడంలో కుడిభుజంవలె సాయబడ్డాడు. హెలె న్ కెల్లర్ రచించిన ది స్టోరీ ఆఫ్ మైలైఫ్ యాభై భాషల్లోకి తర్జుమాఅయింది. ఆ యాభై భాషల్లో ఒరియా, సెబుయానో,

హిలిగాయన్, టిలాలగ్, యిలోకనో, కన్నడ, పుస్తు, తెలుగు, తమిళ భాషలుకూడా వున్నాయి.

1905 లో జాన్ మాసీ హెలెన్ టీచరయిన యానీ సల్లివాన్‌ని వివాహమాడాడు. అతను యానీ కంటె పద కొండేళ్ళు చిన్నవాడు. బోస్టన్ నగరం అతనికేదో విశాల మైన జైలువలె కనపడింది. హార్వర్డ్‌లోవుండగా యీజాన్, విలియమ్‌జేమ్సు అను తాత్వికవేత్తకి సన్నిహితుడయాడు. మానవ స్వభావం ఆరు బయలు వంటిదని, అతను తరచు పేర్కొంటూండేవాడు. ఏమైనా ఆతాత్వికవేత్త యీజాన్‌కి ఆదర్శపురుషుడు. విమర్శకునిగా రాణించాలనుకున్న జాన్‌కి ఆ నాటి సాహిత్య ప్రపంచమంతా చిందర వందరగా కన పడింది. తన విమర్శలలో షేక్సపియర్‌నీ డాంటేనీ వుదహ రిస్తూ, వెల్సూ బెర్నార్డుషాలని గురుసమానులుగా భావించే వాడు. పదాలతోను పుష్పాలతోను ఆడుకునే మృదుస్వ భావం మాతర్లింకుది - అనేవాడు. ఈ జాన్ మాసీయే వృత్తి రీత్యా, ది నేషనన్ (The Nation) అను పత్రికకు సాహిత్య సంపాదకుడయాక జేమ్సుజాయస్, డి. హెచ్. లారెన్సులకి అమెరికాలో స్వాగతమిస్తాడు, 'అమెరికను సారస్వతం'అను పేరిట యితనురాసిన గ్రంథం, అమూల్యమైనదిగా భావింప బడుతోంది.

హెలెన్‌కీ యితనికీ అనేకవిషయాల్లో ఏకాభిప్రాయం కుదిరేది. విలియమ్‌జేమ్సు, వాల్ట్‌విట్‌మాన్, మార్క్‌ట్వేన్ - యీ ముగ్గురూ వీరికి ఆరాధ్యదైవాలు. 'ది ప్రిన్సు అండ్ ది పాపర్' - అను మార్క్‌ట్వేన్ నాటకాన్ని, హెలెన్‌కెల్లర్

చూసింది. ఆ తరువాత 'లైఫ్ ఆన్ ది మిసిసిపి' కూడా చూసి, అందులోని సన్నివేశాలు తన బాల్యస్మృతులని జ్ఞప్తికి తెస్తున్నాయని, ఆ మహారచయితతో చెప్పింది. మానవునిబుద్ధి బలంగురించీ, వివేకంగురించీ - హెలెన్ కెల్లర్ కీ జాన్ కీ ఒకేవిధమయిన అభిప్రాయాలుండేవి. కాలేజీలో వుండగా హెలెన్ కెల్లర్ - షాఫేన్ హార్, నీషి, బెర్గ్ సన్, టాల్ స్టాయ్, కారల్ మార్క్సులు చదివింది. జాన్ ఆమెకి రోమెన్ రోలా, థామస్ హార్డీ, క్రాపాట్కిన్, యనటోన్ ఫ్రాన్సు, వెల్సులను పరిచయంచేశాడు. సోషలిజమ్ అనేది నేటి సామాజిక వ్యవస్థలో ఎలా తప్పనిసరో ఆమెకి అవగత మయే పద్ధతిలో బోధపరిచేవాడు. ప్రపంచ ప్రజలందరూ సోదరులు; అన్నిమతాలూ సోదరధర్మం పాటించాలి - అని చెప్పే పెద్దఖబుర్లవల్ల ప్రజానీకపు పరిస్థితి బాగుపడదని జాన్ కి తెలుసు. కాని రకరకాలపేర్లతోవచ్చే ఆందోళన లన్నీ సోషలిజమ్ కి పునాదిరాళ్ళవంటివని అతని వుద్దేశం. ఈ ప్రపంచం చాలా కష్టనిష్టూరాలతో కూడుకుని వుందనీ, సామాన్యప్రజలు సుఖపడేందుకు సాంఘిక వ్యవస్థ మారాలనీ, ఆ మార్పు సంభవమయేందుకుగల అవకాశంగురించి అనేకప్లానులు, సర్వరోగ నివారిణుల్లాటివి హెలెన్ కెల్లర్ బుర్రనిండాకూడా వుండేవి. జాన్ ఆమెకి ఒకవిషయంలో దృఢనిశ్చయం కలిగేటట్లు చేశాడు. సోషలిస్టుభావ సముదాయంవైపు, ప్రపంచప్రతిభ నడుస్తున్నదని ఆమె గుర్తించే విధంగా చూపగలిగాడు. ప్రఖ్యాత చిత్రకారులూ, శాస్త్రకారులూ, సోషలిజమ్ తప్ప మరొకమందు లేదని నొక్కి-

చెప్తున్నారు. విలియమ్‌మారిస్, రసల్‌వాలెస్, విలియమ్
డ్రోన్, వెల్సు, షా, - వీరందరూ మానవ ప్రగతికి అదే
మైలురాయిసుమా అని వైతాళికులై దారిచూపుతున్నారు.
కుర్రకారు రచయితలు ఫలాన నెక్‌టై వేసుకోడం ఎలాటి
ఫేషనో, సోషలిజమ్‌కి కట్టుబడి వుండటంకూడా అదేమాదిరి
దని ఆవైపు మొగ్గుతున్నారు. ప్రపంచ సంస్కృతి సోషలిజ
మ్‌కి చెందవలసివుంది, అని లెస్సల్లి (Lassalle) చెప్తూండే
వాడు.

'మా దేశంలో రాజులు లేరు. కాని యిది పెట్టుబడి
దారుల ఆటస్థలం వంటిది. ఈ అమెరికాదేశం అధికార
తృష్ణ విపరీతంగాగల బూర్జువాల పాదాలవద్ద పడివుంది,'
అంటూ జాన్ 'సోషలిజమ్ యిన్ అమెరికా' (Socialism
in America) అను గ్రంథంలో పేర్కొన్నాడు. ఈ భావ
పరంపరలన్నీ హెలెన్ మనసుని అనేకవిధాల కలవర
పెట్టాయి. యానీని సాయం పుచ్చుకుని సమాజపు నిచ్చెన
అట్ట అడుగు మెట్టుమీదవున్న నికృష్టజీవుల జీవితం చూసేం
దుకుగాను వెళ్లివస్తూండేది. ఆ దౌర్భాగ్యుల జీవితమే ఒక
నిరంతర పోరాటం, అసంతృప్తి, నిస్సహాయత, వేదన - వారి
జీవిత బాటలు. పైవర్గంవారు తమ స్వంతలాభాలకోసం, బీద
సాదలని ఏవిధంగా అణగదొక్కుతోందీ - ప్రత్యక్షంగా
తెలుసుకుంది హెలెన్. కాలేజీలో బోధించిన 'ఎకనమిక్సు'
వేరు - జీవితంలో తనకి కనబడుతున్న 'ఎకనమిక్ ఫాక్ట్స్'-
(ఆర్థిక సత్యాలు) వేరు. యానీకి యీ సోషలిస్టు అభిప్రా
యాలు మొదట్లో హితవుగా తోచేవి కాదు. కాని రాను

రాను హెలెన్‌లోని సంస్కరణాభిలాష వైపుగా తనుకూడా
మొగ్గక తప్పింది కాదు.

జాన్, హెలెన్‌కి సాహిత్యంలోని కొత్త పంథాలు,
విజ్ఞానశాస్త్రం పరిచయం చేసిన నూతన అవకాశాలూ,
ఎప్పటికప్పుడు తెలియబరుస్తూండేవాడు. ఆమె వ్రాత
ప్రతులు సరిదిద్దిపెట్టడం, ఆమె రచనలు విమర్శించడం
మొదలైనవి చేస్తూ ఆమెకి ఎంతో సాయంగా వుండేవాడు.
రెంథాల్‌లో వుండగానే ఆర్థర్ రైడర్ అను సంస్కృత
పండితునితో పరిచయం కలిగింది హెలెన్‌కి, జాన్ వల్ల.
అరెన్సుబర్గ్ (Arensburg) అను కళాకోవిదునితోకూడా
ఆరోజుల్లోనే పరిచయమేర్పడింది. పద్యకావ్యాలు ఆమెని
ఎంతో ఎక్కువగా వుత్సాహపరుస్తూ మనసుకి శాంతిని
కలుగజేస్తూండేవి. యానీకి సామాన్యప్రజలంటే గిట్టేది
కాదు. సామాన్యుల చవకబారు సంభాషణ ఆమెకి విసుగు
తెప్పించేది. సత్‌శీలమూ, సద్గుణమూ, సౌందర్యపిపాస,
సాధించి పొందవలసిన సత్ఫలాలుగా భావించేది యానీ.

ఏ టీచరు నిరంతరశ్రద్ధ అయితే, తనజీవితానికి ఒక
ఆకృతినీ అందాన్నీ కల్పించిందో, ఆమె ఆదర్శాలగురించీ
భావవైశాల్యతగురించీ ఎంతో ఘనంగా కృతజ్ఞతాభావం
వెల్లుబికేటట్లు చెపుతుంది హెలెన్ కెల్లర్. అమెరికా
మొత్తంమీద యానీవంటి టీచర్లు - పట్టున పదిమందికూడా
వుండరుట. రెంథామ్‌లో వున్నపుడు వారికాలం వివిధవినోదా
లతో గడిచిపోయేది. హెలెన్, తను ఒక్కతే కూచుని
పేకాడుకునేది (Solitaire). ఈమె చదరంగం ఆడేందుకుగాను,

చదరంగంబల్లనీ, బలగాన్నీ ప్రత్యేకంగా తయారు చేశారు. నల్లబలగంపైన సాపుగా వుండేది; తెల్లబలగం కొంచెం ఏటవాలుగా వుండేది. ఆ తేడావల్ల హెలెన్ అవతలవారి ఎత్తును, వేలికొనలద్వారా తెలుసుకు, ఎంతో వుత్సాహంతో ఆడుతూండేది. వర్షం పడుతున్నపుడూ, మంచు కురుస్తున్నపుడూ, గాలి రివ్వున వీస్తున్నపుడూ ఆమెకి పరుగులెత్తడం సరదా. అటువంటిసమయాలలో ప్రకృతిలో తను ఒక భాగమై ఆనందపడేది. ఆమె గుర్తు తెలుసుకునేందుకుగాను ఒక పొడుగాటితీగె కట్టారు. ప్రతి సాయింత్రం షికారుకి వెళ్తూండేది ఆ తీగెవెంట. యానీ రాలేకపోతే జాన్ సాయం మొస్తూండేవాడు. ఏమైతేనేం ఆ చుట్టుపట్లనున్న నదీనదాలూ, కొండకోనలు, పచ్చికబైళ్లూ, చెట్లూ చేమా సమస్తమూ ఆమెకి తెలుసు.

మొదటిపుస్తకం తరువాత హెలెన్, 'ది వరల్డ్ ఐ లివ్ యిన్' (The World I Live In) అను గ్రంథం రచించింది. 'ది స్టోరీ ఆఫ్ మై లైఫ్' చదివి ఆ ఆత్మకథ విషయంలో తమకి కలిగిన సంశయాలు వెలిబుచ్చిన పాఠకులకి - యీ రెండవగ్రంథం ఒక సమాధానమని చెప్పవచ్చు. 'ది సెంచరీ' మాగజైన్ సంపాదకుడు రిచర్డ్‌గిల్డర్ ఆమెనీ గ్రంథరచనకి పురిగొల్పాడు. ఆ తరువాత 'ఆప్టిమిజమ్ (Optimism) అను రచన ప్రచురించింది. జీవితంపట్ల విశ్వాసముంటేనేగా జీవన సౌందర్యం కనబడదను ఆశావాదం, యీ గ్రంథంలోని మూలసూత్రం.

హెలెన్ కెల్లర్ ఏనాడూ తనకి తానుగా డబ్బు వ్యవహారాలు చూసుకోవలసిన పని లేదు. ఒక బజారు దాటాలంటే తనకి ఎవరోవొకరు సాయంగా వుండి దాటిస్తారు. మానవునికి బాధకలిగించే అనేక దృశ్యాలూ శబ్దాలూ విననవసరం లేదు. ఆమెది ఒకవిధంగా గూడుకట్టుకున్న జీవితం, తను ఆశావాదేగాని యితరులకి బోధపరచడం, బోధించడంఅంటే ఆమెకి ఏవగింపు. భగవత్ విశ్వాసం ధర్మోపదేశాలకి (Preaching) అతీతంగా వుంటుందనేది ఆమె. షేక్స్పియర్ రచించిన యాజ్ యు లైక్ యిట్, కింగ్ హెన్రీ ది ఫిఫ్త్ - యీ రెండు నాటకాలూ ఆమెకి చాలా యిష్టం. నిశ్శబ్దంతోనూ వోర్పుతోనూ పడివున్నంత మాత్రాన బాధలు తీరవు. శబ్దరహిత, దృష్టిరహిత ప్రపంచంనుంచి, కోకిలపాటని సృష్టించ గలగాలి; ఆనాడే జీవితసాఫల్యం చూడ గలుగుతాం - అంటుంది.

చిన్నతనంనుంచీ, 'నేను ఆలోచిస్తున్నాను కాబట్టి, నేను వున్నాను.' అన్న డెస్కార్టిస్ పలుకులు జీవితపు పునాదిరాళ్లుగా చేసుకోడంవల్ల, ఆమెవూహాప్రపంచం కాలావకాశలకి (Space and Time) అతీతంగావుండేది. నిజప్రపంచంలో మనం భౌతిక బంధాలకి కట్టుబడి వుంటాము. కాని ఆమె తత్వచింతన విపరీతంగా జీర్ణించుకున్న దవడంచేత, అంధత్వ బధిరత్వాలు విస్మరించి, ప్రకాశవంతమైన ఒక వూహాజగతిని నిర్మించుకో గలిగింది. ఇటు యూదులవల్లా అటు కిరిస్టియనులవల్లా అనుమానింపబడి, సంఘబహిష్కరణలో, దారిద్ర్యంలో, లోకుల అసహ్యాపు పల్కులలో, వేటికీ జడవక, దేనికీ తల

వంచక, తన సుఖశాంతులు కాపాడుకో గలిగిన స్పినోజా (Spinoza) జీవనమార్గం, ఆమె చక్కగా అర్థంచేసుకో గలిగింది. స్పినోజాకి మల్లేనే హెలెన్ కూడా తను కోరిన ప్రపంచాన్ని నిర్మించుకుంది. దానికి కాలమూ అవధులూ లేవు. జీవితకాలం ఒక గంటలో యిముడుతుంది, అనంత కాలాన్ని ఒక్క త్రుటిలోకి దించవచ్చు. గాలిలో విహరిం చడమంటారే అటువంటి ప్రపంచమది. భౌతిక బంధాలూ, భౌతిక పరిసరాలూ, పదార్థజగత్తూ - వీటిని అవలీలగా దాటే సిన ప్రపంచమది.

తన యీ ప్రపంచం గురించి 'ఆప్టిమిజమ్' అను పుస్తకంలోనూ, మిగతా గ్రంథాలలోనూ పేర్కొంది. ప్లాటో కలలుకన్న ఆదర్శ ప్రపంచం తనలాటివారి కెంతో వుపక రిస్తుంది. మనకి కనిపించేవస్తువులూ, వినిపించేశబ్దాలూ, అవి వాస్తవాలు కావనీ, వాస్తవ భావనల అసంపూర్ణరూపా లనీ (Imperfect Manifestation) అని ప్లాటో వాదన. అసలు, ఫిలాసఫీ అనగానే బధిరాంధుని జీవితచరిత్ర అంటుంది హెలెన్, ఈ భౌతిక ప్రపంచంనుంచి తప్పించుకు భావనా జగతిలో విహరించేందుకు మానవుని ఆత్మ ఎలా కొట్టుకునేదీ, బధిరాంధులకి బాగా తెలుస్తుందట. శూన్యతని తరిమేసి, కాంతిని ఆహ్వానించడమట, ఆప్టిమిజమ్ (ఆశావాదం) దుష్ట త్వాన్నీ విచారాన్నీ జయించి ప్రజలలో సత్ స్వభావం కలి గిస్తుంది. ఆశావాదమే లేకపోతే ప్రజలలో మంచితనం కన పడేందుకు అవకాశం లేదు. ప్రజలలో మంచితనం కనపడటం ఆశావాదమే నిజమైన జీవిత విధానమనేందుకు తార్కాణం.

శూన్యవాదం (Pessimism) మానవునిలోగల వుత్తమశక్తు లని హరింప చేస్తుంది. దారిద్ర్యమూ అజ్ఞానమూ, జయిం చేందుకు తగిన బలాన్ని యివ్వదు. తమ పరిసరాలతో పోరాడగల ఆత్మబలం చేకూర్చదు. ఈ పోరాటశక్తి మాన వునిలో ఏనాడైతే మృగ్యమవుతుందో, యింక అప్పటినుంచి సంతోష రేఖలనేవి కనపడవు, సంశయమూ అపనమ్మకమూ యీ రెండూ భీరువుల సహజగుణాలు, ఉత్తములూ ఉన్న తులూ వీటిని తమ మనోవైశాల్యంవల్ల యిట్టే జయించ గలుగుతారు,

జీవితమొక సాహసయాత్రేనా అవతుంది, లేదా శూన్యత్వంగానేనా పరిణమిస్తుంది - అన్న హెలెన్ కెల్లర్ విశ్వాసం, ఆమెజీవితంలో క్రియరూపేణా కనపడింది. మార్క్ ట్వేనూ గ్రాహమ్‌బెల్లూ యీామె యింతదవుతుందని చిన్న ప్పుడే అనుకున్నా, మిగతా లోకానికి యీామె సాధించిన అపూర్వ విజయాలు తెలుసుకునేందుకు కొంత కైము పట్టింది.

'అంధత్వమనగా ఏమిటో మీకు తెలియదు. ఒక అర్థరాత్రివేళ మీరు వుంటున్న ఇల్లు నిప్పు అంటుకుంటే, పడకగదిలోని మంచంమీంచి తప్పువైపుగాదిగి, చుట్టూ పొగచుట్టేస్తున్నపుడు, గది తలుపు ఎక్కడా అని వెతుక్కో డంలా వుంటుంది. అటువంటి అనుభవం ఒకసారి కలుగు తేనే కాని హెలెన్ కెల్లర్ అంధత్వమూ, అది జయించేం దుకు ఆమె చేస్తున్న ప్రయత్నమూ మీకు అర్థంకావు,' అన్నాడు మార్క్‌ట్వేన్ ఆమె విమర్శకులను వుద్దేశిస్తూ.

యానీ, హెలెనూ, మార్క్‌ట్వేన్ యింట్లో ఒకసారి మూడురోజులపాటు వున్నారు. అతని మాటల్లో పొగాకు పరిమళముంది, అనేది హెలెన్. 'ఆత్మరహితంగా శూన్య దృక్కులతో ఈ లోకాన్ని వీక్షించే తేజోవిహీనమైన నేత్రాలుకొల్లలుగా వున్నాయి, యీ ప్రపంచంలో, హెలెన్, నీవి శూన్యదృక్కులుకావు. నీ ముఖంలో ఒక వెలుగువుంది. ఇప్పుడు కాకపోయినా కొన్నాళ్ళకేనా లోకం గ్రహించక పోదు.' మార్క్‌ట్వేన్‌లో గల గొప్పతనమేమిటంటే ఏనాడూ అతను హెలెన్‌తో మాట్లాడుతున్నప్పుడు, ఏదో స్త్రీతో మాట్లాడుతున్నట్లుగాక, ఒక ప్రత్యేక వ్యక్తి, అదృష్టంకొద్దీ తనకి అంత సన్నిహితురాలైనట్లుగా. ఆమెకి పూర్తివ్యక్తిత్వం యిచ్చి, మాట్లాడేవాడు.

గ్రాహమ్‌బెల్‌తో హెలెనూ యానీ హాలీడే గడుపుతున్నపుడు, బెల్ తను కనిపెట్టిన ఎగిరే యంత్రంలో హెలెన్‌ని కూచోపెట్టి గాలిలోకి వదలిపెట్టాడు. ఈ ప్రయత్నం జరుగుతున్నపుడు ఖగోళశాస్త్రజ్ఞుడు సైమన్ న్యూకూంబ్, ప్రొఫెసర్ లాంగ్లే పక్కనేవున్నారు. ఆ తరువాత వీరంతా కలిసి, నది మీద విహారయాత్రకి బయలుదేరారు. ఆ రోజు పడవనడిపే వంతు హెలెన్‌ది. ఈ అంధబాలిక తమని దరిజేర్చలేక పోతుందేమోననేభయం ఎవరికీలేదు. చుక్కాని దగ్గిరకూచున్న హెలెన్‌తో మాగ్నిటిజమ్ గురించి, ఫిజిక్సులోని ప్రాబ్లెమ్స్‌గురించి సంభాషించేవారు ఆ పండితులు. వీరందరూ తనతో యీ విషయాలు మాట్లాడటం తనమీద వుంచబడుతున్న ప్రత్యేక బాధ్యతగా పరిగణించేది హెలెన్.

ఒకసారి గ్రాహమ్‌బెల్, అతని యిద్దరి కుమార్తెలుతో హౌవుస్‌బోటుమీద, ప్రయాణం చేస్తూండగా, రాత్రివేళ చంద్రకాంతిలో నీటిలో యీతకొట్టేందుకుగాను హెలెన్ గబగబా తాళ్ళనిచ్చెన దిగివచ్చేసరికి, అందరూ ఆశ్చర్య పోయారు,

డాక్టర్ బెల్‌తో హెలెన్‌కెల్లర్ అనేక ప్రఖ్యాత సంస్థలకి వెళ్ళింది. ఇన్ మెమోరియమ్,(In Memoriam), జూలియస్ సీజర్, (Julius Caesar), ది టెంపెస్టు (The Tempest) లోని కావ్యభాగాలు ఆమె అరిచేతులో రాస్తూండేవాడు డాక్టర్ బెల్. 'నీవు వొక ప్రత్యేక వ్యక్తివి. లోకానికి నీవల్ల జరగవలసిన వుపకార మెంతైనావుంది,' అని ఎప్పటికప్పుడు ఆమెకి జ్ఞాపకం చేస్తూండేవాడు. ఒకసారి వివాహప్రసక్తి వచ్చింది. 'నిన్ను ప్రేమించగల పురుషుడు తటస్థపడ్డప్పుడు వివాహమాడేందుకు వెనుదీయకు' - అని డాక్టర్ బెల్ అన్నాడు. తననొక శిలాప్రతిమతో పోల్చుకు, నవ్వుకుందామె. ప్రేమ అనునది ఒక సుందరసుగంధ పుష్పం. ఆ పుష్పాన్ని ముట్టుకోగల అర్హత తనకి లేదు గాని ఆపరిమళం తన జీవితాన్నొక ఆనంద ధామంగా చెయ్యగలదు - అంతే!

# 4. చీకటినుంచి బయటికి

1912 చలికాలంలో మారిస్ మాతర్లింకు భార్య అయిన ప్రఖ్యాత నటి జార్జిట్టి, మాతర్లింకువద్దనుంచి శుభాశీస్సులు పట్టుకొచ్చింది రెంథామ్‌కి. మాతర్లింకుకి హెలెన్ ఒక చిన్న నీలపుపిట్ట. ఎందరో కవులనీ చిత్రకారులనీ ఆకర్షించగల ముఖారవిందం హెలెన్‌ది. ఏదో పురాతన భవనంలో నిద్రిస్తున్న రాజకన్యక జ్ఞాపకం వస్తుందట ఆమెని చూడగానే. జార్జిట్టి ఆమెని 'అమెజాన్ నదీకన్యవమ్మా నువ్వు' అని దీవించింది. మహారచయిత మాతర్లింక్ గ్రంథాలోని కొన్నిభాగాలు గడగడ వొప్పజెప్పేసరికి యీ అంధబాలిక జ్ఞాపకశక్తికి జార్జిట్టే ఆశ్చర్యపోయింది. మాతర్లింకుకి ఒక పుస్తకం బహుమతిగాపంపుతూ అందులో యీవాక్యం రాసింది హెలెన్: 'రాళ్ళూ రత్నాలూ ఒకేవిధంగా వుంటాయి. కాని మానవుడు కొన్నిటినే చూడగలుగుతున్నాడు.'

హెలెన్ పొడవుగా పుష్టిగావుండేది. ఆమె దేహాకృతి శిల్పి చెక్కిన విగ్రహమే! నాసికాపుటం గ్రీకు శిల్పాలని జ్ఞప్తికి తెస్తుంది. జుట్టు వెనక్కిముడివేసుకోడంలో ఒక ప్రత్యేకత కనబరిచేది. ఇక ఆమె చేతుల కదలిక, వాటి చైతన్యం, ఆవేలికొనలు మాట్లాడే సంగతులూ - ఆ అనుభవంచూసినవారికిగాని తెలియదు. జైలు గోడలమధ్య యిరుక్కుపోయిన ఆ మనస్సు గాలిలోకి ఎగిరెగిరి వెనక్కి పడుతున్నట్లుగా వుండేది. తనచుట్టూ నిర్మింపబడ్డ జైలు తలుపు - తనని ఆటంక పరచకుండా వుండేందుకుగాను ఆమె నిరంతరం విశ్వ

ప్రయత్నం చేసేది. ఆమె దేహంలోనూ చేతుల్లోనూ కన బడే కదలికలు అంధకారాన్ని జయించబూనిన మెరుపు తునకలవలె వుండేవి. ఆమె తన భావాలని యితరులకి బొమ్మలూ గుర్తులూ ద్వారా తెలియబరిచేది. ఒకసారి అంటుంది: 'ప్రేమకోసం కాంక్షించని స్త్రీ ఎక్కడేనా వుంటుందా? కాని ఆ అమృతఫలానికి నేను అర్హురాలినికాను. కాంతి వెల్లువకీ గానమాధురికీ యోగ్యత లేనట్టే ఈ అను భవానికీ నాకు అర్హత లేదు. ఆనందమనునది పర్వతశిఖరం - ఆ శిఖరం తరుచు మేఘమాలవల్ల కప్పబడి వుంటుంది. మబ్బుల్లో కప్పడిపోయింది గనక అది అక్కడ లేదం టామా?'

హెలెన్ కెల్లర్ జీవితం అతి భాగ్యవంతమైనది. ఒక సారి రిచర్డ్ కాబట్ అంటాడు: 'ఉపన్యాస వేదికమీద మహా మహు లనేకమందితో ఆమెకూడా వుంది. ఆమెతో వుపన్యసించేవారు, చక్కటి దుస్తులువేసుకు, చాలా నాగ రీకంగా వున్నారు. కాని ఆ ముఖాలొక్కదాంట్లో కూడా యీామె ముఖమండలంనుంచి వెలువడే కాంతివంటిది కాన రాదు. ఈమె ముఖంలోని తేజస్సు వారిని దగ్ధంచేస్తుందా అనిపించింది నాకు. సామాన్యులు తమ జీవితాలని చాలా భాగం వృధాగా గడుపుతారు. అనుభూతుల ప్రయోజనాన్ని వారు పొందరు. ఆ ప్రయోజనాన్ని పొందగల భావనాశక్తిని వారు పెంపొందించుకోరు. హెలెన్ కెల్లర్ కి ప్రతి అనుభూతి ఒక సంపద - సాటిలేని సంపద. ఆమెని ఎందరెందరో శాస్త్రకారులు అను నిత్యం రకరకాల పరీక్షలకని వేధిస్తూం

డేవారు. ఏదో గాలిలో ఎగిరే యంత్రం, సూర్యమండలం లోని మచ్చలూ, పరమాణు స్వరూపమూ - యిటువంటి వాటిని పరిశీలిస్తున్నట్లుగా, నిర్దాక్షిణ్యమైన ప్రశ్నలతో హెలెన్ ప్రాణాలు తీశేవారు. 'సైంటిఫిక్ టార్ మెంటర్సు' అని పేరు పెట్టింది వారికి హెలెన్. వింత ఆకారంలోవున్న అదేదో వస్తువ పట్టుకొచ్చి, అదేమిటో చెప్పమనేవారు. హెలెన్ అదేమిటో తెలుసుకునేందుకు ప్రయత్నించి, తనకి అది ఏవిధంగా తగలుతున్నదీ, అది ఏలోహంతో తయారు చేసిందీ, అది ఏకాలపుది అయివుండేదీ, దాని ఆకృతి, రూపం, వగైరాలు ఏదో పరీక్ష పేపరుకి సమాధానం చెపు తున్నట్లుగా శ్రద్ధగా చెప్పేది. తను యింతశ్రమపడి యివన్నీ చెబితే, యీ విధంగా జరిగిన శాస్త్ర పరిశోధనలవల్ల బధి రాంధులకి ముందుముందు మేలు జరగగలదేమోనని ఆమె ఆశ! చూడలేకపోడం వినలేకపోడం, అనేలోపాలు ఆమెలోని మనశ్శక్తిని యితరవిధాల వుపయోగ పడేందుకు వృద్ధి పరిచాయి.

శాస్త్రికారులకి అన్నిటికంటె ఒక విషయమై మహా కుతూహలంగా వుండేది. 'ఈ అమ్మాయికి ఎటువంటి కలలు వస్తాయి? కలలో కనబడే ప్రపంచం రంగులతోనూ రూపాల తోనూ ఉంటుందా? లేక శబ్ద రహితమైన ఏదో విశాల ప్రకృతివలె దర్శనమిస్తుందా? అసలు యీమె స్వప్న లోకం ఏ విధంగా ఉంటుంది?' అని తెలుసుకునేందుకు ప్రయ త్నించారు. తనకి స్వప్నాలలో మనిషి సాయం అవసరం వుండదనీ, అతిరద్దీగా వున్నవీధులు తనకి తానుగా దాటుకు

పోతానసీ, నిజజీవితంలో సాధ్యం కాని స్వతంత్రత, స్వప్న లోకంలో అనుభవమవుతుందనీ చెప్పింది. తనకి వాస్తవ జీవితంలో అనుభవంకాని సువాసనలూ, సుగంధ పరిమళాలూ, భావాలూ, భావ సౌందర్యాలూ, కలలో కనపడే వట. ఫ్రెంచి మహా విప్లవం, భారత స్వాతంత్ర్య సమరం, రష్యాలోని యూదులు హింసింపబడటం, పట్నాలకిపట్నాలు తన కళ్ళముందు అగ్ని నాలుకలకి ఆహుతి అయిపోవడం - యివన్నీ కనబడేవట. ఒకసారి ఆమె మంటల్లోంచి ఓ శిశువుని రక్షించి, సోల్జర్ల బారినుండి ఆ పాపాయిని కాపాడిందట. ఆమెకి కలల్లో ఒక్కోసారి అపురూపమైన శక్తులు, కనబడేవిట. ఒకసారి కలలో కనబడ్డ 'రాక్షసి' తనని విపరీతమైన చలిలో ముంచెత్తింది. కాళ్లూ, చేతులూ కొంకర్లు పోయే ఆ చలిలో తను స్పృహ పోగొట్టుకుంది. విచారవదనంగల ఆ రాక్షసినిచూస్తే, మరణ దేవత యిలాగే వుంటుందికాబోలు అనిపించిందట.

తన రచనలు చదివి పాఠకులు వేస్తున్న ప్రశ్నలకి సమాధానంగా 'ది ఒరల్డు ఐ లివ్ యిన్' అను గ్రంథం - 1908 లో ప్రచురించింది, ఇతరులు చూస్తేనూ, వింటేనూ గాని తెలుసుకోలేని విషయాలు తను స్పర్శా జ్ఞానంతో ఏ ప్రకారంగా అవగతం చేసుకుంటున్నదీ వివరించి చెప్పింది. ఒకసారి ఒక మత గురువుకి తను 'షేక్ హాండ్' యిచ్చి, ఆ కరస్పర్శద్వారా, అతను సరదా మనిషి అని తేల్చి చెప్పింది. అలాగే కర స్పర్శ అనంతరం ఒక వ్యక్తి స్వభావ వైఖరిని తనకి తానుగా తెలుసుకోడం అలవాటైపోయింది.

ఫిలిప్స్‌బ్రూక్స్‌తో కర స్పర్శ చేస్తున్నపుడు, ఆ చేతుల్లో మార్దవమూ ఆనందమూ కనబడ్డాయిట. మార్క్‌-ట్వేన్ కరస్పర్శలో సానుభూతి, ఆటబొమ్మలు కనబడ్డాయిట. భాగ్యవంతులవి జీవితానుభవంలేని అరిచేతుల్లా ఉండేవిట- కాయకష్టం తెలియనప్పుడే ఆ మెత్తదనం చేతుల్లో కనిపిస్తుందిట.

నిశ్శబ్దతలోనూ అంధకారంలోనూ జీవిస్తున్న హెలెన్‌కి, హస్తాలే యీ ప్రపంచంతో ఆమెకిగల బంధాలు. సౌందర్యమూ, శక్తీ, నీరస గుణమూ, హాస్యరసము, కోప తాపాలూ, ఆనందవిషాదాలు, యివన్నీ ఆమెకీ హస్తాల ద్వారానే అనుభవమయేవి. మానవ హస్తాలగురించి పుస్తకాలకి పుస్తకాలు రాయవచ్చునట. నూలు తియ్యడం నేయడం, విత్తనం చల్లడం పండించడం, రాజ ప్రాసాదాలూ మహా నగరాలూ నిర్మించడం, సమస్తమైన ఉపయోగాలకి యీ చేతులే ముఖ్యం. ఏసుక్రీస్తు ప్రభువు తన చేతుల్ని ఆశీర్వదించేందుకు, అజ్ఞానాన్ని తరిమేసేందుకు, చెడుని నిర్మూలించేందుకు, ఉత్తమమైనవి సృష్టించేందుకు, మానవులలో ప్రేమ భావం పెంపొందించేందుకు ఉపయోగించాడు. పూజా మందిరాలూ, గుళ్లుగోపురాలూ, అద్భుతమైన కళాసంపదలూ, సమస్తం మానవహస్తాలవల్లనేగా నిర్మితమయింది. రైలు యింజను నడిపే డ్రైవరు చేతిలో కొన్నివందలమంది ప్రాణాలు వుండటం మనకి నిత్యజీవితానుభవం. మానవుడు సాధించినవాటి గురించీ మానవ పురోగమన చరిత్ర గురించీ చెప్పదలచుకుంటే, ముందు చేతులగురించి చెప్పాలి.

హెలెన్ కెల్లర్ విషయంలో ఆమె హస్తం, స్పర్శాజ్ఞానాన్నే కాక - చూడగల శక్తిని కూడా (Seeing Hand) పెంపొందించుకుంది. పువ్వులు ముట్టుకు 'ఎంత అందమైన తెల్లటి లిల్లీ పుష్పాలో!' అనేది. ఆ తెల్లదనం ఆమెకి ఎలా తెలిసిందని అడుగుతారేమో! రంగు వాటికంటె తెల్లటివి కొంచెం పల్చగా వుంటాయట. నేత్రాలతో చూడ్డానికి అలవాటుపడ్డ మనం ఆ సంగతి గ్రహించలేం - స్పర్శాజ్ఞానంవల్ల ఆమె చటుక్కున తెలుసుకునేది. ఎర్రగులాబీ లేవో, మరొక రంగులోని పుష్పాలేవో, ఆ రంగులలోగల తేడాలు కూడా యిటువంటి స్పర్శాజ్ఞాన సమర్థతతోనే తెలుసుకునేది. తనలోని అణువణువూ ఒక వైబ్రోస్కోప్ (Vibroscope) వంటిదనేది. అనగా శబ్దకంపనములద్వారా తెలుసుకోగలిగినది. ఆమె అరిచేతులూ అరికాళ్లూ, కాలివేళ్లూ చేతివేళ్లూ శబ్దతరంగాలని చాలా చక్కగా గ్రహించగలుగుతూండేవి. ఆర్కెస్ట్రా వాయిస్తున్నపుడు ఆయా వాయిద్యాల శబ్దతరంగాలని కాలివేళ్లతో గ్రహించగలిగేదిట. ఆ పాటకి అనుగుణంగా డాన్సు చెయ్యడం కూడా నేర్చుకుంది. చర్చిలోని చర్చి వాయిద్యాల సంగీతం నడి సముద్రాన వున్న వోడని సముద్ర కెరటాలు స్పృశించినట్లు వుండేదట. జాజ్ సంగీతమంటే ఆమెకి మహా చికాకు. అది వాయిస్తున్నపుడు, తనమీదకి ఏదో దుష్టమైనది దూకుతున్నట్లూ అక్కడి నించి పారిపోడం శ్రేయస్కరమన్నట్లూ, భావన కలిగేది. ఏవో భయంకరమైన నీడలూ, అడవి జంతువులూ ఏడవలేని మూక ఆత్మల వేదనా, ఆ జాజ్‌లో ఆమెకి కనపడేవి.

జంతుప్రదర్శనశాలకి వెళ్ళినపుడు జంతువుల అరుపుని బట్టి, అదే జంతువో తెలుసుకోడం ఆమెకి బాల్యం నుంచీ అలవడ్డ విద్య. ఏవి పెద్దపులులో, ఏవి చిరుతపులులో, ఏవి నక్కలో, ఏవి తోడేళ్ళో, అరుపునిబట్టి ఆమె గ్రహించ గలిగేది. నీటి జలజలే కాకుండా, నీటిలో మునిగివచ్చిన పక్షి రెక్కలు ఆర్చుకోడం, కూడా చెప్పేది. ఆకుల గల గలా, తుమ్మెద పాట, గుర్రాల సకిలింపూ, కుక్కల అరుపూ, ఇవి తెలుసుకోడమే కాకుండా, యింట్లోకి వచ్చే మనుషుల పాదాల సవ్వడినిపట్టి ఆ వస్తున్నవ్యక్తు లెవరో చెప్పగలిగేది. ఒకసారి ఒక హోటల్ డైనింగ్ రూమ్‌లో కూచుని లోపలికి వస్తున్నవ్యక్తుల పాదధ్వనినిబట్టి వారివారి మనఃస్థితి - నిశ్చయతా, దృఢత్వం, బడలికా, ఆగ్రహం, విచారం, వుత్సాహం, నిర్లక్ష్యతా, తొందరపాటు మొదలైనవి వరసగా పేర్కొన్నదట.

స్పర్శజ్ఞానంతోపాటు, ఘ్రాణేంద్రియజ్ఞానం కూడా యీామె విపరీతంగా పెంపొందించుకోగలిగింది. పచ్చటి పూలమొక్క లున్నచోటికి వెళ్ళగానే ఆ మొక్కల పేర్లు, వాటి పరిమళం ద్వారా కొంతవరకూ, పరిమళంతో నిశ్చయించలేనపుడు స్పర్శతో కొంతవరకూ, అవేమిటో తనకి తాను తెలుసుకు, అవతలవారు ఆశ్చర్యపడేటట్లు చటుక్కున చెప్పేది. ఒకసారి ఒకయింటి యజమానికి తమ దొడ్లోవున్న పూలమొక్క పేరు హెలెన్ కెల్లర్ - 'పారెట్ ప్లాంటు' అని చెప్పేదాకా తెలియనేలేదు. మొక్కలనుంచి వెలువడే వాసన, కర్రనుంచీ, చెట్టు మొదళ్ళనుంచీ, బెరడు

నుంచీ వెలువడే వాసన, వేళ్లూ పసరికా మొదలైనవాటికి గలవాసన, యీ వాసనలు వేటికవి విడమరచి తెలుసుకో గలదు ఆమె. రచయిత బాల్ జాక్ 'పారిస్ నగరం నా కొక వాసనలపుట్ట' అన్నమాటలు ఆమెకి చాలా నచ్చాయి. పారిస్ సందర్శించినపుడు హెలెన్ కి కూడా ఆ మహానగరం వాసనలతో పరిచయం అయింది. సెంట్లు, పౌడర్లూ, ద్రాక్ష రసం, పొగాకు - యిలాంటి వాసనలతో పారిస్ నిండివుందిట. ఇవిగాక వీధుల్లో మోటారుకార్ల పొగ, పళ్ళ అంగళ్ళూ, గుర్రపు బగ్గీలూ, వీటితో కూడిన వాసనలట. భాగ్యవంతుల మందిరాల్లో కనబడే వాసనలకీ, నగరపు వీధులకీగల తేడా ఆమె తెలుసుకుందట. సబ్బుల పరిమళంలో, సిల్కుల మెత్త దనంలో, అప్పుడే వేసిన పెయింట్ లో ఒక నూతనత్వం వుంటుందనీ ఆ సువాసనలు మననితోడివారికి సన్నిహితు లుగా చేస్తాయనీ అనేది హెలెన్ కెల్లర్.

ఏదేనా రైలు ప్రయాణం చేస్తున్నపుడు చమురు నూతులు (Oil Wells) ఉన్నవైపుగా రైలు వెళ్తూఉంటే - అదింకా చాలా దూరాన వుండగానే వాసననుబట్టి, ఆము ఫలాన ప్రదేశంలోకి వస్తున్నామని చెప్పేది. అదే విధంగా బ్రుయరీసు (సారాబట్టిల) విషయంలో కూడా తెలుసుకునేది. చర్చి ప్రాంగణంలోకి రాగానే అది కేథలిక్ చర్చి అయి నదీ, ప్రొటెస్టెంట్ చర్చి అయినదీ చిరునవ్వుతో చెప్పేది. ప్రపంచంలో యెన్ని వాసనలు వున్నాయని యెవరో అడగ్గా తత్వోపదేశాలు ఎన్ని ఉన్నాయో అన్ని ఉన్నాయంది. న్యూయార్క్ లోని ఫిఫ్త్ ఎవెన్యూ పరిమళభరితమైన వీధట.

ఖరీదైన సెంట్లూ, పౌడర్లూ, క్రీములూ, ప్రత్యేకమైన పుష్ప జాతులూ, సుకుమారంగా వండుకునే వంటపదార్థాలూ, ఈ వీధి ప్రత్యేకతలు. ఇంట్లో ప్రవేశించగానే ఆ యింట్లో వారు ఏ పౌడరు వాడేదీ - వాళ్ళింట్లో కొవ్వొత్తులు ఉన్నదీ లేనిదీ నిమిషంలో చెప్పగలిగేదట. పట్టణంలోని పార్కులోకి ప్రవేశించగానే ఆమెకి తాము పార్కులోకి వచ్చామన్న సంగతి పసరిక పరిమళం వల్లనో, లేకపోతే ఎండిపోయిన ఆకుల వల్లనో తెలిసేదట.

మూడు రోజులపాటు మీకు నేత్ర దృష్టి వుంటే మీ రేమేమి చూస్తారు? - అన్న ప్రశ్నకి ఆమె యీవిధంగా సమాధానం చెప్పింది. అటువంటి కొంటె ప్రశ్న ఆమెని ఎవరూ అడగలేదనుకోండి. 'మీ నేత్ర దృష్టి మూడంటే మూడే రోజులు వుందనుకోండి. అప్పుడు మీ రే మే మి చూస్తారు?' అన్న కాలేజి డిబేట్ కి తను సమాధానం చెపుతానంది హెలెన్ కెల్లర్. మొదటి రోజు ఆమె తన స్నేహితుల ముఖాలు చూస్తుంది. వాళ్ళు కప్పుకునే శాలువలూ వాళ్ళింట్లోని బొమ్మలూ, పుస్తకాలూ చూస్తుంది. ఆ తరువాత ఒక పాపముఖం పరిశీలించి, ఆ పాప తనజీవన పోరాటానికై ఏ విధంగా పరిణతి పొందుతున్నదీ, ఆ పరిణామం పొందడంలో ఆమెకి లభ్యమవుతున్న శక్తి స్వరూపం ఎటువంటిదైనదీ తెలుసుకునేందుకు ప్రయత్నిస్తుంది. సాయింత్రం వేళ ఊరు బయటికి షికారు వెళ్ళి, ప్రకృతి సౌందర్యమూ, వృక్షాల ఠీవి తనివితీరా చూసి, రాత్రివేళ కృత్రిమ వెలుగులో మనుషులు నివశించే లోకం కాంతివంతమవడం కళ్ళారా

చూ స్తుంది. మరునాడు ఉదయం వేళ సూర్యోదయం వీక్షించి, నాచురల్ హిస్టరీ మ్యూజియమూ, ఆర్టు మ్యూజియమూ చూ స్తుంది. ఆర్టు మ్యూజియంలోని ఇటాలియన్ చిత్రకారుల కళా సంపదలకి, నేటి చిత్రకళల నవీనత్వానికీగల తారతమ్యాలు తనకి అర్థమైనంతలో గ్రహించి, సాయంత్రం వేళ సినిమా హాలుకో నాటక మందిరానికో వెళ్తుంది. నాటక మందిరంలో తను చూడదల్చుకుంది పావల్‌వానిగాని, (Pavlova) హామ్‌లెట్‌గాని, ఫాల్‌స్టాఫ్‌ని గాని! వారినితప్ప తను చూడదగ్గదేమో లేదు. మూడవ రోజున తమ ఆకాశ హార్మ్యమయిన ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ యెక్కి న్యూయార్కు పట్టణం ఎలా వుంటుందో చూసి, ఆపైన న్యూయార్క్ నగరవీథులు తన యిష్టం వచ్చినట్లు తిరుగుతుంది.

'మీ కళ్లని ఉపయోగించుకోడం' అను వ్యాసం ప్రతి కాలేజీ విద్యార్థి పాఠ్య భాగంగా నేర్చుకోవాలని హెలెన్ కెల్లర్ అంది. రెండు కళ్ళూ వున్నవారికంటె అంధురాలైన హెలెన్ కెల్లర్ ఎక్కువ చూడగలుగుతోందని మార్క్ ట్వేన్ ఏనాడో చెప్పాడు. ఆమె తన మనోమందిరంలో ఒక మహా ప్రపంచం నిర్మించుకుంది. ఆ ప్రపంచపు పొలిమేరలు సామాన్య మానవులని విస్మయానందంలో ముంచెత్తాయి.

# 5. రాజబాట

19 శతాబ్దపు యువతీ యువకులందరిమీదా కార్లెయిల్ రచనాప్రభావం పడ్డట్టే, యీమెపట్లగూడా ఆ ప్రభావం పనిచేసింది. ప్రతి జీవీ తనకి కావలసినవి తను సంపాయించుకో గలగాలి; సోమరితనంతో కాలం వృధాచెయ్యక, చేతినిండా పని కల్పించుకోవాలి. ఈ కార్లెయిల్ సిద్ధాంతం తూచా ఆచరణలో పెట్టాలనుకుంది హెలెన్ కెల్లర్. కుటుంబపు ఆస్తిపాస్తులు కరిగిపోయాయి. తనకి ఆర్థికసాయం చేసిన ధనవంతులు, ఒక్కొక్కప్పుడు అవసరసమయాల్లో కాళ్లు బారజాపేవారు. యానీసల్లీవాన్ 'జాన్ మాసీని' వివాహం మాడ్డంతో కుటుంబభారం జాన్ మీద పడింది. జాన్ వొక్కడూ ముగ్గురికోసం సంపాదించడం, తామిద్దరూ కూచుని తినడం హెలెన్ కి బాధ అనిపించి, ఆ పరిస్థితులు మార్చేందుకు ప్రయత్నం మొదలుపెట్టింది. ఇది యిలా వుండగా యానీకి చిన్నతనంలో వచ్చిన కంటివ్యాధి తిరిగి రాగల సూచనలు కనబడ్డాయి. హెలెన్ కి ఒక ప్రఖ్యాత పత్రిక అయిదువేలడాలర్లు బహుమతి యివ్వగా, ఆ పైకం యావత్తూ అంధులపాఠశాలకి విరాళంగా సమర్పించింది. ప్రజావసరాలకి తను చేయగలిగినంత చేయలేకపోతున్నాననే తపన ఆమెని వేధించసాగింది.

తనమాట ఎట్లావున్నా తన టీచరు భవిష్యత్ ని గురించిన ఆలోచనలు హెలెన్ ని భయపెట్టేవి. తనని అంధకారంనుంచి బయటికి తీసుకొచ్చింది. ఒకవేళ తనేగాని ఏ

కారణం వల్ల నేనా మరణిస్తే, టీచరుని ఎవరు కాపాడుతారు? రచనావ్యాసంగాలతో తను తామిద్దరినీ పోషించగలంత ధనం సంపాయించగలదా? రచన తప్ప తను చేయగల దేముంది? ఫ్రెంచి జర్మన్ భాషలతో పాటు యిటాలియన్ భాషకూడా నేర్చుకుంది. తనురాయగల విషయాలుకూడా కొద్దిమాత్రమే వున్నాయి – తనగురించీ అంధులగురించీ! ప్రజాసమస్యలూ, ఎగుమతి సుంకాలు, విద్యావిధానం, యిటువంటి పెద్దపెద్ద విషయాలపై అభిప్రాయాలు తెలియజెయ్యమనేవాడు డాక్టర్ బెల్. కాని హెలెన్‌కి బెరుగ్గావుండేది. తనకి తెలిసినవే రాయసంకల్పించుకుంది. యానీకి యింగ్లీషులో మంచి ప్రవేశముంది; హెలెన్ రాసిన ప్రతివిషయాన్నీ ప్రజాభివృద్ధికి అనుగుణంగా సరిదిద్ది ప్రచురణకి పంపేది యానీ.

వ్రాయడమేగాక తను చేయగల కార్యం మరొకటి వుంది. తను మాట్లాడటం అలవరచుకుంటే, మాటలు జాగ్రత్తగా పలకడం నేర్చుకుంటే ప్రజలు తను చెప్పేది కొంత వరకూ వినవచ్చు. మూగవడిపోయిన కంఠనాళాలు ఒక దారినపడి, శబ్దాలు పుట్టించేందుకుగాను, ఆమె ఒక సంగీతం టీచరుని పెట్టుకుని, వివిధ శబ్దాలు పల్కడం నేర్చుకుంది. నెమ్మదిగా ఆ శబ్దాలకి ఒక క్రమతని అలవరచుకుంది. 1913 లో న్యూ జెర్సీ రాష్ట్రంలోని 'మాంట్‌క్లైర్' అను చోట ఉపన్యాస వేదికమీద మొదటిసారి నిలబడ్డపుడు – చేతులూ కాళ్లూ చల్లబడి, వొణుకుపుట్టి నోటివెంట మాట రాలేదట. తన దేహాన్ని దేనికో తాపడంచేసినట్ల నిపించిందట. మాటాడిన నాలుగుమాటలూ స్పష్టంగా లేకపోయినా

కొన్నికొన్ని వుపమానాలు మాత్రం చక్కగా వినడ్డాయని సభికులలో ఒకాయన అన్నాడు. సంవత్సరాలు గడవడంతో నిరంతర దైనందినకృషితో, యిరవై అయిదు సంవత్సరాల ప్రయత్నంతో, తన నోటినుంచి వెలువడే మాటలు సభికులకి అర్థమయేటట్లు చేయగలిగింది హెలెన్ కెల్లర్. మొదట్లో హెలెన్ ఎంతో నిస్పృహ పడింది. కొండవాగు జలజల పారినట్లూ, పియానో సంగీతమూ వయొలిన్ పలుకులూవలె తన కంఠంనుంచి మాటలు వెలువడాలని ఆమె తపన పడుతున్నట్లుగా యానీ సల్లివాన్ అప్పట్లో రాసింది. ఆమె తన లక్ష్యాన్ని చేరుకునేందుకు చాలా కాలం పడుతుంది. వేల కొద్దీ వుత్తరాలు వ్రాతబల్లమీద పేరుకుబోతున్నపుడు, ఏనాడో పొందగల విజయంగురించి ప్రస్తుతకాలాన్నంతా వృథాచెయ్యడం భావ్యంకాదని, మాట్లాడ గలగడమనే ప్రయత్నానికి అనుసిత్యం, కొద్దిసమయంమాత్రమే వినియోగిస్తూండేది. ఇంత కష్టబడీ తాను అందరూ మాట్లాడినట్లు మాట్లాడ లేకపోడం - ఆమె మనసుకి ఒక నూతనశక్తి నిచ్చింది. మానవులు ఎటువంటి అపజయాలూ నిరాశలూ పొందుతారో తను అనుభవపూర్వకంగా గ్రహించుకో గలిగింది.

హెలెన్ కెల్లర్ కి తనకలలు ఏనాటికీ నిజంకావేమో ననిపించేది. ఏమైనా ఆమె అపజయాన్ని అంగీకరించ దలచుకోలేదు. తనకంఠంలోంచి మాటలు స్పష్టంగా వెలువడక పోయినా, వుపన్యాస వేదిక ఎక్కి, తను చెప్పదలచుకున్న

నాలుగు ముక్కలూ చెప్పి, సభికుల సంశయాలకి సమాధానాలు యిస్తూండేది.

'నిద్రబోతున్నపుడు మీరు కళ్లు మూసుకుంటారా?'

'కళ్ళు తెరిచి చూడటం అన్నది నాకు తెలియదు' అని హెలెన్ జవాబు.

'ఈ ప్రపంచంలో అతి కష్టమైన దేమిటి?'

'ప్రభుత్వంచేత ఒక పని చేయించడం'

'రంగులు మీకు ఏవిధంగా తెలుస్తాయి?' అని అడిగినప్రశ్నకి;

'మానవులకి ఆశ, సంతోషం, శూన్యతా మొదలైన మాటలు ఏ ప్రకారం అర్థమవుతున్నాయో - అదేవిధంగా. రంగులు తనకి కనపడనిమాట నిజమే. ఆశ అనేది మానవుని మనసుకి కనబడుతోంది గాని - కళ్లకి కాదుగా! నలుపు రంగు విషాదాన్నీ, కష్టాలనీ, పాప కర్మలనీ సూచిస్తుంది,' అన్నది హెలెన్ కెల్లర్.

'నేటి మానవుడు కోరేదేమిటి?'

'నృత్యంలో, ప్రయాణంలో తీవ్రమైన కదలికా వేగమూ కావాలి. జీవితాన్ని అమితంగా ప్రేమించే గుణము కనుపడుతోంది. వెనకటివలెకాక నేటి మానవుడు 'సింపుల్ తింగ్స్'ని ప్రేమిస్తాడు. నూతన నగరాల్లోని సిటీ ప్లానింగ్ నేటి మానవుని క్రమ జీవన దృక్పథానికి ఉదాహరణం.'

'మీకు అందమైన బట్టలంటే యిష్టమా?'

'నాకు చిన్నప్పటినుంచీ అందమైన బట్టలంటే యిష్టమే. పదో ఏటనుంచీ మా టీచర్, నేను చక్కటి డ్రెస్సులలో కనబడేటట్లు చేసింది. పరిశుభ్రంగాను, ఆకర్షణీయంగాను ప్రతివాళ్ళూ ఉండాలి.'

1920–24 ల మధ్య నాలుగు సంవత్సరాలపాటు హెలెన్, యానీ, వాడివిల్లి (Vaudeville) ప్రదర్శనల్లో తిరిగారు. హెలెన్ స్నేహితులనేకులు 'ఇంత చదువుకున్న యీ అమ్మాయి పిల్లి మొగ్గలు వేసేవారితో కుక్కలూ, కోతులూతో తనుకూడా ప్రదర్శింపబడేందుకు అంగీకరించిందా? ఇది చాలా విచారకరం' అన్నారు. యానీకి యీపని యిష్టం లేదు. తనకి తాను ఏరి కోరుకు యిందులో ప్రవేశించాననీ తనటీచర్ కోసం ధనం సేకరించేందుకు మరొక మార్గమేమీ కనబడక యీ పనికి పూనుకోవలసివచ్చిందనీ అన్నది హెలెన్. 'నా పదిహేడో ఏటనుంచి జీవితాన్ని నాకు వీలైన మార్గంలో సరిదిద్దుకుంటున్నాను. ఎప్పటికప్పుడు నా జీవితాన్ని తమ అభిప్రాయాలకి అనుగుణంగా తిప్పాలనే వ్యక్తులు తటస్థపడుతూనే వున్నారు. వారికి కొత్త మార్గమంటేనే భయం, తెలిసిన దారమ్మట వెళ్ళు; కొత్తదారి తొక్కకు – అని ఎవరూ అడక్కపోయినా పనిగట్టుకువచ్చి ఉచిత సలహా చెబుతారు. నాకు కనబడుతున్న దారి వెంటనే నేను ప్రయాణం చేస్తున్నాను. గమ్యాన్ని అది చేర్చగలదనే నమ్మిక నాకు వుంది'

అని జవాబు చెప్పింది తన విమర్శకులకి హెలెన్ కెల్లర్. కాలేజీకి వెళ్ళి చదువుకుంటానన్నపుడు కూడా మిత్రులు యిదేవిధంగా నిరుత్సాహ పరిచారు. ఎంతకష్టపడి అయినా సరే మాట్లాడటం తను నేర్చుకుంటానని అన్నపుడు, టీచర్ యానీయే నిరుత్సాహ పరిచింది. ఒకసారి కోటీశ్వరుడైన యాండ్రూ కార్ని, హెలెన్‌కి జీవితాంతం సరిపడ్డంత వుచిత వేతనం (Pension) యిస్తాననేసరికి, 'నేను సోషలిస్టుని. అటువంటి దయా ధర్మం నేను అంగీకరించను' అని జవాబిచ్చింది. అందుకాయన, 'యిలాటి అర్థం పర్థం లేని మాటలు చెప్తున్నందుకు నిన్ను రెండు యిచ్చుకోవాలని వుంది' అని మృదువుగానూ, ప్రేమతోనూ చివాట్లు వేస్తూ రాయగా, 'మీవంటిపెద్దవారు జీవన క్రమతని కనపరచాలి. మానవులందరూ సోదరులనీ, దేశాలన్నీ శాంతిమయ వాతావరణంలో జీవించాలనీ, విద్య అనేది యావత్ ప్రజకూ లభ్యమవాలనీ మీరూ నమ్ముతారు, నేను నమ్ముతాను. ఈ నమ్మకాలే సోషలిజమ్‌కు పునాది,' అని ఆయనకి జవాబిస్తూ ఆర్థిక సమస్యని పరిష్కరించే ఆ పెన్షన్ నిరాకరించింది. కొద్దిమాటలతో మనసులో వున్నది పైకి అనేయడం, తన శక్తిమీద తాను ఆధారపడటం, ఆమె ఆనాటి కానాడు ఎక్కువగా అలవరచుకోడం మొదలు పెట్టింది. ప్రయాణాలకని బయలుదేరుతున్నపుడు తనసామాను తాను సర్దుకునేది. అవిటి మనిషి అయిన తను, ఎంత తక్కువగా ఆధారపడితే అంత ఆనందం పొందుతూండేది. 'వాడివల్లి' ప్రదర్శనలో జంతువులతోపాటు స్టేజిమీద కనిపించడ మేమిటి, – అన్న

విమర్శకులకి ఆమె, - మేడమ్‌షూమాన్, కారల్ సాండ్ బర్గ్, ఎర్నెస్టు థామ్సన్, తనకంటె గొప్పవారు - వారు చేసినపని తను చెయ్యడంలో తప్పులేదంది.

హెలెన్ కెల్లర్ అమెరికాలోని నలభై ఎనిమిది రాష్ట్రాలలోనూ ఉపన్యాసాలు యిచ్చి, కెనడా దేశం సందర్శించి వచ్చింది. తను ఎక్కడికెళ్ళినా ఫొటోగ్రాఫర్లూ రిపోర్టర్లూ వెంబడించేవారట. ఉమర్ ఖయ్యాం రుబాయిత్ లోకి మల్లే తమ జీవనచక్రమే ఒక నాటక ప్రదర్శనవలె వుండేదిట. పల్లెప్రాంతాలలో, పట్టణాలలో, నదీతీరాల్లో, కార్మికనగరాల్లో, చర్చి సమావేశాల్లో, సమ్మెదార్ల మీటింగుల్లో, వివిధవృత్తులకి సంబంధించిన వేరువేరువ్యక్తులకి సన్నిహితంగా వచ్చి కనపడేది హెలెన్. ఒకసారి కాలిఫోర్నియాలో ప్రయాణం చేస్తున్నపుడు - అక్కడి ఫల జాతుల పరిమళాలకి ఎంతో ఆనందించింది. యాపిల్ చెట్లు తమ సుగంధంతో ఆమెని సంతోషపరిచాయి. వరదలొచ్చాక టెక్సాస్ మీదుగా వెళ్తున్నపుడు ఆ ప్రయాణంలో ఆమెకి పరిచయమయిన అనుభవాలు మరుపురానివి. రైలు కుదుపు ఉయ్యాల వూపులా ఉందట. ఏ చెట్టు మానో, చనిపోయినజంతువో రైలుబద్దీలకి అడ్డంగా పడి వుండటంతో, రైలులంఖణాల బోటులా ప్రయాణం చేసేదట.

'వాడివల్లి' లో వున్న నాలుగు సంవత్సరాల్లోనే హెలెన్, సోఫీటక్కర్‌ని కలుసుకుంటుంది. ఈ సోఫీటక్కర్ హెలెన్ కెల్లర్‌కి, యానీసల్లివాన్‌కి - దుస్తులధారణ, మేకప్

సొగసులూ, మామూలు మనుషులు దీపకాంతిలో విద్యుల్లతి కలవలె ఎలా కనబడేదీ ఇటువంటివన్నీ చూపుతుంది. సోఫీ టక్కర్ ఆసంగతులు చెపుతూండేసరికి హెలెన్ కెల్లర్‌కి తన చిన్ననాటి స్మృతులైన ఎల్లెన్ టెర్రి, సర్ హెన్రీయిర్విన్, జఫర్సన్, ప్రభృతులు జ్ఞాపకమొచ్చారు. సోఫీ ఒకసారి హెలెన్‌ని న్యూయార్క్ - నైట్ క్లబ్‌కి ఆహ్వానించింది. హెలెన్ వెళ్ళింది. ఫలానా హెలెన్ కెల్లర్ ఫలానా టేబుల్ దగ్గిర వుందని - ఆమెవైపు స్పాట్ లైట్ ప్రసరించారు. సోఫీ నిలబడి, 'నా పాటలు అల్లరి చిల్లరిగా వుంటాయా?' అని అడిగింది. హెలెన్ నిలబడి 'ప్రజాసముదాయాన్ని అంత ఆనందపరిచేవి అల్లరి చిల్లరివి ఎలా అవుతాయి?' అంది. 'వాడివల్లి'లో వుంటున్నప్పుడే హెలెన్ కెల్లర్ 'లా అర్జెంటినా' అను నర్తకితో పరిచయం చేసుకుంది. 'మొగ్గలు పువ్వులయేటట్లు, పువ్వులు పరిమళం వెదజల్లేటట్లు చేయగల నర్తనసంపద ఆమె సొమ్ము,' అంది హెలెన్ ఆమెగురించి. లాఅర్జెంటినా హెలెన్‌ని తన డ్రస్సింగ్ రూమ్‌లోకి తీసుకెళ్ళి బీదపిల్ల వేషంవేసినపుడు ఎటువంటి గౌనుధరించేదీ-రాజకుమార్తెగా ఎటువంటిగౌను ధరించేదీ ఆమెకి చూపింది. హెలెన్ స్టేజిమీదవుండగా, అనగా స్టేజి ప్రదర్శనలు యిస్తుండగా కారల్ సాండ్‌బర్గ్ వద్దనుంచి యిలా లేఖవచ్చింది: 'డియర్ హెలెన్, నిన్నరాత్రి నిన్ను స్టేజిమీదచూసి, ఎంత ఆనందపడ్డానో చెప్పలేను. ఇటునుంచి అటుకదుల్తున్నపుడు, అద్భుత నర్తకి కదలినట్లూ ఉత్తమజాతి పందెపుగుర్రం అడుగువేసినట్లూ తోచింది. నీ నోటిముత్యాలు విన్నవారికి జీవితంపట్ల

నూతనోత్సాహం కలుగుతుంది. ఆ పలుకులు వీణాతంత్రుల వలె హృదయంమీద పనిచేస్తాయి.'

'నిజాయితీ గల ఆలోచనాపరుడీ యువకుడు. ఇతని కళలో నిత్యనూతనత్వం వుంది,' అని వ్రాసింది హెలెన్ కెల్లర్ చార్లీ చాప్లిన్ గురించి. అప్పుడతను హాలీవుడ్‌లో "షోల్డర్ ఆమ్స్" (Shoulder Arms) అను చిత్రంలో నటిస్తున్నాడు. ఈ నిద్రిస్తున్న సౌందర్యరాసిని ఒక తారకామణిగా చేదామని హాలీవుడ్ వారూ, చార్లీ చాప్లిన్ అనుకున్నారు. 1918 లో యీమె జీవితాన్ని చిత్రీకరించాలనే ప్రయత్నం ప్రారంభమయింది. కొన్ని వారాలపాటు, హెలెన్, యానీ హాలీవుడ్‌లో వున్నారు. ప్రతివుదయం టీచరూ విద్యార్థినీ బివర్లీ హిల్సుకి గుర్రంమీద వెళ్తూ, సూర్యోదయాన్ని చూస్తూండేవారు. ఒక రోజున హెలెన్‌ని పడేసి పారిపోయిందిట ఆగుర్రం. సరే - ఆ సంగతి అలా వుంచుదాం. ఈమె జీవితాన్ని గురించి, తీదామనుకున్న చిత్రంపేరు 'డెలివరెన్సు'. జీవితంలోని ఘట్టాలు కొన్నికొన్నిటికి, నాటకీయత (డ్రమటైజ్ - Dramatize) కల్పించా లనుకున్నారు. అందుకుగాను నిర్మాతలు రకరకాల సాహసకృత్యాలు వూహించసాగారు. మొట్టమొదట ఆమె బాల్యమిత్రులైన డాక్టర్ హోమ్స్, ఫిలిప్స్‌బ్రూక్సు, జోసఫ్ జఫర్సన్, అలగ్జాండరు గ్రాహమ్‌బెల్ - యీ నలుగురితో కూడిన సమావేశం. తదుపరిని యీమె ఫ్రాన్సు వెళ్తుంది. అక్కడ నాలుగు అంతర్జాతీయ శక్తుల - అనగా అగ్రరాజ్యాల - సమావేశం జరుగుతూంటుంది. ఈమె వెళ్ళి యుద్ధం త్వరగా

ముగించడం విషయమై, యిక యుద్ధాలు జరక్కుండా వుండే విషయమై వారికి పథకాలు చెపుతుంది. ఈమె ప్రపంచ కార్మికుల ప్రతినిధి. వారి పాలిట జోన్ ఆఫ్ ఆర్క్. గాయ బడ్డవారినీ, అంధులనీ, విచారంతో కృంగిపోయేవారినీ, విషాద సాగరంలో మునిగినవారినీ లేవనెత్తే మాతృమూర్తి యీామె, ఈమెని ఫ్రాన్సుదేశం ఓ విమానంలో పంపుదా మనుకున్నారు. అటువంటి విమానంలో పంపడంకంటె, 'యులిసీస్' సాహసకృత్యాలకి తగినవిధంగా యీామె కథ నల్లితే బాగుండుననుకున్నారు యింకొకరు. 'యులిసస్‌ని ఈమె ప్రియునిగా చెయ్యడం విషయమై మీా అభి ప్రాయమేమిటి?' అని నిర్మాతలలో ఒకతను అడిగాడు. ఏమైనా ప్రణయభాగం కొంత వుండితీరాలి. ఆ తరువాత, చిత్రనిర్మాణానికి విధిగా కావలసిన యుద్ధం సంగతి ఏమిటి అన్నారు. కొండ గుహల్లో దాక్కున్న వికృతాకారపు రాక్షసి అజ్ఞానికీ (Ignorance), పారిపోయిన కులీనకాంతవలె వున్న విద్యకీ (Knowledge) పోరాటం పెట్టి, ఆ పోరాటంలో కాపాడబడ్డపాప యీా హెలెన్-అని అందామనుకున్నారు. ఈ ప్రకారంఆలోచిస్తే, హెలెన్ కథని ఎన్నిరకాలుగానైనా తిప్ప వచ్చు. ఆ చిత్రంలో హెలెన్ కెల్లర్ గాక నిర్మాత లనుకున్న మనిషి వుంటుంది. చివరికి హెలెన్‌కి విసుగుపుట్టి, చిత్రం వొద్దు, ఏమిావద్దు - పొమ్మంది.

ఎనిమిదో ఏటనుంచి ఆమెకి లోకంపట్ల ఆశ చిగురింప చేస్తున్నది వాల్ట్ విట్‌మాన్ కవిత్వం. ఆయన పద్యభాగాలు ఆమెకి అమృతప్రాయాలుగా వుండేవి. ఇతరుల మేధస్సు

లోని మనసు, హృదయంలోని ప్రేమ గ్రహించగలుగుతే యీ లోక మొక నందనవనమవుతుంది. చూస్తున్నకొద్దీ సువిశాలమైన హృదయాలూ, అతి ప్రతిభావంతములైన మేథస్సులూ అవుపడుతాయి, పెద్దవాళ్ళందరూ హెలెన్ విషయంలో ప్రేమతుంపర్లు జల్లేవారు. ప్రఖ్యాత సంగీత కారులు ఆమెని సంతోషపెట్టాలని పాడినపాటల మాధుర్యము అద్వితీయం. ఒక గానకోవిదుడు పాడుతుంటే, తన అరిచేతిలోకి నదీజలం ప్రవహిస్తున్నట్లుగా వుందిట ఆమెకి. ఛాలియాపిన్ (Chaliapin) అను రష్యన్ సంగీత శాస్త్రకారుడు, వోల్గాపడవ పాట (Volga Boat Song) ఆమెకోసమని పాడినపుడు ఆమెలోని నరనరాలూ కంపించాయిట. మామూలుగా పారేరక్తమే ఏదోనృత్యం చేస్తున్నట్లు అయిందట. ఇక పియానోమీద ఆమెకి పాడి వినిపించినవారూ, తమ కంఠమాధురినీ, నర్తన ప్రతిభనీ ఆమెకి చూపినవారూ కొల్లలు. మార్క్సు బ్రదర్సులోని హార్పో మార్క్సు, తన తమాషాలు చూపేందుకు ఆమెకోసం ప్రత్యేకం ఎదురు చూసేవాడుట.

నటీ నటులు సంగీతకారులుతోపాటు వివిధ వ్యాసంగాలలోని వ్యక్తులు ఆమెకి సన్నిహితులు కాజొచ్చారు. బాల్యంలోనే విట్టియర్‌నీ, హోమ్సునీ తెలుసుకుని వుండటంచేత, తరువాత శకంకవులయిన కారల్ సాండ్‌బర్గ్, రాబర్ట్ ఫ్రాస్ట్, జాన్ ఫ్లెచ్చర్, విట్టర్ బిన్నర్, లాంగ్‌స్టన్, కాలెన్ మొదలైనవారు ఆమెమీద కావ్యాలురాశారు. మొత్తం డెభై మంది కవులురాసిన గేయ కావ్యసంపుటి 'హెలెన్

కెల్లర్ యాంథాలజీ' అను పేరిట ప్రచురితమయింది. రవీం ద్రనాథ టాగూర్ ఆమెను చూడటానికి వచ్చినప్పుడు, కవితా సామగ్రిగురించీ యిండియా, చైనాదేశాల గురించీ మాట్లా డిందట, టాగూర్ గడ్డాన్ని చూడగానే ఆమెకి బైబిల్‌లోని మహానుభావులు జ్ఞాపకానికి వచ్చారట.

జీవనసంబంధమైన విషయాల్లోనేకాక, పరిశోధనల పట్ల కూడా హెలెన్ ప్రత్యేకశ్రద్ధ కనపరిచేది. బొగ్గు గనులూ, పూలజాతుల పెంపకం, యినుమూ వుక్కు తయారుచేయటం, వొంతెన నిర్మాణం, విమానయానం మొదలైనవాటి గురించి తెలుసుకోడం ఆమెకి తెగసరదా. హెన్రీఫోర్డ్ డెట్రాయిట్‌లోని తన మోటారుఫాక్టరీ అంతా ఆమెకి, తనువెంటవుండి, ఏభాగానికాభాగం గురించి తెలియ జెప్తూ చూపించాడుట. ప్రఖ్యాత పరిశోధకుడు ఎడిసన్ ఒకసారి ఆమె కంఠం విని 'ఆవిరి పేలినట్లుంది' అన్నాడు. ఎంచేతనంటే ఎడిసన్ అసలు చెవిటివాడు. అతనికి యీామె మాట్లాడిన మాటల్లో హల్లులేగాని అచ్చులు వినపడలేదుట. బ్రూక్లిన్ బ్రిడ్జి నిర్మించిన కర్నల్ రోబ్‌లింగ్‌ని ఆమె రెండు మూడుసార్లు దర్శించింది. చెట్ల పెంపకంలో ప్రత్యేక పరి శోధనలు జరిపిన లూథర్ బర్‌బాంక్ 'శాంటారోజా' తోటలో తను పెంచినచెట్లు అన్నీ చూపించాడు. ముళ్ళు లేని బ్రహ్మచెముడు పెంచడంలో తనుచేసిన కృషిని ఆమెకి చెప్పాడు. సెనెటర్ లా ఫోల్లెటి (Senator La Follette) ఆమెని మెచ్చుకుంటూ, ఒకసారి మిమ్మల్ని చూసిన మనిషి మరొకసారి కలుసుకుందామనుకుంటాడు, అంటూ అభినం

దించాడు. ఆల్బర్ట్ అయిన్ స్టీన్, హెలెన్ కెల్లర్ ని కలుసుకుని యానీసల్లివాన్ తో యిలాఅనేసరికి హెలెన్ కి ఎంతో ఆనంద మయింది: "ఆధునిక కాలంలో ఎవరూ సాధించలేని ఘన కార్యం మీరు సాధించారు. మీకృషి మిగతా పరిశోధన లన్నిటికంటె నన్ను గొప్పగా ఆకర్షించింది. హెలెన్ కెల్లర్ కి ఒక భాషంటూ నేర్పడమేకాకుండా ఆమె వ్యక్తిత్వం విక శింపజేశారు. అటువంటి మహత్తర కార్యం సాధించేందుకు మానవాతీతమైనకృషి కావాలి." ఆ మహనీయుడు ఐన్ స్టీన్ సమక్షంలో పాతప్రపంచం అక్కడితో మూగ వోయినట్లూ ఏదో నూతన ప్రపంచం ఉదయకాంతులతో తనని పిలుస్తున్నట్లూ భావన ఏర్పడింది హెలెన్ కి.

# 6. అంధుల కోసం

పదమూడేళ్ళపాటు రెంథామ్‌లో వున్నాక, అది అమ్మేసి, లాంగ్ ఐలాండ్‌లోని ఫారెస్టు హిల్సులో ఒక చిన్నయిల్లు కొన్నారు. లాంగ్ ఐలాండ్ నుంచి న్యూయార్కుకి కొద్ది నిముషాలలో రైలుమీద చేరుకోవచ్చు. ఈ కొత్తయింట్లో ద్రాక్షతీగెలూ, రకరకాల పూల మొక్కలూ వేశారు. హెలెన్ 'స్టడీ' కోసమని పైభాగాన కొంతమేర కేటాయించారు. జాన్ తరుచు యూరప్‌లో వుంటూండేవాడు. ఇంటిచాయల వుంటం అరుదయిపోయింది. మిస్ పోలీ థామ్సన్ 1914 లో యానీసల్లివాన్‌కి యసిస్టెంటుగానూ, కార్యదర్శినిగానూ ప్రవేశించింది. ప్రవేశించిన కొద్దిరోజుల్లోనే - ఆమె యీ యింట్లో ముగ్గురికీ అతి సన్నిహితురాలయిపోయింది. తనపెత్తండ్రిని చూట్టానికని గ్లాస్గో నుంచి వచ్చిన యీ వనిత, హెలెన్ కెల్లర్ యింట్లో ఒక మనిషైపోడమేకాకుండా, ఆమె లేకపోతే ఒక్కపనీ సాగేది కాదు. బాంక్ ఎకవుంట్లూ, రైల్వే టైమ్‌టేబుల్స్, ప్రయాణాలు టైము ప్రకారం ఏర్పరచుకోడం, మొదలైన క్రమతలన్నీ ఆ యింట్లో మిస్ థామ్సన్ ప్రవేశపెట్టింది.

ముగ్గురు స్త్రీలూ యీ నూతనగృహంలో సుఖంగా వుంటున్నారు. ఒకరిమీద ఒకరు ఎందుకో అందుకు ఆధారపడుతూ, మిస్ థామ్సన్ నిర్ణయించిన రీతిని నడుచుకుంటూ సుఖంగా వుంటున్నారు. కాని జాన్ మాసీ యీయింట్లో వారికి రానురాను దూరమవడం ప్రారంభమయింది.

సామాజిక విప్లవంపట్ల అతను చేసే కృషికి జాన్ రీడ్, కార్లో ట్రెస్కా మొదలైనవారితోపాటు, మార్గరెట్ సాంగర్ కూడా సహాయకారి అయింది. ఏమైతేనేం, అతను నెమ్మది నెమ్మదిగా దూరంగా జరుగుతున్నాడు. హెలెన్ కెల్లర్ ఫ్లావియో దగ్గిర యిటాలియన్ భాష నేర్చుకుంటోంది. రాజకీయాలంటే హెలెన్‌కి చిన్నప్పటినుంచీ యిష్టమే. ప్రతి ప్రెసిడెంటు చెప్పే సందేశమూ కాలేజీరోజుల్లో ఆమె ఎంతో శ్రద్ధగా చదివేది. పన్నెండో ఏటినుంచీ ఆమె రాజకీయ వాతావరణాన్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నించేది. ఒకసారి మైకేల్ కాబోలు ఆమెని 'నువ్వు రిపబ్లికన్‌వా-డెమోక్రట్‌వా' అని అడగ్గా, 'నేను గోడమీద పిల్లివలె వున్నాను. ప్రభుత్వ విధానమూ, ఆర్థిక రాజకీయ వ్యవహారాలూ (Political Economy) మనకాలపు ఫిలాసఫీ నాకు నేను చదివి అర్థం చేసుకుంటేగాని ఏ పక్కకి దూకేది చెప్పలేను' అంది. చిన్నతనంనుంచీ ఆమెకి సోషలిస్టు విధానం మీద గురి వుండేది. ప్రజాక్షేమాన్ని ప్రధానంగా ఎంచడమే ప్రభుత్వపు పరమ ధర్మమై వుండాలని ఆమె సిద్ధాంతం. న్యూయార్కు నగరపు తూర్పు వేపునవున్న మురికి పేటలు (Slums) చిన్నప్పు డెప్పుడో డాక్టర్ బెల్‌తో చూసింది. అటువంటివన్నీ నాశనమై మంచియిళ్ళుపడితే గాని మానవ పురోగతి అన్నమాటకి అర్థం లేదంది. ఫాక్టరీలు కార్మికులకి చెందాలి. ఎవరు వుత్పత్తిదారులో - వారికి ఆ యంత్రాగారాలు చెందడం న్యాయమని భావించింది. అంతర్జాతీయ

నావికులసంస్థ అప్పట్లో సాధించిన కొన్ని విజయాలకి ఆమె ఎంతగానో సంతోషపడింది.

మేధావంతుల్లో చాలామంది, సంఘంలో అట్టడుగున పడివున్నవారిని (Under-dogs) లేవనెత్తితేతప్ప లోకం బాగుపడగల ఆస్కారం లేదని భావిస్తూ వచ్చారు. డూ గుడ్డర్ (Do Gooder), వరల్డ్ - యింప్రూవర్ (World Improver), రిఫార్మర్ (Reformer) యిటువంటి మాటలు అప్పట్లో వ్యాప్తిలోకి వచ్చినవే. మేధావులు కొందరు విధివాదులై, విధివాదాన్ని (Fatalism) అవలంబించి అసౌఖ్యమూ నిస్సహాయతా దారిద్ర్యమూ అనేవి తప్పని సరిగా వుంటాయనీ మనమేదో పూనుకు లోకాన్ని దడదడ మార్చేద్దామని అనుకోడం, మనలోని అల్పత్వానికి చిహ్నమనీ అనసాగారు. కానీ హెలెన్ కెల్లర్‌కి యిటువంటి విధివాదం రుచించేదికాదు. పడమటని తుపాను లొచ్చాయన్నా, మిసిసిపీనది పొంగిందన్నా, ప్రకృతి భీభత్సం కానీయండి, మానవక్రౌర్యం కానీయండి, రెంటికీ ఆమె జాలిపడి, బాధితులకి ఏవిధంగా సాయపడగలనా అని వాపోయేది. కార్మికుల తరఫున నిలబడ్డ జార్జి ఆర్వెల్, కార్మికుల్లోని భౌతిక వాదానికి (Materialism) మూలాధారం, ఆత్మకంటె ఆకలి ముఖ్యం గనక అని అన్నాడు. అంటే, ఆకలికోసం ఆత్మని అమ్ముకోమనికాదు. ఇక్కడ విలువలు తేడా, తూనికలో కాదు కాలంలో. ముందు ఆకలి తీరినమీదట, ఆత్మవైపుగా వెళ్తాడు మానవుడు. హెలెన్ కెల్లర్ 'అవుట్ ఆఫ్ ది డార్క్' (Out of the Dark) అను పుస్తకంలో తనని

లోకులు సంఘబహిష్కృతురాలిగా భావించడం చెపుతుంది. తనని వెలివేసినా ప్రజలు సోషలిజంలోగల ఆవశ్యకత గుర్తిస్తే చాలు - అంటుంది. టెనిసన్ కవితావాహినివంటి యీ వనితని, బోల్షవిక్కులు తమ స్వలాభం కోసం ప్రచార సాధనగా వుపయోగిస్తున్నారని ఒకవర్గమూ, బధిరాంధురాలైన యీ మనిషి సామ్యవాద సిద్ధాంతాలు స్వానుభవంతో ఎలా తెలుసుకోగలదని మరో వర్గమూ రెండు వర్గాలవారూ ఆమెని తీవ్రంగా విమర్శించారు. జాన్ సోషలిస్టు అయినప్పటికీ, యానీ సల్లివాన్‌కి సోషలిస్టు సిద్ధాంతాలు హితవైనవి కాకపోడం వల్ల, అతను యీ విషయాలు హెలెన్‌తో ఎక్కువగా ముచ్చటించేవాడు కాదు.

హెలెన్ కెల్లర్ తను అనుకున్న మార్గం వెంట ముందుకు నడవసాగింది. ఫాక్టరీలోని పనివారివీ, గనులలోని కార్మికులవీ - సమస్యలు కాలేజీ పిల్లలు తెలుసుకోడంవల్ల, లోకానికి మేలుజరుగుతుందని చెప్పింది హెలెన్. "పూలతోటలమధ్య నడిచే మృదుహృదయులనేకమందికి, ఆర్థిక న్యాయంలోని 'అఆ'లు తెలియవు" అంటాడు డాక్టరు ఫాస్డిక్. లారెన్సు సమ్మెలోని ప్రధానవ్యక్తి అయిన గయోవనెట్టీని (Giovannitti) పక్షం వహిస్తుంది హెలెన్. "షెల్లీ కవి, సంఘంలోని ఒక దురాగ్రాన్ని ఎదుర్కొంటే - యీ గయోవనిట్టీకవి మరొక దుర్మార్గాన్ని ఎదురుకున్నాడు. ఇద్దరు మహాకవులూ సంఘంలోని అన్యాయాన్ని ప్రతిఘటించకతప్పిందికాదు" అంటుంది. "పాతకాలపు ఆచారాలని గుడ్డిగా అనుకరించే ప్రపంచం, తెరమరుగునపడి, నూతన

ప్రపంచానికి తావీయకనూ తప్పదు; ఆజననంలో నూతన ప్రపంచోదయం అనేక కష్టనష్టాలకి గురికాకనూ తప్పదు. సోషలిస్టు ఆందోళనలో యీ నూతన ప్రపంచానికిగల ఉద్భవ శక్తులు సమకూడుతున్నాయి. ఈ నిర్మాణాన్ని ఆపలేరు – నూతన ప్రపంచం ఉదయించక తప్పదు. ఎటొచ్చీ ఆ శక్తులు తెలుసుకుని మన జీవితాలు అందుకు అనుగుణంగా మార్చుకోగలిగామా, లోకకళ్యాణానికి మనమూ యితోధికంగా పాటుపడినవారమవుతాం.'' హెలెన్ కెల్లర్ గ్రంథాల్లో గల యిటువంటి అభిప్రాయాలే జర్మనీలోని నాజీనాయకుల ఆగ్రహానికి కారణమయాయి. 1933 లో బెర్లిన్ ఒపెరా హౌసుముందు, నలభై వేలప్రజల సమక్షాన యీమె పుస్తకాలు ఒకగుట్టగా పోయించి తగలపెట్టించాడు డాక్టరు గోబెల్సు.

అంధత్వానికి మూలహేతువులైన దారిద్ర్యమూ, అవిద్యా హెలెన్ కెల్లర్ కి తెలియకపోలేదు. సంఘస్వరూపం మారాలి. అది మారితేగాని ఈ దుష్టత్వాలు నిర్మూలించడం సాధ్యంకాదు. అంధత్వంకంటె బధిరత్వం మరీ ఘోరం. 1904 లో యీమె సెయింట్ లూయీ వెళ్ళి, వికలాంగుల విద్యకోసం కృషిచేసింది. అప్పటికప్పుడే బైబిల్ అయిదు రకాలఎత్తు అక్షరాలు (Raised Print) లో వెలువడింది– మూన్ టైప్ (Moon Type), బోస్టన్ లైన్ లెటర్ (Boston Line Letter), న్యూయార్క్ పాయింట్ (New York Point), అమెరికన్ బ్రెయిలీ (American Braille) యూరపియన్ బ్రెయిలీ (European Braille). తనకయితే యీ అయిదూ

తెలుసు. కాని ప్రతివొక్కరినీ యీ అయిదువిధాలూ నేర్చుకోమంటే కష్టం! ఏదో ఒకేఒకపద్ధతి సర్వత్రా ఆమో దించడం - శ్రేయస్కరమని హెలెన్ చెప్పింది. నిజానికి అంధులు పక్కవారికి బరువే. కాని తాము నిరుపయోగ మగు బరువు మనుషులమని వారికి అనిపించనీయకూడదు. వారికికూడా చేతినిండా ఏదో ఒకపని కల్పించాలి. తమ అవకాశాలనిబట్టి - తామూ పనిచేస్తున్నామనేతృప్తి వారికి కలగనివ్వాలి. 1907 లో హెలెన్ కెల్లర్ ఒకానొక స్త్రీల పత్రికలో అంధత్వం ఎలా నివారించవచ్చో, అంధత్వానికి గల కారణాలేమిటో వివరిస్తూ బ్రహ్మాండమయిన వ్యాసం రాసింది.

అంధుల బ్రతుకుబాట బాగుచేసేందుకు ఆమెజీవితం ఒకవిధంగా అంకితమయిందనే చెప్పవచ్చు. అమెరికన్ ఫవుం డేషన్ ఫర్ ది బ్లండ్ కి (American Foundation for The Blind) నిధి ఫోగు చేసేందుకుగాను 1921 లో మెట్రోపోలి టన్ ఒపేరా హౌసులో పెద్దసంగీతకచ్చేరి ఏర్పాటు చేయిం చింది. తరువాత మూడుసంవత్సరాలలోనూ షుమారు 250 మీటింగుల్లో పాల్గొని, దేశం నలుమూలలకి భిక్షాపాత్ర పుచ్చుకు బయలుదేరింది. ఎప్పుడుపడితే అప్పుడు, 'అంధులకి సాయం చెయ్యండి' అని పోడిమాటలతో అడుగుతూంటే బావుండదు. ఆ వ్యాసాల్లో, సందేశాల్లో, వుత్తరాల్లో కొత్త దనం కన్పిస్తేగాని ప్రజలు తన వినతిపట్ల ఆసక్తిచూపరు. అందుకని యింగ్లాండు, జర్మనీ, ఇటలీ, ఫ్రాన్సు దేశాల్లో విక లాంగులైన శిశువుల తల్లితండ్రులు ఏమాదిరి కృషిచేస్తు

న్నదీ - అక్కడి టీచర్లూ డాక్టర్లూ ఏవిధంగా శ్రమపడు తున్నదీ, ఎప్పటికప్పుడు నూతన విషయాలు తెలుసుకు, తనతో వుత్తరప్రత్యుత్తరాలు జరిపే వేలకొద్దీ వ్యక్తులని తనకి తోచిన సమాధానాలతో తృప్తిపరుస్తూ, కొత్త విష యాలు తను తెలుసుకుంటూ, ముందుకుసాగింది హెలెన్. ఈ ప్రపంచంలో అంధులంత ఏకాంత జీవనులు, వారే తప్ప మరొకరు లేరు - అంటుంది.

పదకొండో ఏటనుంచీ ఆమెకి, తను అంధులతరఫున మాట్లాడటానికి పుట్టిన మనిషిననే విశ్వాసం ఎందుకనో ఏర్ప డింది. ఇతరులు చూపిన దయారసంవల్ల చెడిపోని మహా నీయురాలీమె అంటాడు రాల్ఫ్ పెర్రి (Ralph Perry). 'సంగీత మంతా లోపల దాచుకున్న 'మ్యూజిక్ బాక్సు' వంటి దాన్ని నేను నన్ను నేను గాపాడుకోగలను.' అంటుందామె. తన పరిమితులేవో తనకి తెలియడంవల్ల, తన మార్గం సుగమ మయిందట.

ప్రపంచంలోని అంధులకి తను ఒకవిధంగా మార్గ దర్శిని. రష్యన్ కవయిత్రి ఆల్గా (Olga), మేడమ్ గాలిరాన్ మొదలైన వారందరూ హెలెన్ కెల్లర్ తో వుత్తరప్రత్యుత్త రాలు జరిపేవారు. అంధకార ప్రపంచాన్ని జయించిన యోధవరేణ్యులని తలుచుకున్నపుడల్లా హెలెన్ కి నూతన విశ్వాసం కలుగుతూండేది.

బొహిమియా రాజైన కింగ్ జాన్ తను అంధుడైన ప్పటికి, తన రాజ్యంకోసం పోరాడుతూ యుద్ధభూమిలో మర

ణించాడు. హూసైట్ (Hussites) సేనలని విజయపథాన పట్టించిన జాన్ ఒక అంధసేనాపతి. ఇక హోమర్, ఒసియాన్, మిల్టన్ ప్రభృతులగురించీ, వారి కవితాగానం గురించీ చెప్పనే అక్కర్లేదు. సిసిరో (Cicero) గురువు ఒక అంధుడు. సెయింట్ జరోమ్ (St. Jerome) గురువు, కన్ఫ్యూయస్ (Confucius) గురువూకూడా అంధుడే. సేండర్సన్ అనే అంధుడు ఏది మంచినాణెమో, ఏది దొంగనాణెమో - తన వేలికొనలతో, అతి సులువుగా కనిపెడుతూండేవాడుట. స్విట్జర్లాండుకు చెందిన లియోనార్డ్ యూలర్, (Leonard Euler) ఇంగ్లండులో పార్సిల్ పోస్టు ప్రవేశపెట్టిన పోస్టుమాస్టర్ జనరలూ, ప్రకృతిశాస్త్రవేత్తఅయిన హుబర్, (Huber), చరిత్రకారుడు థియర్రి (Thierry) వీరందరూ అంధులే! ఇంగ్లాండులో 1830 లో అంధులకని ప్రత్యేక వసతి గృహం ఏర్పాటు చేశారు.

ప్రెస్కాట్ (Prescott) అనే ఆయన, అంధులు తమ కాళ్ళమీద తాము నిలబడేటట్లు వారికేదేనా చేతిపనో, వృత్తివిద్యో నేర్పాలనీ వారినిచూసి జాలిపడటం కంటె - పనికొచ్చే పౌరులుగా వాళ్ళని తయారు చెయ్యడం మంచిదనీ చిరకాలంగా చెబుతూ వచ్చాడు. అంధులు తమ వేలికొనలతో వడ్రంగం, నేత, అల్లిక మొదలైనవి అనేకం చేయవచ్చు; తమ జీవితాలొక బరువు అని వారు బాధపడ నవసరంలేకుండా, అంధులకి అనువైన వ్యాపకాలు అనేకం వారికోసమని ఏర్పాటుచెయ్య గలగాలి - అంటూ వాపోతుంది హెలెన్.

# 7. 'నా మతము'

హెలెన్ కెల్లర్‌కి చాలా చిన్నతనంలోనే ఎమాన్యుయల్ స్వీడెన్‌బోర్గ్ చెప్పిన (Emanuel Swedenborg) నూతన చర్చి సిద్ధాంతాలమీద గురి ఏర్పడింది. ఇంట్లో వున్న ముగ్గురివీ మూడుదార్లు. జాన్ రేషనలిస్టు, యానీకి ఫలానా మతమని దేనిమీదా నమ్మకం లేదు. కొన్నాళ్లామె కేథలిక్ మతంవైపూ, ఆ తరువాత ప్రోటస్టెంటు మతం వైపూ వుయ్యాలలూగి చివరికి మత రాహిత్య మలవరచుకుంది. ఏమైతేనేం జాన్ దంపతు లిద్దరికీ మత విశ్వాసం పూజ్యం. స్వీడన్‌బోర్గ్ చాలా గొప్పవాడేగాని ఓ సూక్ష్మ 'లూజు' అని దంపతు లిద్దరూ భావించేవారు. కాని హెలెన్‌కి ఆయన పరమపూజ్యుడు. బాల్‌జాక్, కూల్‌రిడ్జి, ఎమర్సన్, హోవెల్సు మొదలుగాగల వారిని కట్టివేయగల ఆయన సిద్ధాంతాలు సర్వసామాన్యమైనవి కావనీ, మత విశ్వాసమనునది ఒక మనోనేత్రమనీ, హెలెన్ అభిప్రాయం.

మత సారస్వతం వైపుగా యీమెని మొట్టమొదట పరిచయం చేసినవాడు ఫిలిప్స్‌బ్రూక్సు, అమరత్వంగురించీ భగవంతునిగురించీ ఆమెకి ఎటువంటి సంశయాలూ వుండేవి కాదు కాని, బైబిల్‌లోని విషయాలు మాత్ర నమ్మశక్యంగా వుండేవికాదు.

దేవుడికీ కొమ్ములుగల జంతువుకీ, ఎందుకా ఘోర పోరాటం జరగాలి? జీవులను తీసుకెళ్ళి మంటల్లోకి విసరడ

మెందుకు? ఆ బాధకి అంతమంటూ వుండదా? ఏసుక్రీస్తు హంశగా, ప్రేమమూర్తివలె అవతరిస్తున్నాననేదేవునికి, యింత కసీ కోపం ఎందుకు? ఏసుక్రీస్తు జీవితంలో కనపడ్డ కరుణ.రసవాహిని బైబిల్ కథల్లో ఎందుకు లేకపోవాలి? ఈ లోపాలు కేథలిక్ మతంలోవి కాబోలు ననుకుని ప్రొటస్టెంట్ మతాన్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నించింది. కాని ప్రతి మతంలోనూ వర్గ చీలికలూ కర్మకాండా, అసలు వెలుగుని సనాతనత్వంతో కప్పేసి, దైవ స్వరూపం తెలుసుకోనివ్వకుండా చేస్తున్నాయంది. పవిత్రతకీ మంచితనానికీ బోలెడంత తేడావుంది అన్న - పేస్కల్ (Pascal) మాటలు ఆమెకి చాలా నచ్చాయి. ప్రతిమతమూ కొన్నాళ్ళయేసరికి తనవ్యాప్తికిసంబంధించిన కర్మకాండ అలవరచుకు, జన శ్రేయస్సుని విస్మరిస్తుంది. తను చదివిన యిన్ని పుస్తకాల్లోకీ స్వీడన్ బోర్గ్ బైబిల్ గురించి చెప్పిన వ్యాఖ్యానం చాలా చక్కగావుంది. నేటి కాలపు ఫిలాసఫీనిగాని, విజ్ఞాన శాస్త్రాన్నిగానీ కాదనకుండా, బైబిల్ సారస్వతంలో పరిశోధనలు జరిపి, పాత సీసాల్లోకి క్రొత్తద్రాక్షరసం ఎక్కించి నట్లుంది ఆయన వుపదేశం.

గ్రాహమ్‌బెల్ సెక్రటరీ అయిన హిడ్జిద్వారా, స్వీడన్ బోర్గ్ పేరు మొట్టమొదటిసారి వింది హెలెన్ కెల్లర్. ఈ హిడ్జే ఆమెని స్వీడెన్ బోర్గ్ మార్గంవైపుగా పట్టించాడు. అంధులకై అమితకృషి చేసినవారిలో హిడ్జి ఒకడు. బ్రయిలీలో హెలెన్ కి చెప్పేందుకుగాను - ఆమె కోసమని అతను బ్రయిలీ నేర్చుకున్నాడు. హిడ్జికీ హెలెన్ కీ మాట్లాడుకునేం

డుకు ఆధ్యాత్మిక ప్రపంచానికి మార్గదూత అయిన స్వీడన్ బోర్గ్ యిరువురికీ పూజనీయుడు. ఆయన వ్యాఖ్యానం సాయంతో బైబిల్‌లోని పరమ సత్యాలని అనేకం తెలుసుకుంది హెలెన్. ఆయనగారు కొత్త బైబిల్ రాయడం కాక బైబిల్‌లోగల కొత్తఅర్థం అందరికీ చెప్పాడు. స్వీడన్ బోర్గ్ జీవితాశయ మేమనగా, బైబిల్‌లోని ఆధ్యాత్మిక అర్థాన్ని ప్రజానీకానికి చెప్పడం. బైబిల్‌లో పైకి కనిపించే కథ ఒకటి, అంతరార్థం మరొకటి. తను శ్రమపడి గ్రహించిన యీ అంతరార్థం, లోక ప్రజలందరూ తెలుసుకోవాలని స్వీడన్ బోర్గ్ తాపత్రయం. క్రీస్తుమతం జీవంగల మతంలా వృద్ధిచెందాలే తప్ప ఈ సనాతనత్వానికి కట్టుబడిపోతే మానవజాతి ఆధ్యాత్మికోన్నతి దెబ్బతింటుంది – అనేవాడు. ఆయనదృష్టిలో బైబిల్‌కి బ్రహ్మాండమయిన అంతరార్థముంది. అందులోని దేవుడు యూదులొక్కరికే దేవుడు కాడు. అన్ని దేశాలకీ అన్ని కాలాలకీ దేవుడు. జీవితం పుట్టుక (Genesis) గురించీ ప్రళయంగురించీ, ప్రజలు పారిపోడంగురించీ (Exodus) ఆయన నమ్మొదలచుకోలేదు. అదీగాక వాటిని మనకి తెలిసిన చారిత్రిక హంశాలతో ముడిపెట్టవద్దన్నాడు, మానవ పరిణామంలో అవి వేరువేరుఘట్టాలుగా భావించమన్నాడు. ఈజిప్టునుంచి ప్రజలు వెళ్ళిపోవడం మానవుడు అవిద్యనుంచీ, పదార్థపుతాకిడినుంచీ ముందుకు అడుగు వేస్తున్నాడని అర్థమట. మానవ మేధస్సు అనేక చీకటి దారులగుండా ప్రయాణంచేసి, కాంతికిరణాలని వెతుక్కోడమనేది మనకి తెలియని విషయంకాదు.

బైబిల్ కథమాట ఎట్లావున్నా స్వీడన్ బోర్గ్ బోధ నల్లో ఒక ముఖ్యవిషయం మనం గమనించాలి. ప్రేమ అనునది యీశ్వరాంశ అనీ, మానవులు ఆ యీశ్వరాంశవల్ల పూర్ణ జీవులవుతున్నారనీ, ఎప్పుడైతే ప్రేమ అనునది హృదయంలో లోపిస్తుందో - అప్పుడది ఆధ్యాత్మిక మృతి (Spiritual Death) అవుతుందనీ. స్వార్థాన్ని విడనాడడం - స్వర్గాన్ని కాంక్షించడం వంటిదనీ, స్వార్థకాంక్షే నరకంతో సమానమనీ చెప్పుకుంటూ వచ్చాడు. హెలెన్ కెల్లర్ కి యీ మాటలన్నిటిలోనూ ఏదో నిజంవున్నట్లూ ఆత్మ సౌందర్యమంటే అదేననీ, లోన కనబడే వెలుగే జీవితానికి పుష్టినిస్తుందనీ నమ్మకం కుదిరింది. అంధకారమయ లోకాన్ని ప్రేమతోనూ విద్యతోనూ జయించుకుంటూవచ్చిన హెలెన్ కి ఏసుక్రీస్తు అమరప్రేమకి చిహ్నంగా కనిపించడంలో ఆశ్చర్యం లేదు. దేవునిపేరు చెపుతూ మతాలు ఘాతుక కృత్యాలకి పూనుకుంటాయని ఆమె భావించడంలోనూ తప్పులేదు.

స్వీడన్ బోర్గ్ ఫిలాసఫీలో మరో విశేష ముంది. ఆయన సౌందర్య దృష్టితోపాటు ఘ్రాణేంద్రియజ్ఞానంకూడా ముఖ్యమన్నాడు. ఆయన సిద్ధాంతం ప్రకారం ప్రతి వ్యక్తి కొన్ని వాసనలమయం. కొందరు పరిమళ భరితంగా వుంటే, మరికొందరు దుర్గంధపూరితంగా వుంటారు. ఆధ్యాత్మిక సౌందర్యం కలవారు సువాసనలు వెదజల్లితే, దుష్టులు (Infernals) కంపు కొడుతూంటారు. ఈ దుష్టులు, పక్వానికి వచ్చిన ఫలజాతినీ, పరిమళంతో వెలిగే కర్పూరాన్ని,

పువ్వులూ, బ్రెడ్డూ యిలాటివాటిని, అంటే వీటి వాసనలని, భరించలేరు. అప్పుడే కాల్చిన బ్రెడ్ కిగల పరిమళం స్వర్గ ద్వారపు సువాసన (Heavenly Odours) వంటిదట, ప్రతి జీవికి ఒక వాసన వుంటుందని చెప్పుకున్నాం కదా! ఆ వాసనని పట్టి మనిషి ఎలాటివాడో చెప్పవచ్చునట. దురాశాపరులు ఎలికలవలె, అమాయకుల్ని హింసించేవారు నల్లులవలె, తమ గొప్పతనం చెప్పుకు ఆనందించేవారు మాడిపోయిన బ్రెడ్ వలె ఒక్కొక్కరు ఒకోమాదిరి వాసన వెదజల్లుతారుట. ముఖ్యంగా ఆయన పువ్వుల గురించి చెప్పిన విషయం హెలెన్ కి బాగా నచ్చివుంటుంది. ఈ కనిపించే గులాబీ గులాబీ కాదు; స్వర్గపురిలోగల ఒక సౌందర్యాన్ని యీ భూమిమీద మనకి కనిపింపచేస్తున్న ఒక స్వరూపం – అని పువ్వులగురించిచెబుతూవాటి సౌందర్యాన్ని ఆధ్యాత్మిక లక్షణాన్ని ఎంతో ప్రస్తుతించాడాతత్వవేత్త. ఆయన ప్రభావమే హెలెన్ చేత ఒకచోట యిలా రాయిస్తుంది: 'నేను అనగా ఏమిటి? గానమాధురి, కాంతివెల్లువాను. భావాలు రంగు రంగుల కాంతుల్లో నానుంచి ప్రసరిస్తూంటాయి.'

ప్రపంచంలోని దుష్టత్వాన్ని, ఆ దుష్టత్వానికిగల రాక్షస శక్తిని తెలుసుకు, సూర్యభగవానుని పోలిన మంచితనం వైపుకి మనసు తిప్పుకో–అంటాడు యీ స్వీడన్ బోర్గ్ శిష్యులలో ఒకడయిన హెన్రీ జేమ్సు.

*　　　*　　　*

యానీసల్లివాన్ ఆరోగ్యం చెడిపోనారంభించింది. వూపిరితిత్తులవ్యాధి ఒకపక్క పీడిస్తూండగా – యిన్ ఫ్లూ

మొంజా పట్టుకుంది. ఆ ఏటికాఏడు ఆమె నేత్రదృష్టి సన్నగిల సాగింది. చిన్నతనంలోని అంధత్వం మళ్ళీ రానారంభించింది. యానీ పూర్తిగా మంచం పట్టకపూర్వం, హెలెన్ జీవితంలో ఒక విపత్కర పరిస్థితి ఏర్పడుతుంది.

టీచరూ విద్యార్థినీ - మెయినీ రాష్ట్రంలోని బాత్ అను గ్రామం దగ్గిర వుంటారు. లెక్చర్ టూర్ కనివాళ్ళు అక్కడికి వచ్చారు. యానీకి అమాంత్రం సీతజ్వరం వస్తుంది. గదిలోని టెలిఫోన్ ఎక్కడుందో కూడా హెలెన్‌కి తెలియదు. ఒకవేళ తడుముకు ఆ టెలిఫోన్ దగ్గిరకు వెళ్ళగలిగినా అది డయిల్ చేసి మాట్లాడగలగడమనేది కల్ల. మేడదిగివెళ్ళి హోటల్‌లోని గుమాస్తాలకి - యిలా యానీకి జబ్బుగా వుందనీ, వైద్య సహాయం కావాలనీ చెప్పడమన్న సంగతి తనవల్ల అయేది కాదు. లెక్చర్ టూర్ కాన్సిల్ చేసుకు, యింటిముఖం పట్టారు. యాండ్రూ కార్నీ యిస్తానన్న పెన్షన్‌ని వెనకటైతే సోషలిస్టు సిద్ధాంతాలు మాట్లాడి నిరాకరించింది; ఇప్పుడాయనవైపు చెయ్యిచాపక తప్పింది కాదు. కాని ఆ యిచ్చే పెన్షన్ కూడా వీరి ఖర్చుల్లో సగానికిమాత్రమే సరిపడుతుంది. అది కొద్దిపాటి పైకమయినా హెలెన్‌కి ఒకవిధంగా మనశ్శాంతి వచ్చింది. ఆ పైకం తన టీచర్‌కి వుపయోగపడుతుందని కొంతలో కొంత తృప్తి. అనారోగ్యకారణాలవల్ల యానీని, యీ వూరూ ఆ వూరూ పంపుతూండేవారు. ఆమెవెంట పాలీ థామ్సన్ వెళ్లింది. ఆ వేసవికాలంలో హెలెనూ - ఆమె తల్లీ మటుకు యింట్లో వుండేవారు. యానీ కేమైనా జరిగితే తనజీవితం ఏంగాను -

అను భయం పట్టుకుంది హెలెన్‌కి. వీరిదగ్గిర దుబాసీగా (Interpreter) పనిచేస్తున్న ఒక యువకుడు - హెలెన్‌ని ప్రతి సాయంత్రమూ రెంథామ్ చిట్టడవుల్లోకి షికారు తీసు కెళ్తూండేవాడు. ఆ యువకుడు హెలెన్‌ని, తనని వివాహ మాడమని కోరుతాడు. కాని అనేక కారణాలవల్ల ఆ వివాహం జరగదు.

'అనుకోకుండా తుపానులా వచ్చిన ఈ ప్రణయం రెక్కలు కట్టుకు వెళ్ళిపోయింది. ఆనందమందిరమనదగు చిన్నద్వీపంలో నేను నివశిస్తున్నాను. చుట్టూ అంధకార జలమయం' అని ఒక గ్రంథంలో చెపుతుంది హెలెన్ కెల్లర్. 'మై రెలిజియన్' - అను పుస్తకం హెలెన్ పూర్తి చేసేనాటికి యానీ ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. ఆ వేసవికాలంలో బెర్క్‌షైర్స్‌వేపు మార్పుకని వెళ్ళారు. కొండలోయలూ అక్కడి పొదలూ ఆ కొత్త ప్రదేశంలోని నూతన పరిమళాలూ - హెలెన్‌కి అమిత సంతోషం చేకూర్చాయి.

1933-34 లలో ఒక ఏడాదిపాటు వారు యూరప్ పర్యటించారు. బ్రిటానీ, కారన్‌వాల్, ఐర్లెండు వెళ్ళారు. ఎసెక్సురాష్ట్రం చేరుకునేసరికి యానీ ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. పురాతన శిథిలాల్తో వున్న ఆ ప్రదేశం పర్య టిస్తున్నపుడు చారిత్రాత్మిక హంశాలెన్నో జ్ఞాపకంవచ్చేవి హెలెన్‌కి. అక్కడి వైలెట్‌పువ్వులసువాసనా, నీటికొలనుల వద్దనుంచి వచ్చే చల్లనిగాలి, బంగారురంగులోని ప్రిమ్ రోజాలు, రకరకాల పూచికలూ, లతలూ, చిన్నిచిన్ని

కొండగుట్టలూ, ఆ గుట్టల వెనుకగా సముద్రతీరం, ఆ తీరపు చల్లదనమూ, షేక్స్‌పియర్ వర్డ్స్‌వర్తులు జన్మించిన దేశంలో తాము వుంటున్నామనేభావన - వీటితో హెలెన్‌కి ప్రతిరోజూ, నిత్యనూతనానందమయంగా అగుపించేది.

అమెరికాలో వున్నంతసేపూ హెలెన్‌పని అంధులకి విరాళాలు పోగుచెయ్యడం. కొన్నాళ్ళపాటు ఆ విరాళ సేకరణ ఆపి, విశ్రాంతి తీసుకోవాలనిపించింది అందరికీని. ఇంగ్లాండు వచ్చినా పత్రికలవాళ్లూ ఫోటోగ్రాఫరులూ ఆమెని వదలిపెట్టలేదు. ఒకసారి యూగోస్లోవియా వెళ్ళవలసి వచ్చింది. లండన్‌లో బ్రిటిష్ చక్రవర్తీ, చక్రవర్తి భార్యా, హెలెన్‌కెల్లర్‌కి గార్డెన్ పార్టీ యిచ్చారు. ఆ పార్టీలో యానీసల్లివాన్, పెదిమిలమీదా కంఠనాళాలమీదా వేలికొనలువుంచి, హెలెన్ ఏవిధంగా అవతలవారి మాటలు గ్రహించేదీ, అక్కడవారికి వివరించి చెప్పింది. పద్నాలుగేళ్లు యీస్టెండ్ మురికిపేటల్లో గడిపిన యాట్లీసి, కామన్సు సభలో కలుసుకుంది హెలెన్, తరువాత లేడీయాస్టర్ యింట్లో బెర్నార్డ్‌షాని కలుసుకుంది హెలెన్. షా నాటకాలన్నీ ఆమెకి బాగా తెలుసు. అతని రచనలపట్ల ఆమెకి ఎంతో గౌరవం. పిగ్మాలియన్ నాటకంతో ఆమెకి షా పరిచయ మయాడు. లండన్‌లో వున్నప్పుడు ప్రతిరోజూ 'ది యాపిల్‌కార్ట్' (షా నాటకం) చదివేదట. అతనితో కరస్పర్శ చేస్తున్నప్పుడు చేతికేదో గుచ్చుకున్నట్లుగావుందిట. "హృదయ లోపాన్ని మేధాసంపదతో కప్పిపుచ్చుకునే వ్యక్తి యితనని" - అనుకుని ఆ మాట తరువాత యానీతో

చెప్పిందట. లేడియాస్టర్ షాతో "మీకు తెలిసేవుండాలి - మిస్ కెల్లర్ అంధురాలు, మూగమనిషి..." అనగా బెర్నార్డుషా "ఆ, దాని దేముంది? అమెరికనులందరూ బధిరాంధులు - మూగవారు కూడా -" అన్నాడట. ఇంత కటువుగా అతను అనివుండకూడదు - నిద్దర్నుంచి మేలుకొన్నవాడిలా చటుక్కున అనేశాడు. తను ప్రతిచోటా ప్రత్యేకంగా కనిపించాలని అలా అన్నాడా? ఇతరులని ఆశ్చర్యపరచడం అతని స్వభావలక్షణం గనక - అందరినీ ఆశ్చర్యపరిచే వుద్దేశంతో అలా అన్నాడా? లేక తనచుట్టూ అల్లుకున్న బంగారుమేడకి - తనే ఎల్లప్పుడూ అధిపతి అయివుండాలనే తలంపా? - అని యిలా రకరకాలమంది అభిప్రాయాలు వెలిబుచ్చసాగారు. తరువాత 'షా' ని అడిగితే, "నేను అలాఅనలేదు! విన్నవాళ్లు సరిగా వినివుండరు" అని ఆ వాగ్వాదాన్ని తోసివేశాడట. హెలెన్ కెల్లర్ ఆ రిమార్కుని అంత సీరియస్ గా తీసుకోలేదు. బెర్నార్డుషా పట్ల ఆమెకి గల పూజ్యభావం ఎంతమాత్రం చెడలేదు. ఆమె దృష్టిలో ఇతను - 'ది చీఫ్ ప్రాసిక్యూటర్ ఆఫ్ హిజ్ క్రైమ్' (నేరాన్ని నిరూపించి చూపే న్యాయవాది)

స్కాట్లండులో వున్నపుడు ఆమెకి ఎన్నెన్నో ఆలోచనలు వచ్చాయి. అది పాలీ థామ్సన్ జన్మస్థలం. తనని చిన్నప్పటినుంచీ ఒక దారికి తీసుకువస్తున్న గ్రాహామ్ బెల్ జన్మస్థానం. ముఖ్యంగా ఫ్లయింగ్ స్కాట్స్‌మాన్ అను రైలులో ప్రయాణం చేస్తున్నప్పుడు ఆమె పొందిన అనుభవాలు చాలా గొప్పవట. ఆయినపరాతుసి పొట్టలో బొగ్గు

పొయ్యడం, అది నిప్పులుగక్కుతూ డెభై మైళ్ళ వేగాన పరుగులెత్తడం - అది అలా పరుగెత్తుతున్నపుడు చేయి బైటకుపెట్టి గాలివేగం ఎంత వుధృతంగావుందో తను తెలుసుకోవడం - యివన్నీ ఆమెకి కొత్తగా వున్నాయి. స్కాట్లండులోని ఒక విశ్వవిద్యాలయం ఈమెని గౌరవ పట్టభద్రురాలిగా చేసింది. బొగ్గుగనుల అడుక్కి అనగా తొమ్మిది వందల అడుగులలోతుకి వెళ్ళి - అక్కడ పనివారు ఎలా పనిచేసేదీ - ఆ చుట్టూగల వాసనలద్వారా తెలుసుకుంది. ఆమె ఆరాధ్య పురుషులలో ఒకడైన డేవిడ్ లివింగ్‌స్టోన్ జన్మస్తలంచూసి, నీగ్రోలతరఫున అతను చేసిన కృషికి కన్నీరుకార్చింది.

ఒక ఏడాదిపాటు యిలా తిరిగారు. యింతలో యానీ నేత్రవ్యాధి ముదిరింది. నానాటికి ఆమె దృష్టి తగ్గిపోనారంభించింది, హెలెన్ తన టీచరుకి బ్రెయిలీ నేర్పడానికి పూనుకుంది. టీచరు విద్యార్థినిగానూ విద్యార్థిని టీచరుగానూ మారారు. ఇంతలో జాన్ మరణించాడన్న విషాదవార్త తెలిసింది. "ఇక్కడితో ఈ నాటకం ముగిసింది. ఈ వివాహం మా జీవన గమ్యాన్నీ లక్ష్యాన్నీ ఒకవిధంగా ధ్వంసం చేసింది. ఈపోరాటం చివరికి నిస్పృహాలో అంతమయింది. తీవ్రతరమైన ప్రేమలో ఎప్పుడూ బాధేగాని సుఖం వుండదు," అంటూ తమ ఆప్తమిత్రు లొకరికి రాసింది హెలెన్.

తనకింక కొద్దిరోజులే వైముందనీ, తను కూడా కథాంతానికి జేరుకుంటున్నాననీ, పాపం, యానీ సల్లివాన్‌కి తెలియదు.

# 8. ఇంగ్లాండూ - జపాను

వాషింగ్‌టన్‌లోని నేషనల్ కెథడ్రల్‌లో 1936 నవంబరు మూడో తేదీన యానీసల్లివాన్ అస్తికలు, వుడ్రో విల్సన్ సమాధికి చేరువలో భూస్థాపితంచేశారు. వాషింగ్‌టన్ బిషప్ ఆనాడు మాట్లాడుతూ, యానీసల్లివాన్ వంటి అధ్యాపకురాలు, పుట్టలేదు పుట్టబోదు అన్నాడు.

పాలీథామ్సన్‌ని వెంటపెట్టుకు హెలెన్ కెల్లర్ మళ్లీ మరోసారి స్కాట్లండు వెళ్లింది. స్కాట్లండులోని పచ్చదనమూ కొండగుట్టలూ ఆమెని ఎందుకనో కట్టేశాయి. యానీ మరణంతో హెలెన్‌కి చెయ్యి విరిగినట్లయింది. మళ్లీ జీవనశక్తులు కూర్చుకోకతప్పదుకదా! యానీగురించి ఆనాడు రాయడం మొదలుపెట్టిన పుస్తకం పూర్తయేందుకు పంథొమ్మిది సంవత్సరాలు పట్టింది. జీవితమొక ఆట; ఈ ఆట చివరంటా ఆడేందుకు దుఃఖభారాలన్నీ దిగమింగి, కాలాన్ని ధైర్యంతో ఎదుర్కోవాలి. ఏవొక్క బాధకీ మనం ఆహుతికాక బాధలన్నీ జయించుకుంటూ ముందుకు రావాలి. సముద్రప్రయాణం చేస్తున్నపుడు డెక్ మీద పాలీథాంసన్, తెల్లటి నీటిపక్షులని పరిచయంచేస్తూ, అవి వేలకివేలమైళ్లు సముద్రాలని ఎలా దాటేదీ, యింతచిన్న జీవులు నిస్సహాయంగా ఎలా జీవితం గడుపుతున్నదీ, అరిచేతిలోకి రాసి చూపించింది. మహాసముద్రంలో ఓడమీద కొచ్చి వాలే ఆ చైతన్య చిహ్నాలని చూసి హెలెన్ తనలో

తను శాంతించింది. కవితాసంపదనీ, సుందరప్రదేశాలనీ తెలుసుకొని జీవించడమనే మహాప్రయత్నంలోగల ఆనందానుభూతి రేకానికి ముగ్ధురాలయింది.

చిన్నప్పటినుంచీ హెలెన్‌కి డైరీ రాసుకోడం అలవాటు. ఆ అలవాటు ముఖ్యంగా యీ సమయంలో ఎంతో వుపకరించింది. మనసుని మళ్లీ నిత్యజీవన కార్యక్రమంవైపు తిప్పుకోవాలి. తన జీవిత శేషం అంధ ప్రజానీకానిది. అప్పటి కప్పుడే యిరవై రెండేళ్ళబట్టీ హెలెన్‌తో వుంటున్న పాలీ థామ్సన్, హెలెన్ మనసులోని యీ తుపానులు గ్రహించి, ఆమెని శాంతచిత్తురాలుగా చేసేందుకు మార్గాలు అన్వేషిస్తూవుండేది. ఒకసారి న్యూరంబర్గ్ జంతుప్రదర్శనశాలలోని వానర విభాగానికి (Monkey House) తాళం సరిగా వెయ్యని కారణాన కోతులన్నీ తప్పించుకు చెల్లాచెదరుగా నగరపు వీథుల్లో తిరగడం గురించిన కథ చెప్పేసరికి, చిన్నపిల్లకిమల్లే ఆనందంతో నవ్వింది హెలెన్. సౌతాంప్టన్ వోడరేవుకి సప్తసముద్రాల్లోంచి పడవలు వస్తాయని విని ఆనాడు రేవు లోంచివచ్చే వాసనలు తన మనోమందిరంలో దాచుకుంది. ఆ వోడరేవు ఎలా వుంటుందో తనకి తాను తెలుసుకోవాలనుకుందిగాని అక్కడి శబ్దాలవల్ల అది సాధ్యంకాలేదు.

తను చెవిటిదాన్ననిగానీ - గుడ్డిదాన్ననిగానీ ఆమె ఏనాడూ బాధపడలేదు. ఈ రెండు అవకరాలూ జయించడమే తన జీవనగమ్యమని ఆమెకి తెలుసు. యూరప్‌లోని యుద్ధమేఘాలకి ఆమె మనసు ద్రవీభూతమయింది. ఇంగ్లాండు స్కాట్లండులకోసం నాలుగుకోట్ల గాస్ మాస్కులు తయారు

చేశారని విని, ఆమె విచారపడింది. 1936–37 నాటి ప్రపంచం 'డైనమైట్' లోపల పెట్టుకు ఎక్కడా ఆగకుండా వెళ్తున్న ఎక్స్‌ప్రెస్ ట్రయిన్‌లా వుందిట. జాతులూ దేశాలూ జరుపుతున్న దురన్యాయాలకి పాపఫలితంగా ఈ యుద్ధం రానున్నదని అనిపించిం దామెకి. స్పెయిన్‌లో ఏనాడూ పశుశక్తితోకూడిన ప్రభుత్వమేగాని, ప్రజాభిప్రాయప్రకారం పాలన జరగడమన్నది లేదు. సోవియట్ దేశంలోని వున్నతాధికారులు కొందర్ని దేశద్రోహులుగా (Soviet Purge) కాల్చేశారు. స్పెయిన్‌లోని మతజీవనమూ కులవిభేదాలూ యిండియాలోని కట్టుబాట్లనీ, ఆచారవ్యవహారాలనీ జ్ఞప్తికి తెస్తాయి. యీ రెండు దేశాలచుట్టూ బోలెడంత కవిత్వమూ రొమాన్సు అల్లబడివుండటంచేత నిజానిజాలు ఒకపట్టాన తేలవు. జర్మనీలోని ఘాతుక చర్యల గురించి చెప్పనే అక్కర్లేదు. అయిన్‌స్టీన్ అంతవాడిని తరిమేశారు వాళ్లు. హెలెన్‌ని సోవియట్ దేశంలోని దారుణాలకంటె నాజీల దురాగతాలు మరీ ఎక్కువగా బాధించేవి. రష్యనులలో కొంత భిన్నత్వం వుండవచ్చు. కాని జర్మన్‌లకేమొచ్చింది? ఒకేకూటమిలో పుట్టి, ఒకే నాగరికతను పంచుకున్న జర్మన్‌లు చేస్తున్న నేరాలు క్షంతవ్యంకానివిగా తోచేది. మతరాహిత్యంవల్లా నిరీశ్వర తత్వంవల్లా బోల్షివిజమ్ జన్మించిందనీ, నాజీ కాంపుల్లోని ఖైదీలకి తాము అనుభవిస్తున్న బాధలవల్లా, తింటున్న కొరడాదెబ్బలవల్లా, పడుతున్న అష్టకష్టాలవల్లా, మానవుడు అల్పుడనీ, భగవంతుని విస్మరించడంవల్ల యిలా జరుగుతోందనీ అభిప్రాయం

ఏర్పడి, తిరిగి భగవంతునివేపుగా తమదృష్టి ప్రసరించగలుగు తున్నారు – అంటుంది హెలెన్.

ఇంగ్లాండు స్కాట్లాండులోని ప్రజలని చూస్తే ఆమెకి ఎంతో సంతోషమయింది. ఈ చిన్న ద్వీపంలో నివసిస్తున్న ప్రజలు యావన్మందికీ తమలక్ష్యమేదో తెలుసు. మానవ స్వాతంత్ర్యానికి తాము ప్రతినిధులుగా నిలబడగలమనే మనోబలముంది. బయటప్రపంచంలోని తారుమారులు వారి నిత్యజీవితాన్ని ఏవిధంగానూ మార్చలేవు. జీవితంపట్లా ప్రభుత్వంపట్లా, మానవునిపట్లా, అమిత విశ్వాసంతో వారు పురోగమిస్తున్నారు. హెలెన్ దృష్టిలో ప్రతి యుద్ధమూ ఒక కుటుంబ కలహంవంటిది. కలహాలెప్పుడూ విచ్ఛిన్నతకి దారితీస్తాయి. ఏకత్వంలోగల సామరస్యం చీలికలలో వుండదు. ఈసారి యింగ్లాండులో వుండగానే థామస్ పెయిన్ శిలాప్రతిమని ఆవిష్కరించేందుకు – పారిస్ నుంచి ఆహ్వానం వచ్చింది. జాతులుఅన్నీ ఒక కూటమిగా ఏర్పడాలని, (Federation of Nations) తమదేశమూ తమగొప్పలూ చెప్పు కునే స్వల్పత్వంనుంచి మానవులు ఎదగాలనీ, ఈ ఫెడరేషన్ ఏర్పడేదాకా మానవునికి సుఖం వుండదనీ థామస్ పెయిన్ అంటాడు. కొందరి దృష్టిలో అతను రాజకీయపరిజ్ఞానం బొత్తిగాలేని మూర్ఖుడు. అయినప్పటికీ గొలుసులు తెంపి, సింహాసనాలని కదిలించింది అతని భావనా బలం. ఆచా రాలు పట్టుకువేవుళ్లాడటం ఆంతర్యంలో విశ్వాసంలేని అంధత్వంవంటిది; గొర్రెలవలె తలవొగ్గడం నియంతృత్వానికి రాజబాట; తిండిలేకపోతే దేహం ఏవిధంగా కృశిస్తుందో,

జ్ఞానం లేకపోతే (Famine of Knowledge) మనసు అంత కంటె ఘోరంగా కృశిస్తుంది - అంటూ తన అభిప్రాయాలు సూటిగా చెప్పిన మహాపురుషుల్లో థామస్ పెయిన్ ఒకడు.

ఇతరుల మనసు ఆకట్టుకునేందుకు ప్రయత్నించే హెలెన్ తన మనసునిమాత్రం ఎల్లవేళలా అతి నిర్మలంగా వుంచుకునేది. ఏ కొత్త విషయం వచ్చినా, తను ముందు తెలుసుకునేది. కొత్త గ్రంథాల పఠనతో ఆమె మేథస్సు ఆనాటి కానాడు మరీ మరీ విశాలం కాజొచ్చింది. భిన్న భిన్న తత్వాలుగల స్త్రీ పురుషుల సమస్యలు యావత్తూ తనకి తెలిసినవిధంగా అర్థం చేసుకునేది. పారిస్ వెళ్ళగానే, నెపోలియన్ జీవితచరిత్ర ఒకటి చదివి, తద్వారా పారిస్ అంటే ఏమిటో కొంతవరకూ తెలుసుకుంది. అదే ప్రకారం గ్లాడ్ స్టన్, డిజ్రయిలీల జీవిత చరిత్రలుచదివి, గ్లాడ్ స్టన్‌లో గల మంకుపట్టుకీ (Bulldog Grip) డిజ్రయిలీ మనోవికాసానికీ ఆశ్చర్య చకితురాలయింది. 'అల్పత్వం పైకి రానిచ్చేందుకు మీ జీవిత కాలపరిమితి స్వల్పంకదా' అంటాడు డిజ్రయిలీ ('LIfe is to short to be little'). అటువంటి సూత్రమే ప్రాతిపదికగా హెలెన్ జీవిస్తోంది. విల్లాకేథర్, హామ్సన్, కాన్‌రాడ్, టర్నిఫ్ మొదలైనవారి రచనలు చదివి ఆనందిస్తూ వుండేది హెలెన్ అప్పట్లో. ముఖ్యంగా ప్రకృతి శాస్త్రానికి సంబంధించిన పుస్తకాలు ఆమెకి తెగయిష్టం. క్లిఫర్డ్‌తో కవిత్వం గురించి చర్చిస్తూ యీ నాటక రచయిత ద్వారా బౌద్ధమతంగురించి తెలుసుకుంది, స్వీడన్‌బోర్గ్ బోధనలు, బుద్ధుని ఉపదేశాలతో కొన్నాళ్లపాటు పోల్చి

రెండిటిలోనూ గల పోలికలు, తనకి తాను గ్రహించింది. టి. యస్. ఎలియట్ నాటకాలు ఆమె కొన్ని చదివింది గాని - 'ది హాలో మెన్' (The Hollow Men) ఆమెకి రుచించలేదు. నిరాశాతత్వం ఆమెకి విచారం కలిగించేది. మానవుడు చిరంజీవి; విశ్వాసమే ప్రాణవాయువుగా అతను జీవిస్తున్నాడు; ఆ విశ్వాసాన్ని నాశనం చెయ్యడంవల్ల ప్రయోజనంలేదు - అనేది హెలెన్. కవితా హృదయంగల మనిషి కనక - క్రిష్టఫర్ ఫ్రై, రాబిన్‌సన్ జఫర్స్ ప్రభృతులు ఆమెని ఎంతగానో ఆకర్షించారు.

యానీసల్లివాన్ హెలెన్‌ని చిన్నప్పటినుంచీ 'పొయిట్రీ' వైపు పట్టించి, ప్రోత్సహించింది. కవితానుభవం మన మనసుని కవిమనసుకి సన్నిహితంగా తీసుకెళ్తుంది. ఆకులు తొలిగించి, ఆకులచాటున దాక్కున్న ఫలాన్ని చూడటమూ ఆ సువాసనని ఆఘ్రాణించడమూ వంటిది కవితానుభవమనగా. ఆకులు తొలిగించి. యింకా చెట్టునవున్న పండుమీదకి, వెచ్చని సూర్యకిరణాలు పడనిస్తే, ఆ కిరణకాంతులు పండుని గిలిగింతపెట్టగా. వొచ్చే నూతన పరిమళాన్ని - ఏ హృదయానికి ఆ హృదయం తెలుసుకోవాలి. కవితా సంపద మన మనసుని ఎప్పుడూ సువిశాలం చేస్తుంది. హెలెన్‌కి చిన్నప్పటినుంచీ కవిత్వంపట్ల ఏర్పడ్డ మక్కువే, ఎప్పటికప్పుడు ఆమెకి నూతన బలాన్ని ప్రసాదిస్తూ వుండేది.

రోజులు గడిచినకొద్దీ హెలెన్‌కి, ప్రజలకి తను ఎంత చెయ్య గలనా అనీ తను ఎంతమేర చూడగలనా అనీ -

కుతూహలం ఏర్పడింది. జపాన్ దేశంనుంచి ఆమెకి ఆహ్వానం వచ్చింది. చిన్నతనంలో ఎప్పుడో చికాగో ప్రదర్శనలో తాను యీ జపాన్ దేశం గురించీ జపాన్ ప్రజలగురించీ తెలుసుకుంది. ప్రాచ్యఖండంలో అంధుల సంఖ్య మరీ ఎక్కువట. జపాన్ దేశం తనని ఆహ్వానించడం ఒకందుకు మంచిదే అనుకుంది. ఈ కార్యక్రమంలో తన టీచరు మృతినీ, తనని బాధిస్తున్న యీ వేదననీ కొంతవరకు మర్చిపోవచ్చుననీ, అందుకే భగవంతుడు తనకీ పని కల్పించివుంటాడనీ భావించింది.

ఇంగ్లాండునుంచి యింటికివచ్చి పాలీ తనూ జపాన్ దేశానికి ప్రయాణమయారు. దారిలో హోనోలూలూవద్దఆగి (Honolulu) హవాయ్‌లోని అంధులకి ఒక సంక్షేమ సమితిని ఏర్పరిచేందుకుగాను అక్కడి ప్రభుత్వాన్ని అర్థించింది. మళ్ళీ ఓడఎక్కాక ప్రతి రోజూ వుదయం అయిదు గంటల నుంచీ రాత్రి పదిగంటలవరకూ పనిచేస్తూ, జపాను దేశంలో తను యివ్వవలసిన వుపన్యాసాలూ, తన కార్యక్రమం మొదలైనవాటికి సరిపడ్డ సామాగ్రి ఏర్పరచుకుంది. ఉపన్యాసాల్లో వుండే విషయం ఒక్కటే అయినా ఏదో కొంచెం కొత్తదనం కనపడాలి. పాత విషయాలే చెబుతున్నప్పటికీ నూతన పద్ధతిలో వాటిని కనపరచాలి. ఉపన్యాసాలు తయారు చేసుకు అవి చెప్పడానికి తగుశిక్షణపొందేది. వీటన్నిటిలోనూ పాలీథామ్సన్ ఆమెకి సహాయకారి. ఓడ ప్రయాణమప్పుడే 'గాన్ విత్ ది విండ్' (Gone with the wind) పుస్తకం పన్నెండు బ్రయిలీ సంపుటాలుగా ఆమెకి చేరింది.

రోజూ ఆ పుస్తకంలోని భాగాలు చదువుకుంటూ చిన్న తనంలో తను అలబామాలో గడిపినరోజులూ, అక్కడి ఎర్రమన్నూ, ఆ చెట్టూచేమా, గులాబీలూ, మల్లెలూ, తన తండ్రీ - అతని మిత్రులూ, సివిల్ వార్ కబుర్లు - క్రిస్మస్ పరిమళాలు - వీటన్నిటితో, ఆ పుస్తకం చదువుతున్నంత సేపూ. ఆమెకి తిరిగి అలబామాలో జీవిస్తున్నట్లుగా నేవుండేది. బాల్యస్మృతులతో ఆమెని ఆనందపరిచిన యింతటిగ్రంథం మరొకటి లేదు.

జపాన్ దేశంలో పర్యటిస్తూ రోజుకి నాలుగైదు చోట్ల వుపన్యాసాలు యిచ్చేది హెలెన్. అంధత్వానికి సంబంధించిన మూఢనమ్మకాలు విస్మరించమనీ, శాస్త్ర విజ్ఞానంతో యీ లోపాన్ని ఎదుర్కొనేందుకు తగు ప్రయత్నాలు చెయ్యాలని ప్రబోధిస్తూ, అంధులకోసం, విరాళాలు సేకరించేది. ప్రభుత్వపు అతిథిగా ఆమె జపాన్ దేశమంతా పర్యటించింది. సనాతనత్వానికీ ఆధునాతనత్వానికీ మధ్య జరుగుతున్న పోరాటం ఆమెకి ప్రతిచోటా ప్రత్యక్షమయింది. జపాన్ స్కూళ్ళలోని బాల బాలికలకి హెలెన్ కెల్లర్ గురించి ముందే తెలుసు కాని హెలెన్‌కి జపాన్ గురించి ఏమీ తెలియదు. కొన్ని చోట్ల ఆమె నడుస్తున్న దారంతా తమ దేశాచారప్రకారం పువ్వులు పరిచారు. ఒసాకాలోని 'లైట్ హౌవుసు' అను విద్యాసంస్థకి డైరెక్టరయిన టకెవో ఇవహాషి '(Takeo Iwahasi) హెలెన్‌కి స్నేహితుడు. అతను చిన్నపుడు యింజనీరింగ్ నేర్చుకున్నాడు. మూడైదేళ్ళపాట అతనికి అంధత్వంరాగానే ఆత్మహత్య

చేసుకోబోయాడు. ఆ ప్రయత్నంనుంచి అతన్ని తప్పించి ఎడింబరో పంపారు; కాలక్రమేణా ఎడింబరోలోని అంధుల పాఠశాలకి అతను ప్రిన్సిపాల్ అయాడు. తరువాత మాతృ దేశానికి తిరిగివచ్చి, బ్రయిలీపద్ధతిని జపాన్‌లోని అంధులకి అనువుగామార్చాడు. ఆ యివహోషిగురించి హెలెన్‌కి ముందే తెలుసు. వీరు జపాన్‌లో వున్నన్నాళ్ళూ అతను వెంట వుండి, ముఖ్యప్రదేశాలన్నింటికీ తీసుకెళ్ళాడు.

వేక్‌బివా, హాంటుయూసో, నారా - మొదలైన ప్రఖ్యాతస్థలాలకి యీమెని తీసుకెళ్ళారు. పద్మాసనుడైన బుద్ధుని విగ్రహం ముట్టకు చూడనిచ్చారు. ఇది హెలెన్ కెల్లర్ మొట్టమొదటి జపాన్ ప్రయాణం. ఆ తరువాత ఆమె ప్రపంచ పర్యటనలు చాలా సార్లు చేసింది.

# 9. వెస్ట్‌పోర్ట్

యానీ సల్లివాన్ మరణానంతరం, హెలెన్‌కి వెనకటి యింట్లో వుండ బుద్ధిపుట్టలేదు. పాలీ తనూ కానెక్టికట్ (Connecticut) లోని వెస్ట్‌పోర్ట్‌కి వచ్చారు. అక్కడ ఒక సంవత్సరంపాటు ప్రొఫెసర్ రాబర్ట్ యింట్లో గడిపారు. ఈ రాబర్ట్ పెత్తండ్రి అయిన గస్టవస్ (Gustavus) అక్కడికి దగ్గిరలోనే వున్నాడు. యితను అమెరికాలోని అంధుల సంస్థ (The American Foundation for the Blind) ట్రస్టీలలో ఒకడు. ఈయన పూనుకుని 1939 లో హెలెన్ కెల్లరూ పాలీ థామ్సనూ వుండేందుకుగాను విశాలమైన ఆవరణలో ఓ ఇల్లు కట్టించాడు. ఆ యింటికి ఆర్కాన్ రిడ్జి (Arcan Ridge) అని పేరు పెట్టి, హెలెనూ పాలీ ఆయింట్లో వుంటుండేవారు. ఎవరిసాయము లేకుండా తానొక్కర్తె సాయంత్రమపుడు షికారుకి వెడుతున్నప్పుడు ఆమె వెంట వారి పెంపుడుకుక్క ఒకటి(Shepherd Dog) ఆమెకి సాయంగా వెళ్తూండేది. హెలెన్‌ని బయటకి తీసుకెళ్లడం, యింటికి తీసుకురావడం ఆ కుక్క వంతు. మేడమీద వున్న హెలెన్ స్టడిలో ఎలక్ట్రిక్ బజ్జర్ అమర్చారు. దీనివలన కలిగే కదలికవల్ల హెలెన్‌కి తనకోసమెవరో అతిథి వచ్చారనో లేక, భోజనానికి టైమయిందనో తెలిసేది. వస్తున్నానని తిరిగి ఎలక్ట్రిక్ యంత్రం ద్వారానే చెప్పి క్రిందికి వెళ్లేది. జనసమ్మర్దం మధ్య, పట్టణాల్లోనూ రైళ్లలోనూ గడిపివచ్చిన హెలెన్‌కి యీ ప్రశాంత వాతావరణం ఎంతో బాగుంది.

మార్దవమైన శబ్దాలతో పట్టు కుచ్చువంటి పసరికతో వివిధ పరిమళాలు వెదజల్లే యీ చక్కటి పరిసరాలలో ఆమె ఎంతో హాయిగా యిమిడి పోగలిగింది.

ప్రొఫెసర్ రాబర్ట్సూ అతని భార్యా వీరింటికి తరచు వస్తూండేవారు. హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా వున్న గేటానో (Gaetano) వీరికి ఆసమయంలోనే పరిచయమయ్యాడు. ఈయన తిరిగి ఫ్లారెన్సు విశ్వవిద్యాలయానికి వెళ్లి పోదామను కుంటున్నాడు. ఇటాలియన్ నాగరికత విషయంలో యీయన ఒక అథారిటీ. ఫ్లారెంటిన్ సంస్కృతికి, అక్కడి సమాజ వికాసానికి యీయన ప్రతిబింబమూఅని భావించేవారట. ఒకసారి యితను ముసులోనితో క త్తియుద్ధానికి పూనుకొని, అతనివల్ల అరెస్టు కాబడి, విడుదల అనంతరం యిటలీనుంచి పారిపోయివచ్చాడు. ప్లూటార్క్ (Plutarch) చెప్పినట్లు ఆత్మలనునవి ఏవోనింప వలసిన పాత్రలు కావనీ, వెలిగించ వలసిన జ్యోతులనీ ఈ గేటానో భావించేవాడు. ముసులోని ఎంత తొందరగా పడిపోతే, యిటాలియన్‌లకి అంత క్షేమదాయకం అని తొణుకు బెణుకులు లేకుండా అనేవాడు. న్యాయజీవనాన్ని ప్రజాసంక్షేమాన్ని అభివృద్ధిపరచగల అవకాశం ఏది కనబడినా తను తల వాకిట నిలబడి తన అభిప్రాయాలు గొంతెత్తి చెప్పేవాడు. ఫాసిస్టు గొడ్డలి మానవత్వాన్ని శిరఃఖండన చేయడానికి పూనుకుంది అనేవాడు - ఫ్రెంచి మహావిప్లవం గురించి బ్రహ్మాండమయిన చారిత్రక గ్రంథం రాసిన యీ ప్రఖ్యాత రచయిత, 'ఏవిషయాన్నయినా సరే మనసు స్పష్టంగా

చూడలేదంటే అది వ్యక్తిలోగల నైతిక లోపమన్నమాట, సుస్పష్టత అనునది మనసుకిగల వుత్తమనైతిక లక్షణం," అని సెయింట్ జెస్టు (St. Just) పద్దెనిమిదోశతాబ్దంలో చెప్పిన పలుకుల ప్రకారం నడుచుకుంటూ సుఖం ఎట్లా వుంటుందో తనకి తాను తెలుసు కున్నాడు (Discovred Happiness) ఈ గెటానో. చుట్టూవున్న మిత్రులూ గేటానో వంటి తాత్వికోపదేశకుడు హెలెన్ కెల్లర్ జీవితానికి సంతోష సామరస్యాలు చేకూర్చడానికి సహాయభూతుల య్యారు. "వారసత్వమూ, సంప్రదాయమూ, పురాతన చిహ్నాలు లేని యీ అమెరికన్ ప్రజలు యిప్పుడు వాటి కోసం పాకులాడటం చూస్తే నవ్వొస్తుంది, యీ ప్రపంచ మంతా 'బట్స్'తో (Buts) కూడుకుని వుంది. నేను మిత వాదిని (Liberal) కాని...మితవాదినని చెప్పుకునేందుకు సిగ్గుపడుతున్నాను. నేను సోషలిస్టుని కాని...అంటూ యీ 'కానులు' అన్నిచోట్లా ప్రత్యక్షమవుతున్నాయి. నేను యిటలీ దేశస్థుణ్ణి. మీ దృష్టిలోనాకు దేశభక్తి లేకపోవచ్చు. నేననేది ఏమిటంటే, యిప్పుడు ఆదేశంలో రాజకీయ పరిజ్ఞానమూ ఆర్థిక న్యాయశాస్త్ర విలువలూ సామాన్య వివేకమూ నశించాయని. అంతమాత్రాన దేశం అథఃపాతాళానికిపోదు. వీటన్నిటితోసరి తూగగల మానవత్వపు విలువ యిటాలియన్ ప్రజలకి యింకావుంది," అనేవాడు గెటానో. ఇటువంటి నిశితదృష్టి కొద్ది మందికే గాని అందరికీ వుండదు కదా. ఆ రోజుల్లోనే హెలెన్ కెల్లర్ డేవిడ్సన్ అను ప్రఖ్యాత శిల్పిని కలుసుకోవడం జరిగింది. డేవిడ్సన్

బాల్యంలోనే అంధుల మాన్యుయల్ ఆల్ఫబెట్, శిల్పవిద్య నేర్చుకుంటున్న తన మిత్రుడొకనికోసం నేర్చుకున్నాడు. డేవిడ్ సన్ హెలెన్ తో పరిచయం అయీఅవగానే, తనమనో భావాలు - ఆమెకి అరిచేతులో రాసి చెప్పాడు. ఈ కారణంగా హెలెన్ కి అతను ఎంతో దగ్గరవాడయాడు. ఇద్దరూ మాట్లాడుకోనేందుకు మధ్య మూడోమనిషి అక్కర్లేదు. హెలెన్ కెల్లర్ ని కలుసుకునే నాటికే డేవిడ్ సన్, థామస్ పెయిన్, వాల్ట్ విట్ మాన్, థోరోల శిల్పప్రతిమలు చేసి వున్నాడు. గేటానో అతనూ చాలకాలంగా మిత్రులు. చిరకాలం ఫ్రాన్సులో గడిపే డేవిడ్ సన్ కి ఫ్రెంచివారి పట్ల, యిటాలియన్ల పట్ల అమిత గౌరవం. "ఫ్రాన్సులోగాని, యిటలీలోగాని ఎవరిని కదపండి, - ఎవరో ఒక కళాకారునితో సన్నిహిత బాంధవ్యం లేని కుటుంబ మంటూ వుండదు మొత్తంమీద" అనేవాడు డేవిడ్ సన్. యాంగ్లో సాగ్జనులు పైకిమాటలేగాని కళాభిరుచి విషయంలో దూరంగా జరుగుతారట.

డేవిడ్ సన్ హెలెన్ ని కలుసుకోడమేమిటీ, కలుసుకున్న పదినిమషాలకే, పాలీథామ్సనుతో పెన్సిల్ వేనియాలోని తనఫారమ్ హౌసుకి హెలెనూ ఆమె రావలసిందనీ కెల్లర్ శిలాప్రతిమ తను చెయ్యాలనుకుంటున్నాననీ అన్నాడు. డేవిడ్ సన్ స్టూడియో ప్రవేశించేసరికి హెలెన్ కెల్లర్ కి ఏదో కాంతిమయలోకంలోనికి తను వచ్చినట్లుగా వుంది. అతను చేసిన శిలాప్రతిమలన్నీ ఒకటి తర్వాత ఒకటి వేలి కొనలతో స్పృశించి తెలుసుకుంది. ఐన్ స్టీన్ శిలాప్రతిమ

దగ్గరకొచ్చేసరికి డేవిడ్ సన్ అన్నాడు: 'అతనొక పద్యం వంటివాడు. అతని జీవితమే ఒక సాహసయాత్ర' హెలెన్ కీ అతనికీ కూడా ఐన్ స్టిన్ పట్ల అమిత గౌరవం. డేవిడ్ సన్ అంతవరకూ హెలెన్ కెల్లర్ గురించి వినడమే గాని ఆమె ప్రతిభని ప్రత్యక్షంగా చూడలేదు. ముఖ్యంగా ఐన్ స్టిన్ శిలా ప్రతిమ వద్దకి వచ్చి ఆమె వెలిబుచ్చిన భావం, డేవిడ్ సన్ కి ఆమె పట్ల ఎంతో గౌరవం కలిగ చేసింది. హెలెన్ కెల్లర్ తన ఆత్మకథలో యీ స్టుడియో ప్రయాణం గురించి యిలా రాసుకుంది, డేవిడ్ సన్ కి ఆమె రాసిన హంశాలుట. 'నేను మీ స్టుడియోలో అడుగు పెట్టేదాకా మూకాంధుల ప్రపంచానికే పరిచితురాలిని. లోనప్రవేశించి మీ బ్రహ్మాండమయిన శిలాఖండాలు, వాటి సౌందర్య ప్రతిభ తెలుసుకోడంతో నాలోని అజ్ఞానం కొంత హరించుకు పోయింది. నాకు అర్థంకాని ఆధ్యాత్మికానందం నన్నావహించింది. ఇన్నాళ్లబట్టి లోన వెలుగుతున్న వెలుగు నాకుదారి చూపుతున్నట్లు అయింది.' హెలెన్ కెల్లర్ కి లలితకళలు అన్నిటిపట్లా యిష్టమేగాని కవిత్వమూ శిల్పమూ ఆమెని ప్రత్యేకంగా ఆకర్షించాయి. శిల్పసౌందర్యంవొంపులలోని అందాన్నిబట్టి తెలుసుకో వచ్చుట, ముఖ్యంగా తనవంటి బధిరాంధులకి శిలాప్రతిమల్లోని వొంపులు ప్రత్యేకమయిన ఆనందాన్ని సమకూరుస్తాయట. డేవిడ్ సన్ పరిచయంతో హెలెన్ కెల్లర్ కి శిల్పకళా ప్రపంచంతో దగ్గర బాంధవ్యం ఏర్పడింది.

ఒకసారి యూరప్ వెళ్లినపుడు గ్రీకు యిటలీ దేశాల్లోని శిల్పకళాఖండాలన్నీ చేతితో తాకి చూసింది. డయానా విగ్రహం చూస్తున్నపుడు ఆమెకి వెన్నులోంచి దడవచ్చిందట. వీనస్ ప్రతిమ దేహసౌందర్యానికి ఆఖరి మాటగా అవుపడిందట. ఆయాశిల్పాలలోని సాహసమూ, క్రోధమూ, ప్రణయమూ, నాజూకూ స్వాతంత్ర్యాభిలాష,-ఇటువంటివన్నీ వేలికొనలతో స్పృశించి గ్రహించగలిగింది హెలెన్.

"నా వేళ్లతో నేను శిల్పఖండాన్నంతా తెలుసుకోలేను. కొన్ని కొన్ని భాగాలుమాత్రమే తెలుస్తాయి. ఈ భాగాలన్నిటిని ఒకటిగా పేర్చి చూడటం నామనసు నేర్చుకుంది. కొన్ని సౌందర్యాలు కళ్లతో చూడ్డం కంటె చేతులతో స్పృశించి తెలుసుకోడంలో తీవ్రానుభూతి కలుగుతుంది'' అంది ఆమె. ఆమె వెంటనున్న గిభర్ట్ అను ప్రఖ్యాత కళాకారుడు "మామూలు కళ్లు చూడలేని అందాలు హెలెన్ తన వేళ్లతోచూసి తెలుసుకోగలుగుతోంది. ఈ శిల్పకళాసందర్శనంలో ఆమె పొందిన ఆనందం నేను ప్రత్యక్షంగా చూశాను కనక ఆ సంగతి చెప్పగలుగుతున్నాను,'' అన్నాడు. పారిస్‌లోని రోడిన్ (Rodin) మ్యూజియమ్ కెళ్లి గంటలకి గంటలు గడిపిందట హెలెన్. థింకర్ శిల్పం చూసి, మనసు తన కట్టడులు తెంచుకు స్వాతంత్ర్యమైపుగా పరువు లెత్తడం ఆ కళా ఖండంలోని ప్రతి అవయవంలోనూ కనపడు తోందంది. మొట్ట మొదటి సారి తన టీచరు యానీ సల్లివాన్ 'నీరు' అనేదాన్ని తనకి

పరిచయం చేసినపుడు కలిగిన అనుభూతి వంటిదే, – థింకర్ శిల్పాన్ని చూడగా కలిగిందట. ఈ 'నీరు' అనేమాట తనని చీకటి నుంచి వెలుగులోకి తీసుకొచ్చేందుకు దీపకాంతి అయింది. అదే ప్రకారం రోడిన్‌లోని శిల్పకళా ప్రతిభ నిర్జీవమైన రాతినుంచి జీవంతో భాసిల్లే యీ శిల్పప్రతిమని సృష్టించ గలిగింది – అంటుంది.

శిల్పకళ కారణంగా హెలెన్ కెల్లరూ డేవిడ్‌సనూ మిత్రులయ్యారు. కళా ప్రపంచంలోనే కాక రాజకీయ సామాజిక దృక్పథంలో కూడా వారిది ఏకాభిప్రాయం. తామిద్దరూ ప్రపంచపౌరులు. మానవాభ్యుదయమే తమ లక్ష్యం, మానవత్వమే తమ మతము.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో హెలెన్ కెల్లరూ డేవిడ్‌సనూ ఫిలడల్ఫియాలోని 'నేవల్ హాస్పిటల్' దర్శించడానికి కలిసి వెళ్లారు. రూజ్‌వెల్టు నాలుగోసారి ప్రెసిడెంట్ అయినపుడు, ఆనాటి ప్రారంభోత్సవానికి కూడా యిద్దరూ కలిసే వెళ్లారు. 1950 లో హెలెన్ కెల్లర్, పాలీ థామ్సన్, డేవిడ్‌సన్, అతని భార్య ఫ్లోరెన్సు – వీరు నలుగురూ ఫ్రాన్సువచ్చారు. యాభై సంవత్సరాల నిరంతర కృషి తరువాత హెలెన్ కెల్లర్‌కి 'హాలీడే' అనునది లభించింది. వెనక ఎప్పుడు బయలుదేరినా, వుపన్యాసాలు యివ్వడానికి, విరాళాలు పోగు చెయ్యడానికీ తప్ప విశ్రాంతి అంటూ వుండేదికాదు. ఈ సారి నిజమైన విశ్రాంతిని వాంఛిస్తూ – నలుగురూ బయలుదేరారు. డేవిడ్‌సన్‌కి టూర్సు (Tours) పట్టణానికి పధ్నాలుగుమైళ్ల దూరాన ఒక చక్కటి

పురాతన భవనముంది. అక్కడ కొన్నాళ్ల పాటు గడుపుదామని వచ్చారు. హెలెన్ కెల్లర్ డెబ్భయ్యో జన్మ దినం నాడు డేవిడ్‌సన్ ఆమెనీ పాలీనీ తన కాన్వాస్ మీద చిత్రిస్తానన్నాడు. బ్రహ్మాండమైన కాన్వాస్ మీద యీ యిద్దరూ నిల్చున్న పోజులో చిత్రరచన ప్రారంభించాడు. రోజూ రెండు గంటలసేపు యీ పెయింటింగ్ వర్క్ చేసి, మిగతా టైములో ఆచుట్టుపట్ల ప్రదేశాలు చూసి వస్తూండేవారు. ఎర్రటి పాపీలూ, నీలపురంగు కారన్ ఫ్లవర్సు, ఆకాశంలోకి రివ్వున ఎగిరే పక్షులూ, పంట పొలాల వైపుగా సాయంత్రంవేళ షికారూ-ఫలవృక్షాలు పళ్ల బరువుకి వొంగడం, తోటలో కాలక్షేపం, స్ట్రాబెర్రీసు, తోటలో కూచుని టీ తాగడం - వీటన్నిటితో రోజులు ఎంతో హాయిగా దొర్లిపోతున్నాయి. "హెలెన్ ఎప్పుడూ హృదయంలోనించి మాట్లాడుతుంది. అందుచేతనే ఆమె ప్రతి మాటా భావయుక్తంగా అంతబాగుంటుంది" అనేవాడు డేవిడ్‌సన్. బాల్‌జాక్, రాఫెల్, మొదలైన ఫ్రెంచి రచయితలు జీవించిన ప్రదేశాలు చూసి వస్తూండేవారు. పాలీ థామ్సన్ హెచ్. జి. వెల్సు రాసిన 'ఎక్సపర్‌మెంటు యిన్ ఆటోబయాగ్రఫే' చదువుకుంటూండగా, హెలెన్ బ్రెయిలీలో వచ్చిన యనటోల్ ఫ్రాన్సు రచనలతో ముగ్ధురాలయేది. ఒకసారి రెండు మూడు పుస్తకాలు ప్రారంభించి, ఇది కొంతా అది కొంతా చొప్పున గబగబా చదవేస్తూండేవారుట. "హెలెన్ కెల్లర్ పాలీ థామ్సన్‌లతో కొన్నాళ్ల పాటు గడపగలగడం నిజంగా నా అదృష్టం. హెలెన్‌లో

సహజంగాగల సంతోషం, ఎల్లవేళలా పైకిపొంగి పొర లుతూ వుంటుంది. ఆ సంతోష కాంతులు చుట్టూవున్న వారిపై ప్రసరించి వారిలో ఏదో అనిర్వచనీయమైన తృప్తిని తీసుకొస్తాంటాయి. ఇది నాకొకనూతనానుభవం. ప్రతిరోజూ భోజనాల బల్లదగ్గిర ఆ గంటా గంటన్నరా ఎంత ఆనంద మయంగా గడిచి పోతున్నదో మాటల్లోకి మార్చి చెప్పలేను,'' అంటూ రాస్తుంది నాకు డేవిడ్ సన్ భార్య ఫ్లారెన్సు,

డేవిడ్ సన్ దంపతులు హెలెన్ కెల్లర్ నీ పాలీ థామ్సన్నీ జెనోవా (Genoa) తీసుకెళ్లారు. అక్కడినుంచిఫ్లారెన్సు వెళ్లారు. ఫ్లారెన్సులో శాల్వేమిని (Salvemine) వీరి రాకకోసం ఎదురుచూస్తున్నాడు. అక్కడి శిల్పకళా ఖండా లని హెలెన్ కి చూపేందుకు ఏర్పాట్లు చేసి వుంచాడు శాల్వే మిని. చాల ఎత్తుగా వున్న విగ్రహాలు యీామె ముట్టుకు చూసేందుకుగాను ప్రత్యేకమయిన మంచె (Scaffold) ఏర్పాటుచేశాడు. 'జాన్ ది బాప్టిస్టు' పాట పాడుతున్న డొనెటెల్లో విగ్రహం చూసి, హెలెన్ ముగ్ధురాలయింది. 'మేడొన్నా అండు ఛైల్డ్' చూసి, తనలో తను ఆనంద పడింది. ఆతరువాత మెడిసీ సమాధులువున్న చాపల్ కి వెళ్లారు. డేవిడ్ సన్ కూడా, యీ శిల్పకళా ఖండాలని యీామె యింత శ్రద్ధగా గమనించడం యింతకి పూర్వం చూడలేదు. శిల్పప్రతిమలోని ప్రతివంపునీ చేతివేళ్లే నేత్రాలై చూస్తున్నట్టుగా పరిశీలించేది. అందరికీ రెండు కళ్లువుంటే యీామెకి పదికళ్లున్నాయి శిల్పకళ విషయంలో—

అని అభినందించాడు శాల్వేమిని. మానవగౌరవాన్ని 'మైకేల్ యాంజిలోకిమల్లే గొప్పగా తెలుసుకుంది యీమె. ఒక అవకరముండటంతో ఆ అవకరం మనసుకి ఏదో నూతనశక్తినిచ్చి, మానవాళిని ఎంతో సానుభూతితో అర్థం చేసుకోనిచ్చి, విశిష్టతవైపుగా సౌందర్యదృష్టిని తిప్పుతుంది.

# 10. డైరీనుంచి

వెస్ట్‌పోర్టులో వుండగా నేను అప్పుడూ అప్పుడూ నా డైరీలో రాసుకున్న విషయాలివి. ఈ అభిప్రాయాలు వేటి కవి చదువుకోవలసిందే గాని ఒకటిగా గుచ్చెత్తి చెప్పేం దుకు వీటిలో క్రమత ఏమీ లేదు.

## 1944 - జూలై

ఇవ్వాళ బ్లూబెర్రీస్ కోసేందుకు హెలెన్ బయటికి వెళ్ళింది. పండు తగిలీ తగలగానే అది పక్వానికి వచ్చిందీ లేనిదీ స్పర్శవల్ల తెలుసుకో గలిగిన నేర్పు వుంది హెలెన్‌కి.

ఆర్కాన్‌రిడ్జిలోని వారి తోటదారులన్నీ పరిశుభ్రంగా వుంటాయి. అవిపరిశుభ్రంగా వుంచేందుకు హెలెన్ ఎంతో శ్రమ పడుతుంది. వేసవికాలంలో వుదయం అయిదు గంటలకి లేచి అక్కడి చెత్తా చెదారం తీసి బాగుచేసేది. పూల మొక్కకి చీడపురుగు పడితే అది యిట్టే గ్రహించగలదు. తోటపనిలో హెర్బర్ట్ ఆమె సాయంగా వుంటాడు.

హెర్బర్ట్‌హాస్ ముఖ్యపాత్రలలో ఒకడు. కారు డ్రయివ్ చెయ్యటం, తోటపనిలో సాయంచెయ్యటం, కంపా కంచె సరిగా వున్నదీ లేనిదీ చూడటం మాన్యుయల్ ఆల్ఫబెట్ తెలుసు కనక హెలెన్ వ్యాసాలూ, వుత్తరాలూ తర్జుమా చెయ్యడం - యివి అతని నిత్యకృత్యపు పనులు,

ఇవ్వాళ మాయింటికి హెలెన్ భోజనానికి వచ్చింది. వస్తూ తనవెంట చదరంగంబోర్డు తీసుకొచ్చింది. ఎడ్మండ్

స్టెడ్‌మాన్ 1888 లో, అంటే యాభై ఏడేళ్ళక్రితం హెలెన్ కెల్లర్ మీద రాసిన గేయం - ఆమెకి చదివాను. ఈ ఎడ్మండ్, లింకన్ మీదగూడా 1865 లో ఒక ప్రఖ్యాత గేయం రాశాడు. మరో శతాబ్దపు మధ్యభాగానికి వస్తున్న సమయంలో నేను ఆ వెనుకటిగేయం చదివేసరికి హెలెన్ కెల్లర్ కళ్లు చెమర్చాయి. రాబర్ట్‌ఫ్రాస్ట్ - ఎడ్మండ్ స్టెడ్‌మెన్ యీామెమీాగ కవిత్వం అల్లేనాటికి, కవిత్వం వెనకవరసల్లోకి వెళ్ళిపోక, యింకా ఏదో కొద్దిపాటి ప్రజాదరణ పొందుతున్న రోజులు.

## ఆగస్టు

ఇవ్వాళ ప్రొఫెసర్ రాబర్ట్ యింట్లో, హెలెన్‌కీ శాల్యేమినికీ విందు. ఫ్లారెంటిన్ వాస్తవ్యురాలైన మిసెస్ రాబర్ట్ ఒక యిటాలియన్ పాట పాడింది. హెలెన్ తన ఎడమచేతిని పియానోపై నవుంచి కుడిచేత్తో శబ్దవిన్యాసాలు ఎంతో చక్కగా గ్రహించ గలిగింది. పియానోనుంచి నేల మీాదకి వెళ్ళిన యీా కంపనములు ఆమె తన వేలికొనలతో గ్రహించి అది ఏ పాటో చెప్పగలిగేది.

ఒకసారి ఎవరో ఆమెని - రాత్రికీ పొగలుకీ మీాకు భేదం ఎలా తెలుస్తుంది? - అని అడిగారు. "ఓ దానికేమిటి, పగటివేళ వాయువు తేలిగ్గానూ, వాసనలు మరీ తేలిగ్గానూ వుంటాయి. వాతావరణంలో కదలికా శబ్దకంపనాల తీవ్రతాకూడా ఎక్కువే. సాయంత్రం పడేసరికి యీా శబ్ద

కంపనాలు తగ్గుతాయి. గాలికూడా చిక్కనవుతుంది. చుట్టూగల వస్తువుల్లో కదలిక తగ్గుతుంది.''

''రంగులు మీకెలా తెలుస్తాయి?'' అన్నారు మరొకరు. ఎరుపు వెచ్చదనాన్ని, పింక్ లేత గులాబీ మొగ్గలనీ, ఆకుపచ్చ అప్పుడే ఎదుగుతున్న మొక్కలనీ, పర్పుల్ భావ తీవ్రతనీ, పసుపు సొగసునీ సూర్యకాంతినీ సంతోష భారాన్ని, నీలం ఆకాశాన్ని గాలిని అవకాశాన్ని సూచిస్తాయట.

పాలీ థామ్సన్ వివరించింది: ఇవన్నీ ఆమెకి పుస్తకాలు చదవడంవల్ల ఏర్పడ్డ మనోముద్రలని. హెలెన్‌కి నలుపుతప్ప మరే యితరరంగూ సంతాపాన్ని, విషాదాన్ని సూచించేవి కాదుట. నలుపురంగు ఆమె మనసులో తప్పుడు పనులకీ, పాపకర్మలకీ చిహ్నంగా నిల్చిపోయింది. వాటితో పాటు ఏకాంతతకీ ప్రశాంతతకీ కూడా నల్లదనం సన్నిహితమైనది. ''అంధ బాలునికి నల్లదనం ఒక ప్రేమమయ లోకం. అతనికి ఆ నలుపులో భయం గొలిపేది ఏమీ కనపడదు. ఆ నలుపు అతనికి చిరపరిచితమైన ప్రపంచం.''

## సెప్టెంబరు 1944

హోటల్ యాస్టర్‌లో (న్యూయార్క్) జరిగిన ఒక రాజకీయ సమావేశానికి హెలెన్ కెల్లరూ పాలీ థామ్సనూ ఆహ్వానితులై వెళ్లారు. అప్పుడే లండన్ నుంచి వచ్చిన మారీమేవరిక్ (Maury Maverick) యుద్ధ సమయంలో ఇంగ్లీషు సర్జనులు చూపుతున్న అపారప్రజ్ఞకి -

అభినందనలు తెలుపుతూండగా వీరు విన్నారు. వాషింగ్‌టన్‌నుంచి వుపాధ్యక్షుడు ట్రూమెన్ కూడా వచ్చాడా రోజున. ఆయనొక చిన్న వుపన్యాసమిచ్చాడు, వీరందరూ ట్రూమెన్‌కి పరిచయంచేయబడ్డారు. హెలెన్ ట్రూమెన్‌తో కరస్పర్శ చేసినతరువాత, "అతని చెయ్యి అతి స్పష్టంగావుంది. అతనిదెప్పుడూ ఒకే రాజబాట" అని రకాలున చెప్పేసింది. ట్రూమెన్ హెలెన్‌నిచూసి కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. ఆమె తన అవరోధాలు ఎంత గొప్పగా జయించుకు వస్తోందోకదా - అని తనలో తను అనుకున్నాడు.

## జనవరి 1945

తను రూజ్‌వెల్ట్‌ని వైట్‌హౌసులో కలుసుకున్నానని హెలెన్ రాసింది, ఆమె అంటుంది: "అలిసిపోయిన అతని ముఖంలో యీ భూమండలపు ప్రజలను, దొంగలముఠాల నుంచి రక్షించాలనీ ఆకలి మృగాలకి అమాయకప్రజలు ఆహుతి కాకుండా కాపాడాలనీ ఒక మహత్తరదీక్ష కనపడుతుంది. ఆయన ధైర్యసాహసాలు. వెనకటి హెరుకూల్సు శక్తితో పోల్చదగినవి, చుట్టూవున్న మరిగుజ్జుమనుషుల్లో అతనొక ఆజానుబాహువు. ఆయన మనసు మనవాళ్ళ క్షేమంకోసం అంకితమై పోయింది."

రూజ్‌వెల్ట్ నాలుగోసారి అధ్యక్షపదవి నలంకరించిన సందర్భంలో జరిగిన ప్రారంభోత్సవానికి యీ మెకూడా వెళ్ళింది. మంచుపడుతున్న చెట్టుకీడని నిలబడి ఆ వైట్‌హౌసు మహోత్సవాన్ని వీక్షించింది. పాలీథామ్సన్ ఆమె

వెంట ఎప్పుడూ వుండవలసిందేకదా! డేవిడ్‌సన్ ఆ రోజున అమెరికాదేశపు అడ్వకేట్ జనరల్ ఫ్రాన్సిస్ బిడిల్‌కీ (Francis Biddle), లార్డ్ హాలీఫాక్సుకీ(Lord Halifax) కొందరు ప్రఖ్యాత సెనేటర్లకీ పరిచయం చేశాడు వీరిద్దరినీ. రాజకీయ ప్రపంచంలోకి వచ్చేందుకు మానవ హృదంతరాళంలో గల వుద్దేశాలనీ వారిని అటుగా తిప్పే ప్రభావాలనీ గురించి నాతో తర్కించింది హెలెన్ కెల్లర్ - అన్నాడు డేవిడ్‌సన్ తను కలుసుకున్న వివిధ ప్రవృత్తుల వ్యక్తులని జ్ఞప్తిలో పెట్టుకు.

ప్రారంభోత్సవ కార్యక్రమం అయిపోయాక సాయింత్రం న్యాయాధిపతి హ్యూగోయింట్లో వీరికి విందు జరుగుతుంది. ఆ రోజు భోజనాలబల్ల దగ్గిర అనేక విషయాల ప్రస్తావన వస్తుంది. అమెరికా రష్యాదేశాలు రెండు విభిన్న మార్గాలప్రయాణం చేస్తున్నా అవి ఏకలక్ష్యాన్ని ఏనాటికైనా చేరుకోలేక పోతాయా, ఆర్థికనిర్ణయాలూ, వ్యక్తి బాధ్యతలూ గురించి ఏకాభిప్రాయం కుదరకపోతుందా అని అందరూ ఆశాజనకంగా అభిప్రాయాలు వెలిబుచ్చారు.

హెలెన్ వ్రాసింది నాకు: "నేనూ పాలీ యిప్పుడు ఒక హాస్పటల్‌నుంచి మరొక హాస్పటల్‌కి ప్రయాణం చేస్తున్నాము. ఒక సాహస చరిత్రలో (Epic) పాత్రధారులమై జీవిస్తున్నాము. ఈ వీరోచిత కావ్యాలముందు ఇలియడ్సూ, ఈనియడ్సూ పేలవంగా కనపడుతున్నాయి. (సివిల్‌వార్ జరుగుతున్నపుడు వాల్ట్‌విట్‌మాన్ ఆస్పత్రులన్నీ సందర్శించి యిదే మాదిరిగా అన్నాడు) ప్రతిచోటా ప్రజలకి జరిగిన

అన్యాయాన్ని నివారించేందుకు ప్రయత్నాలు జరుగుతు న్నాయి. కొండలోయల్లో వైద్యశాలలు నిర్మించాల్సి వచ్చింది. హాస్పటల్స్‌లోనివారికి ఆత్మబలంపోయింది. జీవితం పట్ల విశ్వాసంపోయింది, తాము బ్రతికివుండి ప్రయోజనం లేదను దుర్భరబాధ వారిని పీడిస్తోంది. రకరకాల అంగ వైకల్యాలతో మానవులు అతిజాలిగా పడివున్నారక్కడ. ఒకవంక అంగ వైకల్యం, మరొకవైపున యింకిపోయిన కన్నీళ్ళు. జీవితంపట్ల ఆశ చిగురింపచేసే వుదయకాంతి కను చూపుమేరలో లేదు. ఈ మాదిరి అవస్త యిక్కడొక్క చోటనేకాదు. లోక ప్రజలందరూ పడుతున్నారు. దీనాతి దీనమైన మూగవేదన అది. ఈ వేదనా, యీ బాధ తరు వాత శాంతి లభించక పోతుందా అని ఏదో గాఢతర విశ్వాసం.

"ఇంతటిబాధలోనూ ప్రజలలోగల ఐకమత్యం, ముఖ్యంగా పెద్దపెద్ద డాక్టర్లూ, సర్జనులూ మానవుని బాధల పట్ల చూపుతున్న ఓర్పు, ఒక్కుమ్మడిగా పనిచేసి, వారు కని పెడుతున్న శాస్త్ర పరిశోధనలు, వికలాంగులని మళ్లీ మానవులుగా మార్చాలనే వారి కార్యదీక్ష, విశ్రాంతి నెర గని ఆ మానవోత్తముల నిరంతరకృషి - నన్ను ఆశ్చర్యపరి చాయి. అంతటి వుపద్రవంలో గాని - యింతటి ఐకమత్యం రాదా? నిద్రాణమైనశక్తులు, ప్రతిభావిశేషాలు యిటువంటి విపత్కర పరిస్తితుల్లోగాని బయటపడవా?"

జార్జియాలోని థామస్ విల్లీలోవుండగా రూజ్‌వెల్ట్ మరణవార్త వింది హెలెన్. అది నౌకాశాఖకి చెందిన

ఆస్పత్రి. హెలెన్ కెల్లరూ పాలీథామ్సనూ రేర్ ఎడ్మిరల్ జేమ్సుతో ఆస్పత్రిని సందర్శిస్తున్నారు. రేర్ ఎడ్మిరల్‌ని టెలిఫోన్ దగ్గిరకు రమ్మని ఎవరో పిల్చారుట. అతను వెళ్ళి వచ్చి, "మన ప్రెశిడెంటు మరణించాడు," అని అనేసరికి, అక్కడినావికులందరూ - తాము కుంటి వాళ్ళయినట్లూ, నోట మాటరానట్లూఅయిపోయారట. మానవజాతికొక నూతన మార్గంచూపిద్దామనీ, ప్రజలు కొంత వుత్తమవర్తనతోనూ స్వాతంత్ర్యాభిరుచితోనూ మసలగలసంఘం నిర్మిద్దామనీ కలలుగన్న రూజ్ వెల్ట్ - మధ్యలో రాలిపోయాడు. "రూజ్ వెల్ట్ రాజకీయ స్వప్నాలకీ ఆయన ప్రారంభించిన బృహత్ ప్రయత్నాలకీ ప్రస్తుత ప్రపంచానికీ ఆ మహానుభావుని మరణమొక గొడ్డలిపెట్టు, ఈ శూన్యత్వాన్ని పూడ్చగల వ్యక్తి మరొకరు లేరు."

## ఆగస్టు

బూకర్ టి వాషింగ్‌టన్ రాసిన అప్ ఫ్రమ్ స్లేవరీ (Up From Slavery) అను పుస్తకం చదివారా? అని - నేను అడిగాను. ఆమెకి నీగ్రోలలో డాక్టర్ కేర్‌వర్ అంటే గొప్ప అభిమానం. ఆయన అక్షరాలా ఏసుప్రభువు వంటి వాడు. పెద్ద పెద్ద వుద్యోగాలు కాలదన్ని - తన పరిశోధనా ఫలితాలన్నీ ప్రజాబాహుళ్యానికి పంచిపెట్టిన శాస్త్రకోవిదుడు. అతను అక్షరాలా దేవదూతే - అనేది.

హెలెన్ మనసులో రంగువిభేదాలు వుండేవికాదు. మానవులందరూ ఒకటేననుభావం ఆమెకి చిన్నప్పటినుంచీ

పెర్కిన్స్ సంస్థలో విద్యార్థినిగా వున్న రోజులప్పటినుంచీ మనసులో గట్టిగా పాతుకు పోయింది. సహజంగా అంధు రాలయినట్లే - రంగు భేదం విషయంలో కూడా ఆమె అంధు రాలు అన్నాడు డు బయిస్ - (Do Bois). ఈమె చిన్న తనంలో ఒకసారి ఆలబామాలో తనూ - యానీ సల్లివాన్ తమయింట్లో పని చేస్తున్న నీగ్రోనర్సూ ముగ్గురూ బయటకి వెళ్లినపుడు, ఐస్‌క్రీమ్ నీగ్రో అమ్మాయికి సర్వ్ చెయ్య నన్న కారణాన - యానీసల్లివాన్ కూడా ఆ ప్రదేశంలో ఐస్‌క్రీమ్ పుచ్చుకునేందుకు నిరాకరించి, తన విద్యార్థినిని కూడా బయటకి తీసుకొచ్చింది. చిన్నతనంలో జరిగిన యీ సంఘటన హెలెన్ మనసుమీద ఘట్టిముద్ర వేసుకు నుంటుంది.

## సెప్టెంబరు

ఈ రోజు ఆర్కాన్ రిడ్జిలో స్కాట్లాండు దేశపు వాతావరణం కనబడుతోంది. 1914 నుంచి హెలెన్ వెంట వుంటోన్న పాలీ థామ్సన్, ఈ రోజున ఎప్పుడూ లేనంత సంతోషంగా వుంది. స్మిత్ కాలేజీ ప్రెసిడెంటయిన విలియమ్ నీల్సన్ ఈ సాయంత్రం భోజనానికి వస్తారుట. హెలెన్ రాడ్ క్లిఫ్‌లో చదువుకుంటున్నపుడు యీ నీల్సన్ అక్కడి అధ్యాపకులలో వొకడు. హెలెన్‌తో సంభాషించేందుకు గాను ఆయన ప్రత్యేకంగా మాన్యుయల్ ఆల్ఫబెట్ నేర్చు కున్నాడు. అక్షరాలా స్కాట్లండునివాసి. స్కాట్లండు దేశాన్ని యీయనలో మూర్తీభవించినట్లుగా చూడవచ్చు.

భోజనాలయ్యాక ఫ్రాన్సుగురించి కాసేపూ, స్కాట్లండు గురించి కాసేపూ యింటికబుర్లూ అయాక స్కాట్లండుదేశపు జానపదగేయాలని గురించి ప్రస్తావన వచ్చింది. హెలెన్ గబ గబా మేడమీాదికి వెళ్లి, ఎడింబరోనుంచి తనకు మిత్రులు పంపిన స్కాటిష్ పాటల బ్రయిలీ సంపుటాలు తీసుకొచ్చింది. ఆ సంపుటాల్లో ఏఏ పాటలు వున్నాయో దడ దడ చదివేసి, తను వినదలుచుకున్న "ఆకాసంనుంచి కేక" అనుపాట ఎక్కడవున్నదో వేలుపెట్టి చూపించింది పాలీకి.

హెలెనూ పాలీ న్యూయార్కులో జరగనున్న - యూదుల పండక్కి వెళ్లారు. ఈ పండగ పురాతన పద్ధతిలో జరుగుతుంది. నలుపలకల గుడారంలో అతిథులకి వడ్డిస్తారు. నాలుగువైపులా ఆ కాలంలో పండే పళ్లగుత్తులు వేలాడ దీస్తారు. ముఖ్యంగా బైబిల్‌లో వుదహరించిన ఫల జాతులన్నీ అక్కడ వేలాడ దీయబడి వుంటం మనం చూస్తాం. హెలెన్ పాలీలతోపాటు నేనుకూడా వెళ్లాను. డాక్టర్ లూయీ ఫింకిల్‌స్టిన్ (Dr. Loisue Finkelstein) డాక్టర్ సామ్యుల్ లిబర్‌మాన్ (Dr. Samuel Liberman) మొదలైన ప్రఖ్యాత యూదు పండితులు ఆ నాటి సమావేశంలో పాల్గొన్నారు. బైబిల్ సాహిత్యంలో హెలెన్ కెల్లర్‌కిగల ప్రవేశానికి అక్కడివారందరూ ఆశ్చర్య పోయారు. డాక్టరు ఫింకిల్‌స్టిన్ పెదవులమీాద వేలికొన లుంచి అతను మాట్లాతున్న పలుకులు గ్రహించే హెలెన్ కెల్లర్ యిలాఅంది. "హెబ్రూ భాషలో ఆ వుచ్ఛారణలో జీవనమాధుర్యముంది. జీవధర్మం నృత్యం చేస్తున్నట్లుంది.

భగవానుడు లోకప్రజలని వుద్దేశించి ఇటువంటి కమనీయ గాత్రంలోనే మాట్లాడి వుండాలి. ఎంతోకాలం బట్టి మానవ జాతికి మిగిలినపుస్తకం బైబిల్ ఒక్కటే! సూర్యుడు, ఆకాశం, సముద్రం, నక్షత్రమండలం, వీటిగురించి తనకి తెలుసునన్నవిధంగా - మాట్లాడిన గ్రంథం యిది ఒక్కటే. మానవులలో తేడాలంటూ లేవు. అందరు మానవులూ ఏక గర్భజనితులు. కాని వారినీడలు వేరు వేరు ఛాయలని ప్రసరింపజేస్తున్నాయి. మనకి అగుపించే తేడా నీడల్లోదిగాని - మానవులందరూ ఒకటే.''

''మానవులందరూ ఒకే కుటుంబంలోనివారనీ సోదర తుల్యులనీ భావనకల్గడం మన పురోగతికి ఎంతేనామంచిది. ఈ పడికట్టు రాయితో మనం లోకాన్ని తూచగలిగిననాడు ప్రజలు సుఖజీవనులవుతారు'' - అంటుంది హెలెన్ కెల్లర్, డాక్టర్ ఫింకిల్‌స్టిన్ ఏర్పరిచిన శాస్త్రకోవిదుల సమావేశం గురించి ప్రస్తావిస్తూ.

ఆమధ్యాహ్నం భోజనాలయాక - బ్రాడ్వేలో బస్ ఎక్కి, గ్రాండు సెంట్రల్ స్టేషన్‌కి వెళ్లాం. అంతటి జనసందోహంనుంచి తోసుకువెళ్ళడం హెలెన్‌కి ఎంతో సంతోషమనిపించింది. మేము బస్సులో వస్తున్నపుడు, 'ఇక్కడెవరో పెయింటరు వున్నాడు -' అంది. పరిశీలనగా చూస్తే మాకు యిరవై అడుగుల దూరాన యింటిగోడలకి పెయింట్ పూస్తున్న ఒకమనిషి కనపడ్డాడు. వాసననిబట్టి వ్యక్తుల వృత్తులు కనిపెట్టడమనేది హెలెన్‌కి చిన్నప్పటినుంచీ చేతనైన విద్య.

ఒకరోజు సాయంత్రం డేవిడ్‌సన్ మమ్మల్ని - ఒక రెస్టారెంటుకు భోజనానికి తీసుకెళ్లాడు. రెస్టారెంటులో కూచున్న పది నిముషాలకల్లా హెలెన్ మాచుట్టూ టేబుల్సులో వున్నవారు ఏఏ వృత్తులకి చెందినవారైనదీ - చెప్పనారంభించింది - వారివద్దనుంచి వచ్చేవాసననుబట్టి, వారు వాడేసబ్బు, కాల్చే చుట్ట, తింటున్న పదార్థాలు యివన్నీ చెప్పేసేది. ఈ ఘ్రాణేంద్రియ ప్రభావంవల్ల ఆయా వ్యక్తుల చిత్రాలు తన మనసులో అల్లుకు వారెంటువంటి వారయేది - తనకితోచిన విధంగా మాకు చెప్పేసరికి మేము ఆశ్చర్యపోయేవాళ్లం.

## జూలై 1946

ఇవ్వాళ హెలెన్ కెల్లర్ యింట్లో భోజనం. వేసవి కాలంలో వుదయం అయిదుగంటలకేగా హెలెన్ నిద్ర నుంచి లేవడం! పక్క-బట్టలు సర్దుకుని, తలుపులు తెరుచుకు, తోటలోకి షికారుకి వెళ్ళేది. ఆమెకోసమని వేసిన తీగెను ఆధారంగా చేసుకు, తోటచుట్టూ షికారు తిరిగి - మళ్ళీ తన స్వస్థానం చేరుకునేది.

పాలీ థామ్సన్ నా భావాలు సరిగ్గా చెప్పలేక పోతుందిట, నా కర్థమయే పద్ధతిలో చెప్పలేక పోతున్నానని ఎప్పటికప్పుడు వ్యాకులపడుతుంది - అనేది హెలెన్. పాపం, పాలీకి ఆమెతో సంభాషిస్తున్నప్పుడు చెప్పవలసినదంతా పూర్తిగా చెప్పినట్లు తృప్తికలిగేదికాదు. ఈబాధ పాలీకే గాని హెలెన్‌కి ఏనాడూ లేదు. ఆమెకి ఏ విషయమైనా అతి త్వరలో అర్థమైపోయేది.

ఏవైనా సాహసమైన పనులు చెయ్యాలంటే హెలెన్‌కి మహాసరదా. ఒకసారి జిప్సీలగురించి మాట్లాడుతూ, కామెరాడ్ అనే ఆయన నన్ను యీస్టుసైడ్‌కి తీసుకెళ్ళి ఆ జిప్సీలు నివసిస్తున్న, శిథిల గృహాలు(Old ware houses) చూపించాడని హెలెన్‌కి చెప్పేసరికి, - హెలెన్ తనుకూడా వారు ఎలా జీవిస్తున్నదీ, ఎక్కడ వుంటున్నదీ చూస్తానని పట్టుపట్టింది. ఈ జిప్సీలు తమ పిల్లలచదువుకోసం పట్నం వైపుగా వచ్చేవారు. పట్నంవచ్చాక వీరుండేందుకు చోటు లేక కూలిపోతున్నకొట్లలో చలికాలం గడిపి వేసవిలో ఆరుబయట - రోడ్డుపక్కగా గుడారాలు వేసుకు జీవించేవారు. వారిస్త్రీలు పగటివేళ పట్నపువీధుల్లో తిరుగుతూ జోస్యం (సోది) చెప్పి నాలుగు డబ్బులు సంపాయించుకునే వారు.

## అక్టోబరు 1947

ఇవ్వాళ హెలెన్ పాలీలతో విందు. పదిరోజుల క్రితమే వారు తమ కొత్తయింట్లో ప్రవేశించారు. వెనకటి యిల్లు పూర్తిగా మంటలకి ఆహుతి అయింది. ఈ కొత్త యింటిని అలంకరించేందుకుగాను, హెలెన్ కెల్లర్ జపనీస్ మిత్రులు లక్కతోనూ బంగారంతోనూ చేసిన అనేక అందమయిన వస్తువులు పంపించారు. వెండిబంగారాలతో చేసిన దీపపుకుంది పంపాడు జపానుచక్రవర్తి. దూరదూర ప్రదేశాలనుంచి ఎందరెందరోయీ కొత్తయింటిని అలంకరించేందుకు, రకరకాల వస్తువులని పంపారు. చివరికి యిది ఒక జపనీస్ మ్యూజియమ్‌గా తయారయినట్లు కనిపించింది.

పాలీథామ్సన్ యీ వస్తువులన్నిటినీ చక్కగా అమర్చి నూతన గృహశోభని ద్విగుణీకృతం చేసింది.

1946 నవంబరులో హెలెన్ పాలీలు వుంటున్న పాతయిల్లు అగ్నిప్రీతి అయింది. ఆ మంటలనుంచి వెండి సామానుతప్ప మరింకేమీ రక్షించడానికి అలవికాలేదు. ఎన్నో పుస్తకాలు, ఆమె బ్రయిలీ లైబ్రరీ, యానీసల్లివాన్ గురించి రాసిన ముప్పాతికవంతు పుస్తకం, తాను ఎప్పటి నించో జాగ్రత్త చేస్తున్న నోట్సులు, మొత్తంమీద ఆమె విజ్ఞానభాండాగారమంతా అగ్నిదేవునికి ఆహుతి అయిపో యింది. ఒక విధంగా ఆమె సంపద అంతా ఆ మంటల్లో కాలి మసిఅయిపోయింది. ఇంతపని జరుగుతున్నపుడు ఆమె అక్కడ లేదు.

రోమ్‌లోవున్న హెలెన్ కెల్లర్‌కి ఈ వార్త చేప్పేసరికి ఆమె అన్నదట. "ఈ నష్టం ఒకనష్టమా? ప్రజలు తిండీ తిప్పలు లేక నిరంతర అశ్రువారధిలో మునిగిపోతున్నారు. బహుశా నేను పోగుచేసిందంతా నాకు నిరుపయోగమేమో! అందుకనే అది అలా కాలిపోయింది. ఈభౌతిక దేహంకంటె జీవనచైతన్యం గొప్పదని నిరూపించేందుకు యిది ఒకఉదా హరణ. నేను నివశించేయిల్లు కాలిపోతే కాలిపోయింది. కాని నాలోని ఆధ్యాత్మికమందిరం నాప్రాణిని పదిలంగా కాపాడు తున్నన్నాళ్ళూ - యీ సామాన్య విపత్తులు నన్నంతగా బాధించవు. లోకదహనంలో నాదేపాటి?"

# 11. ప్రపంచం చుట్టూ

చాలామంది అంధులకి తొందరలోనే జీవితంపట్ల నిరాశ ఏర్పడి సామాన్యులకంటె త్వరగా మరణిస్తారు. హెలెన్ కెల్లర్ విషయంలో అది అబద్ధమయింది. తను సాధించవలసిన కార్యాలపట్లా, తన జీవన విధానంపట్లా అకుంఠిత విశ్వాసమామెకి. రెండవ ప్రపంచసంగ్రామము ఆమె మనసుని కమ్మేసినపుడు, ఏదో పర్వతం తన తల మీద మోపబడినట్లు భావించింది. ఈ మహాయుద్ధం తనకొక నూతన బాధ్యత కల్గిస్తోంది. తను అంధుల ప్రతినిధి. ఈ మహాయుద్ధం సామాన్యులనే యింత భీభత్స పరిచినపుడు అంధులకి యింకెన్ని ఆపదలు తెచ్చిపెట్టి వుంటుందో! అదీగాక సుఖంగా అందరిమల్లే బతుకుతున్న ఎందరు పౌరులని ఈ చీకటిలోకంలోకి విసిరేసిందో? ఎంతో కష్టబడి అంధులు తమ కోసమని సంపాయించుకున్న స్కూళ్ళనీ కర్మాగారాలనీ - నాజీలు నాశనంచేశారు, వాటిలోవున్న వస్తువులని కొల్లగొట్టుకుపోయారు. అక్కడి బ్రయిలీ ప్లేట్లూ బ్రయిలీ గ్రంథాలూ తర్లించుకుపోయి - ఆలోహాన్ని తుపాకీ గుళ్లుగా మార్చారు. బ్రయిలీ గ్రంథాలయాలని తాము చలి కాచుకునేందుకూ, వంట చెరకుగాను వుపయోగించారు. ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, గ్రీసు దేశాలు - పర్యటిస్తున్నపుడు, హెలెన్‌కి యీ యుద్ధంవల్ల అంధులయిన నావికులూ, సైనికులూ, అమాయకస్త్రీలూ, అన్నెపున్నె మెరుగని బాలబాలికలూ కొల్లలుగా కనపడ్డారు, 'మానవజాతి యిటు

వంటి దౌర్భాగ్యపు స్థితిని (The sum of human misery) యింత పెద్ద ఎత్తున యింత ఘోరాతిఘోరంగా యింతవరకూ పొందలేద'న్న బెర్ట్రాండ్ రసెల్ పల్కులు ఆమెకి పదే పదే జ్ఞాపకం వచ్చేవి. యూరప్‌లో మాట సరేసరి. మిగతా దేశాల విషయమో. ముఖ్యంగా యిటువంటి సామాజిక పద్ధతీ, వైద్యసౌకర్యాలూ లేని మధ్యప్రాచ్య దూరప్రాచ్యాలమాటో? ప్రపంచసంగ్రామం ముగిసిన పదేళ్ల వరకూ హెలెన్ కెల్లర్, అంధుల జీవితం కోసం, వారి సమస్యలు పరిష్కరించడంకోసం, తన సమస్త కాలాన్నీ వినియోగించింది, ఆస్ట్రేలియా, దక్షిణ అమెరికా, ఆఫ్రికా, ఆసియా ఖండాలు పర్యటించి. ''నాయింట్లో నేను కూచుని తెలుసుకోడంకంటె లోకంలోకి ప్రజలమధ్యకి వెళ్ళి నేను చేయవలసింది ఎంతోవుంది'' అంది ఈ అంధ ప్రజానీకపు ప్రతినిధి.

యుద్ధంపూర్తిగా ముగియకపూర్వమే, అమెరికాలోని నావిక ఆస్పత్రులూ, సైనిక ఆస్పత్రులూ షుమారు డెభై ఎనభై దాకా - ఆమె సందర్శించి వచ్చింది. తను మాటలు బాగా పల్కలేదు. తన నోటినుంచి వెలువడే మాట అతినెమ్మదిగానూ వికృతంగానూ వుంటుంది, తన యీ ప్రయత్నాన్ని చూసి లోకులు నవ్వుకుంటారేమో అని మొదట్లో కొంచెం జంకింది - కాని తరువాత తరువాత కష్టబడి, తనకిచేతనయివ విధంగా మాట్లాడటం ప్రారంభించింది. హాస్పిటల్లో ఒక గదిలోంచి మరోగదిలోకి వెళ్తూ అంధులూ, బధిరులూ అయిన యువతుల చేతులు ముట్టుకు చూసి, వారుచూపిన ధైర్యసాహసాలకి అచ్చెరువు పొందింది.

వారితో మాట్లాడుతూ ఒక కేసు తరువాత మరొక కేసు వింటున్నపుడు, ఆమె మనసు ఆఫ్రికా అరణ్యాలలోకీ, అధిరోహించనలవిగాని పర్వతశ్రేణుల్లోకీ, జీవధాతువు కనపడని ఎర్రటియిసుక నేలలోకి, వుత్తర అట్లాంటిక్ హిమసమూహాల లోకీ ప్రయాణం చేసింది. ఫైటర్ విమానాలు భూమి మీదకు బాంబులు విసరడంతో నేల యావత్తూ కంపించడం, మంటలూ పొగాతో ఆప్రదేశమంతా కప్పడిపోవడం. జనుల ఆర్తనాదం ఈ వుధృతాలన్నీ తన మనో ప్రపంచంద్వారా చూడగలిగింది. కొందరు యువకుల చేతులు స్పృశించి, వయలిన్ పట్టుకోవలసిన చేతులు తుపాకులు పట్టుకున్నాయా అని వాపోయేది. ఈ యువకులనీ యీ బాధలనీ, యింత బాధలోనూ వీరు చూపే వోర్పునీ ధైర్యాన్ని ప్రత్యక్షంగా తెలుసుకోవడంతో తనేదో కొత్త ప్రదేశం లోకి ప్రవేశించినట్లయింది. ఇల్లూ పిల్లలూకోసం, తల్లితండ్రులకోసం, తమకి తెలిసిన వాతావరణంకోసం, మనుషులింతగా కాంక్షించడమనేది యిదే మొదటిసారి. హాస్పటల్ లోని ప్రతిరోగీ భౌతికంగా అక్కడ పడివున్నాడన్నమాటే గాని అతని మనసు తన గృహంలో నివసించేది.

ఫలానా అతను నావికుడని ముట్టుకోగానే చెప్పగలిగేది హెలెన్ కెల్లర్. నావికుల చేతులూ సైనికుల చేతులు కండరాల విషయంలో తేడాగావుంటాయిట. నావికుని చెయ్యి సైనికునిచెయ్యి కంటె మరికొంచెం మోటుగా వుంటుందిట - అతను పొందే క్రమశిక్షణవల్ల.

ఆరు నెలలు విశ్రాంతితీసుకు ఆస్ట్రేలియా, న్యూజి లాండ్, జపాన్, దక్షిణ అమెరికా, కేప్‌టౌను, దక్షిణ ఆఫ్రికా, యీజిప్ట్ యిలా పర్యటించి వచ్చేది హెలెన్ కెల్లర్. ఇంకా రెండుమూడు నెలలకి రిపబ్లిక్ ప్రకటిస్తా రనగా ఆమె కెయిరో నగరంలోవుంది. వెయ్యీ రెండు వేల సంవత్సరాల నిద్ర తరువాత యీజిప్టు మేలుకోవటం ఆమె ప్రత్యక్షంగా చూసింది. అధ్యాపకులలో విద్యార్థులలో సమాజ నాయకులలో, రాజకీయనాయకులలో ఒక నూతన చైతన్యం కనపడసాగింది. ఈజిప్టు ప్రధానమంత్రితో ప్లాటో గురించిన విషయాలు ముచ్చటించి, విద్యామంత్రిని అంధుల పాఠశాలలు ఈజిప్టువంటి దేశంలో ఎంత అవసరమో వొప్పించింది. ఈజిప్టులోని పురాతన శిథిలాలవద్దకు వెళ్ళి అక్కడి శిల్పసంపదని తనకితానుగా తెలుసుకు పురాతన కాలంలో వారికిగల కళాభిరుచికి సంతోషపడింది. ఈమె పిరమిడ్లు అర్ధరాత్రివేళ నక్షత్రకాంతిలో చూసేందుకుగాను ఆ ఎడారిలో ప్రత్యేకంగా డేరావేశారు. రాత్రివేళ ఆ ఎడారి యిసుకచూసి. "ఈ బ్రహ్మాండమయిన నిశ్శబ్దత జీవి తానికీ పురోగతికీ అవరోధం కల్పించేది; యీ ఎడారి గాలిలో గల నిశ్శబ్దత అతి దీనమైన శోకనాదంవంటిది; ఆ విషాదస్వరం దేనికొరకో మనం తెలుసుకోలేం," అంది. చిన్నతనంలో ఈజిప్టుగురించి చదివిన కథలూ గాథలూ హెలెన్‌కి జ్ఞాపకం వచ్చాయి. తమ ప్రభువులకోసం పిరమిడ్లు నిర్మించేందుకు ఎన్నివేలమంది అహోరాత్రులూ కృషి చేశారో! ఎంత నిర్దాక్షిణ్యంగా జంతువులని మోదినట్లు

వాళ్ళని మోదారో! వారి దేహాలనుంచి కారిన రక్తబిందువులతో, యీ యిసుక తప్పక తడిసి వుంటుంది, జంతువుల కంటె హీనంగా చూడబడివుంటారు ఆనాటి బానిసలు.

డాక్టరు ష్వైట్జర్ కి మల్లేనే భవిష్యత్ లో మంచి జరగ నున్నదనే విశ్వాసం హెలెన్ కి గాఢంగావుంది. ఇరవయ్యో శతాబ్దపు మేధావుల్లో ఏ వొక్కరుకూడా యీ ప్రపంచ సంగ్రామాల గురించీ తత్ఫలితంగా నాగరికత ఛిన్నాభిన్నమవడం గురించీ ముందే వూహించి వార్నింగ్ యివ్వలేక పోయారు. ఈజిప్టు అనుభవించిన నాగరికత ఒక్క అరగంట విలువైనది. మానవునికి అన్నిసంపదలూ సమకూర్చబడ్డాయిగాని వాటిని సరిగ్గా వాడుకోడం అతనికి తెలియదు; వాడుకోగల పాటి బుర్రకూడా లేదు. ఆ అల్పత్వం చూస్తే జాలి కలుగుతుంది. తను అదుపులో పెట్టుకోలేక పోయిన శక్తుల విజృంభణకి అతను తెల్లబోతున్నాడు. అత్యుత్తమ భావసంపద తాపీగా నెమ్మదిగా ప్రయాణం చేస్తుంది. అంతరాత్మయు ఔదార్య గుణం అనునవి (Conscience and Character) మానవుడు అయిదు వేల సంవత్సరాల క్రిందట మాత్రమే నేర్చుకున్నాడు. అవి నేర్చుకోవడమూ లోహాలు కనిపెట్టడమూ యించు మించు ఒకేసారి జరిగాయి. కాని మానవుని ఆత్మలో ప్రారంభంనుంచీ ఒక సువిశాలత కనపడుతోంది. కష్టాలని చిరునవ్వుతో ఎదుర్కుంటూ ముందుతరాల వారికి గుణపాఠంనేర్పే ఆత్మబలం అతనిలో కనబడుతోంది. ఇది ముఖ్యంగా ప్రాచ్య ఖండ మంతటా కనబడుతోంది. అరబ్బు దేశాలైన లెబనాన్ సిరియా జోర్డాన్ లు తమ సామాజిక

సమస్యలతో నిరంతరమూ కుస్తీ పడుతూ అంగవికలులకి తమ చేతనైన విధంగా దారిచూపుతున్నాయి. ఇజరేలులో ప్రజలు నూతన విశ్వాసంతో కొంపలకి కొండలు దొలిచి, రాళ్లు తవ్వి, తమ నేలని స్యసశ్యామలం చేసేందుకు నూతన పద్ధతిలో కృషి చేస్తున్నారు. బైబిల్‌లో పదే పదే పేర్కొన బడ్డా యీ ఇజరైల్ రెండువేల సంవత్సరాల అనంతరం పంట పండించుకోడమన్నది చూస్తోంది. తమ పిల్లా పాపకి కావలసిన గోధుమ పండించుకోడం, పచ్చని చెట్లతో వివిధ ఫలజాతులతో, ఈ ప్రదేశమూ ఒక దేశంగా ముందుకు నడుస్తోంది. ఇజరైల్‌లో కూడా అంధులకు తగు ఏర్పాట్లు చేశారు.

యుద్ధానంతర ప్రపంచంలోని దేశాలన్నిటిలోనూ ఒక కొత్తకదలిక కనపడింది హెలెన్‌కి. అరబ్బులూ యూదులూ జపనీయులూ తమలక్ష్యం ఏదో చెప్పసాగారు. వారి మనస్సుల్లోకి జొరబడి ఆవాంఛితాలేవో తెల్సుకునేందుకు ప్రయత్నించింది హెలెన్. అమెరికా అనగా ఎమర్సన్, విట్‌మాన్‌ల అమెరికాగాని రాజకీయ నాయకులు చెప్పే అమెరికా కాదు. రాజకీయవాదులు ఎంత బ్రహ్మాండమయిన వాటినికూడా - తమ స్వప్రయోజనం కోసం, ప్రస్తుత లాభాలకోసం, తమకి అనువైన పద్ధతిలో చూపడానికి ప్రయత్నిస్తారు.

ఎమర్సన్, విట్‌మాన్‌ల భావాలని దక్షిణ అమెరికా లోని ఛైల్, బ్రేజిల్, పెరూ దేశాలకి, దక్షిణ ఆఫ్రికాలోకి తీసుకువెళ్ళి - వాటిని వ్యాప్తం చేసింది. జాత్యహంకారము

(Race intolerence) రంగు జాతులపట్ల చిన్నచూపు ఆమెని ఎంతో బాధపెట్టాయి. మానవులందరూ హేతుజీవనులూ, న్యాయజీవనులూ అయేకాలం, ఏనాటికైనా రాకపోతుందా అని ఆమెకల. కేప్ గుడ్ హోప్ మీదుగా వెళ్తున్నపుడు రంగురంగుల ఆకాశంవంక, ఎప్పటికప్పుడు సూర్యుణ్ణి దాచేసేదాకా మేఘాలనీ చూసే - హెలెనూ పాలీ, సముద్ర ప్రయాణంలో విసిరివేయబడ్డ వోడవంటిది తమజీవితం అనుకున్నారు. "భద్రత అనునది (Security)తనకి ఏనాడేనా తెలుసా? నిరంతర సమస్యలని దాటేప్రయత్నమేగాని - నిక్షేపంగా కూచోడమంటూ ఏనాడూ తెలియదే! మనలోని శక్తులన్నీ ఒకలక్ష్యం వైపుగా కేంద్రీకరించి - ఆ కేంద్రీకరణ ద్వారా కార్యాచరణకి పూనుకుంటేతప్ప జీవితానికి అర్థం అవుపడదు. ప్రస్తుత శకంలోని మనుషులు ఒకేఒక పొరబాటు చేస్తున్నారు. ఈ పరిస్థితులెప్పుడూ యిలా గేమార్పు లేకుండా వుంటాయనీ సుఖశాంతులతో కూడిన జీవితానికి తాము వారసులమనీ, కలవరపాటూ అలజడీ లేకుండా రోజులు హాయిగా దొర్లిపోవాలనీ వాంఛిస్తున్నారు. అదే పొరబాటు. ఆ శాంతి లోపల్నించి రావాలి కాని బయట ప్రపంచంలో సమస్యలనేవి ఎప్పుడూ వుంటాయి, సాంఘికంగానూ చారిత్రకంగానూ ఏవో కొన్ని సంఘటనలు తప్పవు - ఆ సంఘటనలు మనం కష్టపడికట్టుకున్న పేక మేడలని వూడ్చేస్తూంటాయి." - అంటుంది హెలెన్.

చిన్నతనంలో ఎప్పుడో ది స్టోరి ఆఫ్ యాన్ ఆఫ్రికన్ ఫారమ్ (The Storyof an African farm) చదివింది.

అప్పటినుంచి ఆమెకి ఆఫ్రికా ఖండమనగానే సాహస కృత్యాలతో కూడిన ప్రదేశంగా మనసులో ముద్రణ పడిపోయింది. అదీగాక ఆ ఖండానికీ విపత్ సముద్రానికీ సంబంధం వుందనే భావన ఏర్పడింది. ఆతరువాత ఆమె మహాత్మాగాంధీ ఆత్మకథ, రచనలూ చదివింది. జాతిసమస్యలు, రంగుసమస్యలు ఆయన చాలా చక్కగా పరిశీలించగలిగారు. "ప్రజలలోని చెడుని విస్మరించి వారిని మార్చేందుకు గట్టిగా కృషిచేస్తే వారు తప్పక మనఅభీష్ట ప్రకారం మారుతారు" - అన్న మహాత్ముని పలుకులు - ఆమెని చాలా ఆకర్షించాయి. మానవజాతిలో ఆయనకి అపూర్వమైన విశ్వాసముంది. ఆ విశ్వాసమే ఆయనచేత అసాధ్యమైన పనులు (Miracles) చేయించగలిగింది. ప్రజలలోగల లోపాలుగాక వారిలోగల శక్తిని నమ్మాడాయన. ఆ శక్తే కోట్ల కొలది ప్రజలలో నూతన విశ్వాసానికి కారణభూతమై - వందలసంవత్సరాలుగా అస్వతంత్రంగా పడివున్న జాతిలో నూతన యుగోదయగానం ఆలాపింప జేసి - వారిని మేల్కొల్పింది. మానవునిలోగల లోపాలుగాక అంతర్భూతమైన శక్తిని నమ్మివున్న వాడవడం చేత, మహాత్ముడు మన కళ్లముందే మిరకిల్స్ చేసి చూపించగలిగాడు. బధిరాంధురాలైన తనకిగూడా, తన ప్రయత్నం పట్లా - అంధప్రజపట్లా గాఢ విశ్వాసంగాక మరింకేముంది? తమకి అన్ని విధాలా సన్నిహితుడైనవాడే ఎలాన్ పేటన్ (Alan Paton) 'క్రయ్ ది బిలవుడ్ కంట్రీ' - ('Cry The Beloved Country') అన్న వుత్కృష్ట గ్రంథం రచించిన మహానుభావుడు. అతను హైస్కూల్ విద్యార్థిగా

వున్నపుడే హెలెన్ కెల్లర్ గురించి విన్నాడు. మూసివేయ బడ్డద్వారాలు తెరిచిన యీమె చేస్తున్న మహత్తరకృషి అతను జాగ్రత్తగా తెలుసు కుంటూండేవాడు. రెండు నెలల పర్యటన అనంతరం అంధులకోసమని వుద్దేశిస్తూ హెలెన్ రాసిన 'హెలెన్ కెల్లర్ అండర్ ది సదరన్ క్రాస్' (Helen Keller Under The Southern Cross) అన్నగ్రంథానికి ఎలాన్ పేటన్ పరిచయ వాక్యాలు రాసాడు. దక్షిణాఫ్రికాలో దిగేసరికి పత్రికలన్నీ యీమె గురించిన వార్తలు ఎంతో ప్రముఖంగా ప్రచురించాయి. ప్రజలు యీమెని గురించి తెలుసుకునేందుకు - అంటే కొత్త విషయాలు తెలుసుకునేందుకు, ప్రత్యక్షంగా చూసేందుకు ఎంతో ఆతృత కనబరిచారు. దర్బాన్, జొహన్నిస్‌బర్గ్‌ల్లో యీమెకి ఘనస్వాగత మివ్వబడింది. ముఖ్యంగా అక్కడి పల్లెటూళ్లలోని కుటీరపరిశ్రమలు అంధుల కెంతైనా పనికి వస్తాయని ఆమె భావించింది. ''తోలుపనీ, కమ్మరి పనీ, చాపలు అల్లడం, మేదరపనీ, చేనేతా, యిటువంటివి - అంధులకి నేర్పడం వల్ల వారి జీవితాలకి ఒకదారి చూపించిన వారవుతాము. యిటువంటివి నేర్పేందుకు పాఠశాలలూ అధ్యాపకులూ అవసరంలేదు''అన్నది హెలెన్. ఊపిరి సలపని కార్యక్రమావళిలో మునిగి వుండికూడా క్రూగర్ నేషనల్ పార్క్‌కు వెళ్లి (Kruger National Park) జిరాఫీలూ జీబ్రాలూ, సింహాలూ, వుష్ట్రపక్షులూ, గుంపులుగుంపులుగా వున్న లేళ్లూ దుప్పులూ మొదలైన వాటిని చూసి, ఎంతో ఆనందపడింది. ఆఫ్రికాలో ఈమె నేటికాలపు మత

చిహ్నంగా భావింపబడింది (the religious perception of our time). ఈ విషయం, అనగా ప్రతి కాలమూ తనమత చిహ్నాన్ని ఏర్పరచుకుంటుందన్న విషయం, టాల్‌స్టాయ్ అన్నాడు. "కొందరు కొందరు మహామహుల జీవన సారాంశము, ఆ కాలపు మానవ లక్ష్యానికి నిదర్శనమూ అన్నట్లు కనపడుతుంది. అటువంటివారి జీవితాలద్వారానే మానవ ప్రగతీ జీవన లక్ష్యం మనం తెలుసుకో గలుగుతున్నాము" అంటాడు. టాల్‌స్టాయ్ అమితంగా పూజింపబడే ఆఫ్రికాలో హెలెన్ కెల్లర్ ఆయన వుదహరించిన మత చిహ్నంగా రూపొందింది.

1946 లో హెలెన్ కెల్లర్ గ్రీసుదేశం వెళ్లింది - యుద్ధంలో అంధులైన వారిని చూసేందుకు గాను, గ్రీసు దేశం వెళ్లగానే పురాతన గ్రీకు వైభవమూ, తన చిన్ననాటిగాథలు - అవన్నీ జ్ఞాపక మొచ్చాయి. జీయుస్ (Zeus) దేవాలయంలోని ఒక పడిపోయిన స్తంభంచూసి, దాని కైవారంకొలిచి, ఇంత పెద్దపెద్ద స్తంభాలు వుండేవా ఆనాటి పార్థినాన్‌లో (Parthenon) అని ఆశ్చర్యపడింది. అడ్డదిడ్డంగా పడివున్న రాళ్లు ఒక టొక్కటే ఎక్కుతూ - దేవాలయం పైభాగానికి వెళ్లింది. అంతకష్టపడి ఎక్కలేరేమో, అని పక్కనున్న వారు వారించినప్పటికీ వినకుండా, ఆశిథిలమందిరాలన్నీ ఎక్కి వాటిని ప్రత్యక్షంగా స్పృశించి, ఏదో దివ్యానుభూతి పొందింది. పెరిక్లీస్, సోక్రటీస్, ఏ స్థానం నుంచి తమ యువకులకి విద్య బోధించారో, మానవజాతి కరుణ రసం అలవరుచుకోవాలని యురిపిడీస్

ఎక్కడనుంచి తన కంఠాన్ని ప్రజలకి వినిపింప చేశాడో, అటువంటి మహోన్నత - మహాద్భుతప్రదేశాలన్నీ ప్రత్యక్షంగా దర్శించి తమ ధన్యురాలైనట్లుగా భావించింది హెలెన్. తన చిన్ననాటి కలలు యిప్పటికి తీరాయికదా - అనుకుంది. కళా కోవిదులనీ, యింజనీర్లనీ, శిల్పులనీ విస్మయపరిచే ఆ పురాతన మందిరాలు ఆనాటి కావ్యాలూ కల్పిత గాథలూ, ట్రాయ్ నగరం పట్టుకోవడం, గ్రీకులకీ యితర జాతులకీ జరిగిన యుద్ధాలూ, చిన్నపుడు తనూ తన టీచర్ యానీ - గ్రీసుదేశం గురించి చెప్పుకుంటూ ఆడుకున్న ఆటలూ అవన్నీ జ్ఞప్తికి వచ్చాయి. ఈ ఏథెన్సు నగరంలోనే కదా, మనుషులతో మాట్లాడేందుకు దేవతలు వచ్చేవారని కథలల్లారు. దేవతలూ మనుషులూ ఒకరై జీవించిన రోజులు కాబోలవి - అనుకుంది హెలెన్. తనమేధస్సు ఒక విధంగా గ్రీకుసాహిత్యానికీ ఆనాటి వారి మనోధర్మానికీ అంకితమై పోయింది.

# 12. మళ్లీ డైరీనుంచి

## అక్టోబరు 1949

మా స్నేహితుల్లో ఒకరు హెలెన్‌ని, మీకు యాబ్‌స్ట్రాక్షన్స్ (Abstractions) ఎలా తెలుస్తాయని అడిగాడు మంచి యాపిల్సు తియ్యగా వుండడం - మంచివి కానివి పుల్లపుల్లగానూ వగరుగానూ వుండటం ఆమె మొదట్లో తెలుసుకుంది. ఆతరువాత ఈ తియ్యదనమూ వగరుతనమూ యాపిల్సుతో ప్రమేయం లేనివిధంగా ఆలోచించ సాగింది. మాధుర్యమూ, వగరూ యీ రెండు వేరువేరు భావాలుగా ఆమె మనసులో నాటుకున్నాయి. నలభై ఏళ్లక్రితం గ్రీక్ కామన్‌వెల్తు (The Greek Commonwealth) అను మహా గ్రంథము రచించిన సర్ ఆల్‌ఫ్రెడ్ జిమ్మర్న్ (Sir Alfred Jimmern) ఒకనాడు భోజనాల బల్లదగ్గిర హెలెన్ చెప్పింది విని, యీమె అక్షరాలా ప్లాటో పద్ధతిని అనుసరిస్తోం దన్నాడు. నిజానికి హెలెన్ మాటల్లోనుంచి ఆమె భావసౌం దర్యంలో నుంచి ప్లాటో మహాశయుడు తొంగి చూస్తుం టాడు.

## క్రిస్ మస్ 1951

ఇవ్వాళ హెలెన్ థుసీడైడ్సుని (Thucydides) పట్టు కుంది. క్రిస్ మస్ వుదయమే ఆ చారిత్రక విషయం చదివిం దామె. పెలోపొన్నిసిన్ (Peloponnesin) యుద్ధంగురించి

మాట్లాడుతూ, ఇంత నిరర్ధకమైన యుద్ధమూ - యింత బుద్ధిలేని యుద్ధమూ చరిత్రలో మరొకటి లేదంటూ, ఆ మాదిరి యుద్ధం జరగడంగురించి తన విచారం వెలిబుచ్చింది. అటువంటి యుద్ధం జరిగివుండకూడదని - అనేకసార్లు అంది. ఏథెన్సు నగరపు ప్రజాస్వామ్యాన్ని నేలమట్టం చేసిన యీ యుద్ధం మానవ జాతికి చేసిన అపకారం యింతా అంతా కాదట. భోజనాల టేబుల్ దగ్గిర ఆవిషయంగురించే ఎంతో సేపు వాపోయింది.

మరొక రోజున అమాంతరం యీవిలిన్ ఛెస్ మాన్ (Evelyn Chessman) అను ఒక యింగ్లీషు ఎంటమాలజిస్టు - (కీటకపరిశోధకురాలు) గురించి ఖబుర్లు మొదలుపెట్టి, ఆమె కీటకాల విషయమై రాసిన అద్భుత వ్యాసాలు మాకు చెప్పడం మొదలుపెట్టింది. పాలీ థామ్సన్ కి విసుగుపుట్టి - 'ఎవరీ ఈవిలిన్?' - అని అడిగింది. ప్రశ్నించడమే తరువాయి ఆమెగురించి ఓ చేటభారతం మొదలెట్టింది. చిన్న పిల్లలు కథ చెబుతారే, ఆ విధంగా ప్రారంభించేది. ఆ యీవిలిన్ గురించి ఎంతోసేపు ఎన్నోవిషయాలు చెప్పింది. ఏమిటేమిటో చెప్పుకొచ్చింది. ఎప్పుడూ పుస్తకప్రపంచంలోనూ, వుద్గ్రంథాల్లోని మహావ్యక్తుల మధ్యా జీవించడం బాగా అలవాటై పోయింది గనక, హెలెన్ కి మనందరికి మల్లేముఖస్తుతులూ, ఎదటివాళ్లు ఏమనుకుంటారో అన్న సంశయాలూ వుండేవి కాదు. ఆమె మనసెపుడూ వున్నత పథాలలోనే విహరిస్తూండేది.

ఈ ప్రపంచంలో తను ఒక భాగంకాకుండా, ప్రపం

చంతో పాటు జీవించడం అలవరచుకుంది హెలెన్ కెల్లర్. ఒక విధంగా ఆమె యోగిని. ఇంతటి నిరంతర కార్యక్రమం లో కూడా ఆమెకి బోలెడంత టైము మిగిలేది. ఒక్కతే తనగదిలో చీకట్లో కూచుని - తన ఆలోచనలతో తను కాలం పొద్దుపుచ్చేది. బైబిల్ కథలూ, గ్రీకు కావ్యాలు - మహాప్రవక్తల జీవితాలూ - ఆమెకి నూతన శక్తి సమకూరు స్తూండేవి. ఏదేనా ఒక కొత్తభావమో, ఒక క్రొత్త ప్రయో గమో కనబడగానే చిన్నపిల్లలకి మల్లే అది అందరికి చెపుతేగాని నిద్దర పోయేదికాదు. ఎల్లవేళలా ఆమెని కని పెట్టుకుండే పాలీ థామ్సన్ ఒకవిధంగా ఆమెకి లోకపు సింహద్వారం. పాలీకి హెలెన్ లోని చిన్నతనమూ, అమాయకత్వము - ఆమె బంధనలూ పరిమితులూ - సమ స్తమూ తెలుసు. ఒకవిధంగా యీ పాలీ, హెలెన్‌కి చర్మ చక్షువుగా రూపొందింది.

## ఫిబ్రవరి 1952

హెలెన్ యింటిఆవరణలో ఒకమూలగా జపాన్ లాంతరు వుంది. పదిహేడవ శతాబ్దానికి చెందిన రాతి లాం తరు అది. తొమ్మిదడుగుల ఎత్తు - ఎమనాకానుంచి వచ్చిన ఆ బహుమతి, లోపల ఒకదీపంతో ఎల్లవేళలా వెలుగుతూం టుంది. హెలెన్ కెల్లర్ లోని తృప్తిపడని ఆత్మవేదనకి అది ఒక చిహ్నం అనేది పాలీ థామ్సన్ ఆదీపం చూపిస్తూ.

బ్రయిలీలోకి తర్జుమా చెయ్యవలసిన పుస్తకాలు ఎప్పటికపుడు చూపుతూండేది హెలెన్. వెండేల్ ఫిలిప్సు

వుపన్యాసాలన్నీ బ్రయిలీలోకి తర్జుమా చేయించాలని ఆమె అభిలాష. ఈ ఫిలిప్స్ బోస్టన్ నగరంలోని సంఘ సంస్కర్తలలో ఒకడు. హెలెన్‌కి ఆయనతో పెర్కిన్స్ సంస్థలో వున్నప్పటినుంచి పరిచయం. ఒకోసారి హెలెన్ మాట్లాడుతున్నపుడు, సంభాషణ అమాంత్రం వుపన్యాస ధోరణికి మారిపోయేది. డాక్టర్ హోవ్, ఆయన చుట్టూగల స్నేహితులూ – ఆ చిన్ననాటి స్మృతులూ – ఆమెని ఎప్పుడూ వెంటాడేవి.

నేనూ మా అబ్బాయీ ఎన్నో సంవత్సరాల క్రితం తర్జుమా చేసిన 'ఎమియల్స్ జర్నల్' బ్రయిలీలో ఆమె చదవ నారంభించింది. మొన్న సాయంత్రం ఆ విషయమై మేము ముచ్చటిస్తూ "అందులో మెచ్చుకోదగ్గదీ సిగ్గు పడవలసిందీ కూడా చాలావుంది" అన్నది,

"ఎమియల్స్ జర్నల్ నాకెందుకిష్టమంటే – నాకది చదువుతుంటే టీచరు జ్ఞాపక మొస్తాడు. మాయిద్దరికి అనేక విషయాల్లో పోలికలున్నాయి. సౌందర్యంపట్ల ఆపేక్ష – ప్రకృతిమీదా మానవులమీద అమితాను రాగమూ కన్పిస్తాయి.

"ఈ జర్నల్ని నేను ఒకఉత్తమ గ్రంథంగా భావిస్తాను. చెప్పేందుకు మనసులోని భావాలు యింకిపోతే యీ చెరువు వద్దకి వెళ్లి కావలసినంత స్వచ్ఛమైన జలం తెచ్చుకోవచ్చు. యూదుల మీద కొందరికిగల కోపం ఆమె క్షమించలేక పోయింది."

నేనీ మధ్యనే హెచ్. జి. వెల్సు "అమెరికాలో అతి ఆశ్చర్యకరమైన విషయం హెలెన్ కెల్లర్," అని ఎక్కడో అనడం చదివాను. ఆలివర్ వెండల్ హోమ్స్ మార్క్ ట్వేనుల కాలంనుంచీ వెల్సుదాకా ప్రపంచప్రజలని ముగ్ధులుగా చేసిన, ఏకైకవ్యక్తి యీమె ఒక్కతే! మరొక ఆంగ్ల రచయిత కొద్ది సంవత్సరాల క్రితమే యీమెని - నయాగరాతో పోల్చాడు.

హెలెన్ స్వభావంలోని ఏఏ గుణాలు యీ పరిశీలకులని ఆకర్షిస్తున్నాయి? ఆమెలోని సాహస గుణమా? లేక బుద్ధి తీక్షణతా? ఒకసారి పడమటి వర్జీనియా కొండల మీదుగా విమానంలో వెళ్తున్నపుడు, ఆమె వైమానికుణ్ణి అడిగింది - "మనం యిప్పుడు ఎనిమిదివేల అడుగులపైన లేమా?" అని. వైమానికుడు తన కాబిన్‌లోకి చూసి - "అవును, సరిగా ఎనిమిది వేలే" అన్నాడు.

మరొకసారి రోమ్ నుంచి లండన్ వస్తున్నపుడు - కెప్టెన్ లాంప్ అను పైలెట్ - ఈ బధిరాంధురాలిని కాక్‌పిట్‌లో కూచోపెట్టి విమానం నడపమన్నాడు. కార్సికా మీదుగా విమానం ఎగురుతున్నపుడు. "పైకీ, కిందకీ - వెనక్కీ - ముందుకీ వెళ్లడమూ - కుడి ఎడమలుగా వరగడమూ యివి గ్రహించి - అలాజరక్కుండా కొద్దినిమషాలు పాటు నేను విమానం నడిపాను. పైలెట్ అంటే ఎంత జాగ్రత్తగా వుండాలో, అలసట అనేది లేకుండా ఎంత కష్టబడి పని చెయ్యాలో నాకు ఆ కొద్దినిముషాల అనుభవంలోనూ తెలిసింది."

ఒకసారి నేను పాలీని అడిగాను: హెలెన్ కెల్లర్ మొట్టమొదటిసారి కాథరిన్ కార్నెల్‌ని ఎక్కడ కలుసుకుంది? – అని. బోస్టన్ నగరంనుంచి ఎక్కడికో వెళ్తుండగా రైలు ప్రయాణంలో కలుసుకున్నారుట. రైలెక్కడో ఆగేసరికి తాము నెమ్మదిగా డైనింగ్ కారులోకి వెళ్లేటప్పటికి – అక్కడ తమకి స్వాగతం చెప్పేందుకు కాథరిన్ కన్పించిందిట.

ఎప్పుడేనా పాలీ థామ్సన్ తను ఒక్కర్తె ఏదేనా ప్రదర్శనకి వెళ్లామనుకుంటే, హెలెన్‌ని కాథరిన్ డ్రస్సింగ్ రూమ్‌లో వదిలిపెట్టి వెడ్తుందిట. హెలెన్ ఎక్కడికి వచ్చినా తనవెంట ఒక బ్రెయిలీ గ్రంథం తెచ్చుకురావడం అలవాటు. కాథరిన్ రంగస్థలంమీదకి వెళ్లి తనపాత్ర అయిపోగానే మళ్లీ లోపలికివచ్చి హెలెన్‌తో, ఆ నాటి నాటకం తన పాత్రాభినయనం, రంగస్థల విశేషాలూ యిత్యాది చెబుతూండేదట. ఒక్క కాథరిన్ వద్ద తప్ప యింకెవరి వద్దా వదిలి పెట్టేదికాదు హెలెన్ని.

ఇవాళ హెలెన్‌కి, జపాన్‌లోని ఎవరో తెలియని స్నేహితుల వద్దనుంచి, ఒక సంగీతపు పిట్ట క్రిస్‌మస్ బహుమతిగా వచ్చింది. ఆ సంగీతపు పిట్టని ఆ అపరచిత స్నేహితుడు – (Unknown Friend) విమానంలో పంపాడు. హెలెన్ పెంపుడు పక్షుల్లో యీ కొత్త పక్షి మరొకటి అయింది. రాళ్లూ పువ్వులూ కనపడనట్లే – హెలెన్‌కి యీ పక్షులుకూడా కనపడవు. అయినప్పటికీ యీ పెంపుడు పక్షులన్నిటికీ వేరువేరు గూళ్లు కట్టించి వాటిరెక్కల అం

దానికి ఆశ్చర్యపడటం, అవి ఎలా ఎగిరేదీ తెలుసుకోడం, హెలెన్‌కి సరదా,

## జూన్ 1952

లూయీబ్రయిలీ శతవార్షిక సందర్భాన హెలెన్ పారిస్ వెళ్లింది. అంధుల పాలిట యీ బ్రయిలీ 'దీపకళిక' వంటివాడు. వెనకటి అక్షరాలలో కొంత మార్పు తీసుకుని వచ్చి, కొంచెం ఎత్తు అక్షరాలద్వారా అంధులు తెలుసుకునేందుకు వీలుగా - అక్షరమాల కూర్చాడు. బ్రయిలీ పుణ్యమా అని అంధులకి తేలిగ్గా, నేర్చుకోదగు భాష వొకటి వ్యాప్తిలోకి వచ్చింది.

ఆ వార్షికోత్సవంనాడు బ్రయిలీలోని కుటుంబంవారితో పాటు హెలెన్ కూడా వుంది - ఆయన సమాధిస్థలం దర్శించి వచ్చింది - ఫ్రాన్సులోని రాజకీయ వేత్తలని - తత్వవేత్తలని, కవులని, భూస్థాపితంచేసి పవిత్ర ప్రదేశంలోనే (The Pantheon) యీాయన అస్థికలని కూడా పదిలపరిచారు. అటువంటి మహానీయుని కృషిని గుర్తించినందుకు గాను సోర్‌బనీ (Sorbonne) విశ్వవిద్యాలయాధికారులని యీామె ప్రస్తుతించింది. ఫ్రెంచిలో ఆమె మాట్లాడుతున్నపుడు, పరిశుభ్రమైన ఆమెభాషా ప్రవాహానికి - ఫ్రెంచివారు తన్మయులయి, ఆమెని 'ఎ షెవలియర్ ఆఫ్ ది లీజియన్ ఆఫ్ ఆనర్' అను గౌరవ బిరుదు ప్రదానంతో సత్కరించారు.

హెలెన్‌కి పద్యకావ్యాలపట్లగల ప్రేమ అనంతం. ఆడెన్ (Auden) పొయిట్రి ఆమెకొద్దిగానే చదివిందిగాని ఆ కొద్దితోటే ఆమె యీ అభిప్రాయంచెప్పింది. "స్వర్గంలోని

జ్యోతులకు - భూమిమీదగల మంటలకీ గల వ్యత్యాసం చూపగలపదవిన్యాసం ఆడెన్ కవితలో వుంది.'' ఆయన లోని చమత్కారమూ, ప్రస్తుతసమస్యలు జీర్ణించు కోడంలోగల అసమానప్రజ్ఞ, ఆ భావసంపదా, గొప్పవి అం టుంది.

ఒకరోజున మేము న్యూయార్కులో పార్కు ఎవెన్యూ కొసని నిలబడ్డాం. ఒక టాక్సీ మాదగ్గరికి వచ్చి ఆగింది. డ్రైవరు బయటకి తొంగిచూసి - ''యిప్పుడే హెలెన్ కెల్లర్‌ని దింపి వచ్చాను'' అన్నాడు. హెలెన్ కెల్లర్‌ని దింపిరావడంలోగల ఆనందమతను పట్టలేకుండా వున్నాడు. ఈ సంగతి విన్న పాలీ థామ్సన్ కూడా సం తోష పడింది. కొత్తవిషయాలు తెలుసుకోడం, గొప్ప వ్యక్తు లతో పరిచయం కలగడం అదొక అపూర్వ బలం. హెలెన్ కెల్లర్‌ని తెలుసుకోవడంలోగల ఆనందం ఆమెతో పరిచయమైన మీదటగాని తెలియదు.

హెలెన్ యిప్పుడే ప్రెసిడెంట్ ఐషన్‌హోవర్ దగ్గిరకి వెళ్లివచ్చింది. ఇప్పటికి ఎనమండుగురు ప్రెసిడెంట్లు - ఆమెని తమ వైట్‌హౌస్‌కి ఆహ్వానించారు. ఈసారి హెలె న్‌కి, పాపం, ఒక్కటే విచారంగావుంది. వైట్‌హౌసు ఆవరణలో గల చెట్లపేర్లు తెలుసుకోలేక పోయానే అని.

## జూన్ 1953

---

హెలెన్‌కి డెభైమూడేళ్లునిండాయి. అనంత కాల వాహినిలోనూ చరిత్రగతిలోనూ నిలవదగ వ్యక్తి ఆమె.

ఇంత పెద్దతనంలోనూ, ఏనాటి కానాడు, లోకవార్తలూ ప్రపంచ స్థితి గతులూ ఆమె తెలుసు కుంటూ వుంటుంది. రెండు నెలలపాటు దక్షిణ అమెరికా పర్యటించి నాలుగు రోజుల క్రితమే ఆమె యింటికొచ్చింది. రాజకీయాల గురించి మాట్లాడేందుకు యీ రెండు నెలలలోనూ జరిగిన సంగతులు తెలియకపోవడంవల్ల, శామ్యూల్ పెప్స్ డైరీ (Samuel Pepys Diary) గురించి మాట్లాడుతోంది. పెప్స్ గురించి మేము మర్చిపోయిన విషయాలు తను చెప్పడం మొదలు పెట్టింది.

ఆమె మనసులో ఎన్నిసంగతులుంటాయో చెప్ప లేను. ప్రతిదీ తెలుసుకోవాలనే కుతూహలమేకదా! లా అర్జింటినా డాన్సు, రాబిన్సన్ జఫర్స్ పద్యకావ్యం, అడవి పువ్వులతో సంభాషణ వంటి చిన్న పిల్లల పలుకులు (తన అరచేతిలో చిన్నపిల్లలు రాశారు) యివన్నీ ఒకటి తరువాత ఒకటిగా ఆమె మనోవీధిని గిర్రున తిరుగుతాయి.

ఇవ్వాళ పాలీ థామ్సన్ మమ్మల్ని, హెలెన్‌కి ముందు చెప్పకుండా - ఆమె స్టడీలోకి తీసుకెళ్లింది, లోపలికి ప్రవేశించి లైటువేసింది పాలీ, కాని ఆ లైటు వల్ల మేము వస్తున్నట్లు తెలుసుకోలేదుగా హెలెన్. యోచనా ముద్రలో నిమగ్నురాలైన హెలెన్ ప్రార్థనలో మునిగిన భక్తురాలి వలె వుంది. ఆమె ముఖం ఆనందంతో తేజరిల్లు తోంది. ఆత్మ, భువినుంచి దివిలోకి చూస్తున్నట్లుగా ముఖ మండలమంతా సంతోష రేఖలతో విలసిల్లుతోంది. ఆమె జీవిత రథాన్ని నడిపించిన స్వీడెన్ బోర్గ్ తత్వోపదేశం

మాకు ఆక్షణాన గుర్తుకొచ్చింది. ఈమె జీవితానికి - యీమె జీవితనౌకకి ఆయన ఫిలాసఫీ ఒక చుక్కాని అయింది.

ఆర్థర్ కోయిష్టలర్ రచించిన 'ది యేజ్ ఆఫ్ లాంగింగ్' (The Age of Longing) చదువుతుంటే నాకు హెలెన్ కెల్లర్ జ్ఞాపకం వచ్చింది. కోయిష్టలర్ ఒక కర్నల్ స్వగతంలో, అమెరికన్ స్త్రీలు, బ్రిడ్జిఆడటంలో బిజీగావున్నారు. అమెరికన్ స్త్రీలోకానికి అంతకి మించిన వృత్తమ జీవన విధానం కనపడటంలేదు; గొప్పవి సాధించేందుకు వారికి వోపిక లేదు. జోన్ ఆఫ్ ఆర్క్ (Maid of Orleans) రోజా లగ్జంబర్గ్, మేడమ్ క్యూరీ, బ్రాంటీ సిస్టర్స్, ఫ్లారెన్సు నైటింగేలు, క్రుప్స్కయా, - ఇటువంటి వారిలో ఒక్కరిని అమెరికన్ స్త్రీజాతి సృష్టించ గలిగిందా? - అని ప్రశ్నింప జేస్తాడు కోయిస్టలర్ కర్నల్ చేత. అమెరికాలో కూడా కొందరు లేకపోలేరు. వారిపేర్లు విశ్వవ్యాప్తమై వుండక పోవచ్చు. డోరతీ డిక్సు, జేన్ ఏడమ్స్, ఎమిలీ డికెన్సన్, మొదలైన వారిమాట ఎటున్నా హెలెన్ కెల్లర్ మటుకు కోయిస్టలర్ చెప్పిన లిస్టులోకి రాకపోదు.

# 13. మరొక్క మాట

హెలెన్ మమ్మల్ని చూడటానికి వస్తూ - మా కొత్త యింట్లోకి పనికివస్తుందని జపాన్ వారిలక్కపాత్ర ఒకటి పట్టుకొచ్చింది. పెద్దదిగావున్న ఆ లక్కపాత్రమీద గాడ్ ఆఫ్ లాఫ్టర్ (God of Laughter), సంతోష దేవత, చిత్రింపబడింది. హెలెన్‌కి ఎందరు దేవుళ్ల మీద నమ్మకముందనే విషయం అటుంచి, సంతోష దేవత అంటే ఆమెకి చాలయిష్టమని చూస్తూనే చెప్పవచ్చు. వయసుతోపాటు ఆమెలో చమత్కృతి, హాస్యమూ (Sense of Humor) పెరిగాయి. గాంధీజీ జీవిత చరిత్ర రాసిన ఒకాయన కూడా - గాంధిజీకి వయసుతోపాటు ఓర్పు, మనుషులలోని మూర్ఖతకి సానుభూతి - చుట్టూవున్న పరిసరాలతో కొంతదాకా సమాధానపడి నవ్వగలగడం అలవడ్డాయని అంటాడు. మహా పురుషులజీవితాలందరిలోనూ వయసుతోపాటు విచారమూ - ఆ విచారాన్ని మరిపింపజేసే చమత్కార సంపద అలవడతాయిట. హెలెన్ కెల్లర్‌లో కూడా అదేవిధంగా జరుగుతోంది.

తనలో ఏదో గొప్పతనమూ పూజనీయతా వుందని ఎవరైనా అంటు, హెలెన్ కెల్లర్‌కి చికాగ్గా వుండేది. సువిశాలమైన జీవితంలోకి, స్వార్థచింత మర్చిపోయి స్వలాభాలు విస్మరించి ప్రవేశించగలగాలి. అప్పుడు మనసు నూతన స్వాతంత్ర్యంలో రెక్కలు కట్టుకున్నదవుతుంది. భావోద్రేకం యావత్తూ, ప్రేమమయ వాతావరణంలో విని

యోగింపబడుతుంది. సామాన్యుల జీవితాల్లో చాలాభాగం నిద్రాణంగానూ కాంతిరహితంగానూ గడుస్తాయి. ఏదో కొన్ని ప్రత్యేక పరిస్తితులు ఏర్పడిన మీదటనే వారు కార్యాచరణకి పూనుకుంటారు. మిగతా సమయమంతా - నిద్రలో జోగుతూ గడిపి - తమ బ్రతుకులో స్వారస్యం లేదని వాపోతారు. ఉన్నతులు ఎప్పుడూ కార్యాసక్తులై ప్రేమ అనే కెరటంమీద తేలియాడుతూ, స్వప్రయోజనం మర్చిపోవడంలో ఆనందం పొందుతూ, యితరుల కోపతాపాలకి జడియక తాము నమ్మిన లక్ష్యాలపట్ల పట్టుదల చూపుతూ - తోటిమానవుల పట్ల కరుణతోనూ దయతోనూ ప్రవర్తిస్తూ, తమజీవితంలోని ప్రతిదినమూ నిత్యనూతనంగా చేసుకుంటూ, మార్గదర్శకులు కాగలుగుతారు. తమ ఆధ్యాత్మిక శక్తినీ మానసిక శక్తినీ నిత్యజీవన వ్యవహారాలలో వుపయోగించడం వల్లనే చాలామంది సాధుపుంగవులు లోకపూజ్యులు అయ్యారు. విలియమ్ జేమ్సు హెలెన్ కెల్లర్ కి ఆమె చిన్నతనంలో ఓ వుత్తరంరాశాడు: ''నీవు యీ లోపాలతో జన్మించడం - అదొకరకంగా ఒక అపూర్వవరం. ఈ కష్టాలు ఒక్కటొక్కటే దాటుకుంటూ రావడంలో, నువ్వు అద్భుతానుభవాలు గడించుతావు.'' విలియమ్ జేమ్సు యిప్పుడు లేడు. ఒకవేళ గాని ఆయన జీవించి వుంటే. హెలెన్ కెల్లర్ జీవితాన్ని వుద్దేశిస్తూ ''నీవు ధన్యురాలివి'' అని ఆయన తప్పకుండా అని వుండేవాడు.

భాగ్యవంతుల కుటుంబాల్లో జన్మించినవారూ అందచందాలతో తులతూగేవారూ, సుఖంగా వుండరా అన్న

ప్రశ్నకి హెలెన్ కెల్లర్ ఒకసారి, ఎప్పుడూ ఈదురోగోడో మంటూఅసౌఖ్యంలో వుండటంలో ఏమీ ఘనత లేదు... కష్టాల పాలవడమే ఉత్తమ జీవితానికి నాంది అనుకోవడము కూడా మూర్ఖతే. వ్యక్తి పెరుగుదలకి మనోహ్లాదం (Delight) కొంతవరకూ కావాలి. ఉత్సాహమూ - మనోహ్లాదమూ యీ రెండిటి వల్లనే స్వానుభవం పెరుగుతుంది. నాలికకు రుచిగా వుంటేనేగాని ఆహారం తిని జీర్ణించుకో గలుగుతున్నామా? అందులో మళ్లీ వేరు వేరు రుచులు లేవా? వేరు వేరు అభిప్రాయాలు మనోప్రాంగణంలోకి ప్రవేశిస్తాయి. కొన్నిటిని మనసు చేరదీస్తుంది - మరికొన్నిటిని తరిమి వేస్తుంది. ప్రపంచంలోని ప్రతి కదలికలోనూ - చైతన్యాన్ని (Joy) చూడలేనివారు జీవిత స్వారస్యాన్ని గ్రహించలేకపోతు న్నారన్నమాట. చైతన్య లక్షణం లోపించినప్పుడు, జీవితమే జడమై పోతుంది. ఆనందమే చైతన్యపు ప్రధాన ధర్మం. ఆనందంగా కనపడనీయండి, చైతన్యంగా కనపడ నీయండి - యీ 'జాయ్' మనచుట్టూ ప్రపంచంలోని సమస్త విపర్యయాలకీ వాటివాటి విలువలనిచ్చి, - ఏకత్వాన్ని సమకూరుస్తోంది. విశ్వాసం అనునది మంచితనంలో మానవునికి గల దృఢతర నమ్మకమన్నమాట. ఈ విశ్వాసము మానవుడిని చుట్టూగల బంధాలనుంచి రక్షించడమే కాకుండా మనసుని భయోత్పాతాలలో పడకుండా కాపాడ గలుగు తుంది.

ఈ కాలంలో కొందరు ప్రముఖులు నిరాశావాదులై పోయారు. నిరాశావాదులకీ నిరీశ్వరవాదులకీ హెలెన్

జీవిత మొక సమాధానం. భౌతికరంగంలోనే కాక ఆధ్యాత్మికం గానూ నైతికంగానూ ఆమె కృషిచేసి - మానవప్రగతిపట్ల విశ్వాసం కలిగేటట్లు తనుజీవించ గలిగింది. విధివాదంతోనూ - మతరాహిత్యంతోనూ మానవుని మంచితనంమీద - విశ్వాసం పోగొట్టిన యీ కాలంలో, హెలెన్ కెల్లర్ - ఆ విశ్వాసాన్ని పునః ప్రతిష్ఠించింది. కళాకోవిదులైనా, మత ప్రవక్తలైనా మానవ స్వభావంపట్ల అమిత విశ్వాసంతో ముందుకు నడిచారేగాని అదివొక 'స్నేక్‌పిట్' (పాములగుట్ట) కాదని వారు చెబుతూ వచ్చారు. మానవునిమీద పూర్తి విశ్వాసం తోటే వారు ప్రతి అడుగూముందుకు వేస్తూ వచ్చారు. ఆల్బర్ట్ స్విడ్జర్ వంటి మహనీయుని జీవితం చూస్తే, యీ ప్రపంచంలో మంచితనంపట్ల ఎంత దప్పికవున్నదో తెలుస్తుంది. ఈ మధ్య అనేక మంచి రచయితలు ఆ విషయమై తమగ్రంథాల్లో చెపుతున్నారు. మంచితన మొక్కటే నిజమైనవిలువ. మిగతావన్నీ దానిముందు తేలిపోతాయి. మంచితనంవల్లనే లోకాన్ని ప్రసన్నం చేసుకొని మనంప్రసన్నులం కాగలుగుతున్నాం. సోమర్‌సెట్ మాం 'సమ్మింగ్ అప్' లో ('Summing up') ,"అడపాదడపా నిజమైన మంచితనాన్ని చూట్టం తటస్థించినపుడు నా హృదయం పూజ్యభావంతో ఆ సౌజన్యమూర్తికి మోకరిల్లుతుంది," అంటాడు. హెలెన్ కెల్లర్‌ని చూస్తే - మనకి అక్షరాలా అలాగే అనిపిస్తుంది.



